# అపరాధ పరిశోధన

రూ.5.50 జులై '83

సప్లిమెంట్

115



అపరాధ పరిశోధన అనుబంధం—115

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## వ్రేలిముద్రల మహిమ

రచన: వసుంధర

## మాయమయిన శవాలు

రచన: బొమ్మిడి అచ్చారావు

## ఎర మనుషులు

చన: బి. రాజేశ్వరి

## చిత్రమైనది విధినడక

రచన: టెంపోరావ్

విషసర్పాలు - ఐదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 115
జూలై, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# వేలిముద్రల మహిమ

వసుంధర

రాజారావు తలుపు తీయగానే ఇన్‌స్పెక్టర్ చౌదరి కనిపించాడు — "నువ్వా — ఇంకా యెవరో అనుకున్నాను—" అన్నాడతను.

"ఇంకా యెవరో కూడా వున్నారు చూడు—" అన్నాడు చౌదరి.

చౌదరి వెనుకనున్న వ్యక్తిని రాజారావు అప్పుడు చూశాడు. అతడికి ముప్ఫై ఏళ్ళుండవచ్చు. పచ్చటి ఛాయ. మనిషి బాగున్నాడు.

"ఈయన రంగారావుగారని నా కొత్త మిత్రుడు—" అన్నాడు చౌదరి.

అంతా లోపలకు వెళ్ళి కూర్చున్నారు.

ప్రస్తుతం చౌదరికి ఓ క్లిష్టమైన కేసు తగుల్కొన్నది. నేరస్థుడెవరో చూచాయగా తెలుస్తున్నది. అయితే అతడికి గొప్ప గొప్ప పరిచయాలున్నాయి. తిరుగులేని ఆధారాలు దొరికితే తప్ప అతడిని కస్టడీలోనికి తీసుకునే

ప్రయత్నం చేయడానికి లేదు. కేసును పరిష్కరించడంలో జరిగే జాప్యం గురించి పై అధికారుల ఒత్తిడి చాలా యెక్కువగా వున్నది.

"నీకెప్పుడూ ఇంతే—నీ మెత్తటి తనమే నీకిన్ని సమస్యలూ తెచ్చిపెడుతున్నవి—" అన్నాడు రాజారావు.

"ఒక విధంగా నువ్వు చెప్పింది నిజమే—కానీ మన మిప్పుడు డిపార్టుమెంటు వ్యవహారాల సంగతి మాట్లాడవద్దు. కాసేపు వాటి గురించి మరిచిపోదామనే ఇక్కడకు వచ్చాను—" అన్నాడు చౌదరి.

మిత్రులు ముగ్గురూ కబుర్లలో పడ్డారు. కబుర్ల మధ్యలో — "అన్నట్లు ఈయన గురించి చెప్పడమే మరిచాను. రంగారావుగారు నా స్నేహితుడు. నువ్వు చాలా పెద్ద ఆస్తికుడవు కదా! మీరిద్దరూ వాదించుకుంటూంటే విని ఆనందించాలనిపించి ఈయనిక్కడకు తీసుకునివచ్చాను" అని—"రంగారావుగారూ—మీరు ప్రపంచంలో యెవరి చేతనైనా దేవుడులేడని ఒప్పించగలరేమో కానీ మా రాజారావుచేత మాత్రం ఒప్పించలేరు—" అన్నాడు చౌదరి.

"దేవుడెక్కడున్నాడండీ—" అన్నాడు రంగారావు నవ్వుతూ.

"మీకు తెలుసుకోవాలనివుంటే చూపిస్తాను—" అన్నాడు రాజారావు తనూ నవ్వుతూ.

"ఎప్పుడు?" అన్నాడు రంగారావు ఆశ్చర్యంగా.

"ఇంకో అరగంటలో!"

"ఎక్కడ?"

"ఇక్కడే!"

రంగారావు ఆశ్చర్యంగా—"మీరు వేళాకోళమాడుతున్నారు—" అన్నాడు.

"వేళాకోళంకాదు రంగారావుగారూ! నాకూ జీవితంలో ఎన్నో సమస్యలున్నాయి. దేవుడనేవాడున్నాడన్న ఒక్క ఆలోచన నన్ను ప్రశాంతంగా వుంచుతుంది. అందుకే నేను యెప్పుడూ నిశ్చింతగా వుంటాను. ఈ రోజు మా యింటికి చిదానందస్వామి అనే యోగిపుంగవుని ఆహ్వానించాను. ఆయన సాక్షాత్తూ దేవుడి అవతారం. ఆయన పక్కన ఉన్నపుడు మనం అన్ని అనుభూతులూ మరిచిపోతాం—" అన్నాడు రాజారావు.

"దేవుడంటే ఆ చిదానందస్వామా?" అని రంగారావు నవ్వి—"మీరు వేషంలో ఉన్న ఏ గూండాయో అయియుంటాడాయన—" అన్నాడు.

"ఆయన మహిమ గురించి ఎన్నో కథలున్నాయి. ఒక్కసారి ఆయన ఏ ఇంటనైనా పాదంపెట్టి మంచి తీర్థం స్వీకరించి వెళ్ళారంటే ఆ తీర్థంతోపాటే ఆ ఇంటి సమస్యలూ, బాధలూ, కష్టాలూ ఆయనకు కైంకర్యమైపోతాయి—"

"అంతా మూఢనమ్మకం—" అన్నాడు రంగారావు.

"నేను మూఢుడిననీ మీ అభిప్రాయమా?" అన్నాడు రాజారావు.

రంగారావు తడబడి — "అలాగని నేననలేదే!" అన్నాడు.

"మీరు నా నమ్మకాన్ని మూఢనమ్మకం అన్నారు. దాని అర్థం అదే కదా!"

"అయాం సారీ—నా అభిప్రాయం అదికాదు—" అన్నాడు రంగారావు.

"ఒక్కసారి చిదానందస్వామిని చూస్తే మీ అభిప్రాయాలింకా మారతాయి—" అన్నాడు రాజారావు.

సరిగ్గా అరగంట తర్వాత చిదానందస్వామి ఆ ఇంటికి వచ్చాడు. రంగారావాయన్ను వింతగా చూశాడు.

చిదానందస్వామి బలంగా, దృఢంగా, కండలు తిరిగి వున్నాడు. కనులలో దివ్య తేజస్సు కనఁడుతున్నది. పొడవాటి జుత్తును మునుల రీతిని ముడివేసుకున్నాడు. ఆయన గెడ్డంలో యెక్కడా తెల్లవెంట్రుక కనబడడం లేదు. బాగా యువకుడే అయుండాలని చూడగానే అనిపిస్తుంది.

"నా వయసు నూటడెభై—" అన్నాడు చిదానందస్వామి. ఆయన పచ్చని శరీరానికి కాషాయవస్త్రాలు కొత్త అందాన్నిచ్చాయి. రుద్రాక్షమాల చేతిలో క్రమబద్ధంగా ఆగకుండా తిరుగుతున్నది. ఆయన గొంతులో ఒకవిధమైన గాంభీర్యం, ఆ గాంభీర్యంలో ఒకరకమైన ఆకర్షణ.

చిదానందస్వామి కొనసాగించాడు—"హిమాలయాల్లో నా గురువు నాకు అయిదువందల సంవత్సరాల ఆయుర్దాయం నిర్ణయించాడు. అయితే నాకు అంతకాలం జీవించడం ఇష్టంలేదు. ప్రపంచంలో అందరి కష్టాలకూ నా ఆయుర్దాయాన్ని చెల్లువేసి చేతనైనంతలో ఉడతా భక్తిగా మానవసేవ చేయాలనుకుంటున్నాను...." అని—"నాయనా — మంచి తీర్థం తీసుకునిరా—" అన్నాడాయన.

రాజారావు భక్తి శ్రద్ధలతో ఆయనముందు ఓ పాల గ్లాసును ఉంచి — "తమరివి స్వీకరించాలి స్వామీ!" అన్నాడు. అప్పుడక్కడ అతడి భార్య, ఇద్దరు పిల్లలు

కూడా వున్నారు.

"భక్తుల యింట మంచితీర్థం తప్ప వేరేమీ స్వీకరించను నేను. నాకు కానుకలిచ్చేవారు నా ఆశ్రమానికి వచ్చి స్వయంగా ఇచ్చి వెడతారు—" అన్నాడు చిదానందస్వామి.

"అదే మంచి తీర్థం అనుకోండి స్వామీ-" అన్నాడు రాజారావు.

స్వామి నవ్వి—"నీ యింట పాలుతాగినా నీళ్ళు తాగినా ఈ రోజుతో నీ కష్టాలు గట్టెక్కుతాయి. నీ బాధలు తీరిపోతాయి. అయితే నీ యింట నేను తాగే ప్రతి నీటిబిందువూ నాకు విషతుల్యం. నీ ఇబ్బందులన్నింటినీ ఆ నీటిలోనికి రప్పించుకుని తాగుతాను నేను. మంచి తీర్థం తీసుకున్నాక నా ఆయుర్దాయంలో కొంత తగ్గిపోతుంది. మంచి తీర్థానికి బదులు పాలు తీసుకుంటే నా ఆయుర్దాయం అంతకు పదిరెట్లు తగ్గిపోతుంది. నాకు తొందరగా చనిపోతానని భయంలేదు. జీవితంపైన మమకారమూ లేదు. వీలైనంతలో ఎక్కువమంది కోసం నా ఆయువునుపయోగించాలన్న అభిలాషమాత్రం ఉన్నది-" అన్నాడు.

"స్వామీ—నా ఇబ్బందులను నాకే ఉండనివ్వండి. తమరికి నేను మంచితీర్థం కూడా ఇవ్వను—" అన్నాడు రాజారావు కంగారుగా.

"వెర్రివాడా! నన్ను రక్షించాలనుకోవడం నీ తెలివి తక్కువతనం. నేనే యింట అడుగుపెట్టినా మంచితీర్థం తీసుకోవాలన్నది గుర్వాజ్ఞ!" అన్నాడు చిదానంద స్వామి. ఆయన రాజారావు ఇచ్చిన మంచినీళ్ళు త్రాగి— "ఈ గ్లాసును ఒక వారం రోజులపాటు పూజామంది

రంలో ఉంచుకో—నీకు శుభమవుతుంది—" అన్నాడు.

"తమ ఆజ్ఞ స్వామీ!" అన్నాడు రాజారావు. చిదానందస్వామి వెళ్ళిపోయాడు.

"మనిషిలో గొప్ప ఆకర్షణశక్తి వున్నది-" అన్నాడు రంగారావు.

"దేవుడంటే ఏమనుకున్నారు?" అన్నాడు రాజారావు.

"మళ్ళీ దేవుడి ప్రసక్తి తీసుకుని రాకండి. గాంధీ సినిమా తీసిన అటెన్‌బరో కూడా—గాంధీని మానవుడిగానే గుర్తించి ఆయనలోని మానవత్వాన్ని అర్థంచేసుకుందుకు ప్రయత్నిద్దాం అన్నాడు. మనిషి మనిషిగానే చూడ్డం మనం నేర్చుకోవాలి—" అన్నాడు రంగారావు.

"కొంతసేపు చిదానందస్వామి సమక్షంలో ఉన్న పుణ్యానికి మీకూ యేమైనా ఇబ్బందులుంటే తొలగిపోతాయి—" అన్నాడు రాజారావు — రంగారావు మాటలు గురించి పట్టించుకోకుండా.

సరిగ్గా అప్పుడే—"సార్ — టెలిగ్రాం—" అన్న కేక వినిపించింది.

టెలిగ్రాం రాజారావుకు. అతడాత్రుతగా అది అందుకుని చదువుకుని—ఓ పెద్ద కేక పెట్టాడు.

"ఏమయింది?" అన్నాడు చౌదరి కారణంగా.

"కోర్టులో మా దాయాదులు వేసిన దావా ఓడిపోయింది. మా నాన్నగారు టెలిగ్రాం ఇచ్చారు—" అన్నాడు రాజారావు.

ఈ దావా చాలా కాలంగా నడుస్తున్నది. యెవరు ఓడితే వారికి పాతిక వేలు నష్టం. రాజారావీ విషయమై చాలా బెంగగా వున్నాడు. దావా ఓడిన పక్షంలో

అతడు తండ్రికి పదివేల రూపాయలు ఎలాగో తెచ్చి ఇవ్వాలి. ఈ పరిస్థితుల్లో చిదానందస్వామిని అతడు తన ఇంటికి ఆహ్వానించాడు.

"కానీ ఈ పెటిల్గ్రాం చిదానందస్వామి మీ ఇంటికి రాకమునుపే ఇవ్వబడింది—" అన్నాడు రంగారావు.

"ఆయన్ను నేను మా యింటికి ఆహ్వానిస్తూ నా బాధ చెప్పుకున్నాను. ఇది జరిగి రెండ్రోజులయింది. ఆయన నాతో ఈ రోజు వస్తాననీ—అప్పటికి అన్నీ సద్దుకుంటా యనీ హామీ ఇచ్చాడు—" అన్నాడు రాజారావు.

"నా కేసుకు కూడా ఏదైనా పరిష్కార మార్గం లభిస్తుందేమో—" అన్నాడు ఇన్స్పెక్టర్ చౌదరి ఆశగా.

"తప్పక లభిస్తుంది. చిదానందస్వామి సాక్షాత్తూ దేవుడి అవతారం—" అన్నాడు రాజారావు.

రంగారావు ఆలోచిస్తూ—"మీరు నాకో ఉపకారం చేయగలరా?" అన్నాడు.

"చెప్పండి—" అన్నాడు రాజారావు.

"నన్నో సమస్య బాధిస్తున్నది. ఎలా బైట పడాలా అని ఆలోచిస్తున్నాను. చిదానందస్వామి మీ కిచ్చిన గ్లాసును నాకివ్వండి. ఓ వారం రోజులు దానిని మందిరంలో వుంచి మహిమ ఎలాగుంటుందో చూస్తాను. మా యింట్లో పూజామందిరం లేదు. కానీ దీనికోసం ఏర్పాటు చేస్తాను—" అన్నాడు రంగారావు.

"ఆహా చిదానందస్వామి మహిమ—నాస్తికుడి ఇంట పూజామందిరం వెలయనున్నది—" అన్నాడు చౌదరి.

రాజారావు ఆలోచిస్తూ — "స్వామి మాట నాకు శిరోధార్యం! ఆయన నన్ను వారంరోజులపాటు మా

యింట పూజామందిరంలో ఆ గ్లాసు నుంచమన్నాడు. మీకు కావాలంటే ఆ తర్వాత ఇవ్వగలను-" అన్నాడు.

రంగారావు అంగీకరించాడు.

## 2

"రవీ—ఇంకా ఎన్నాళ్ళిలా?" అన్నది రమ.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను—" అన్నాడు రవి.

"ఆలోచించి లాభంలేదు. మనం యెక్కడికైనా దూర ప్రాంతాలకు వెళ్ళిపోదాం—" అన్నది రమ.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను—" అన్నాడు రవి.

"ఇంకా ఎన్నాళ్ళు ఆలోచిస్తావు?" అన్నది రమ.

"ఏం చేయను రమా! నా దురదృష్టంకొద్దీ నువ్వు నా వివాహమైన రెండేళ్ళకి కనిపించావు. నా తండ్రి డబ్బు కోసం ఆశపడ్డంవల్ల తప్పితే నాకింత త్వరగా వివాహం జరగాల్సింది కాదు. ఇప్పుడు నాకో కొడుకు. నా భార్య మళ్ళీ గర్భవతి. ఈ జంఝాటాన్ని యెలా వదిలించుకోవాలో నాకు అర్థం కావడంలేదు—"

"ఇలాంటి వాటినుంచి ఉపాయంతో నే బయట పడాలి—"

"నీకేదైనా ఉపాయం తట్టిందా?"

"నాకు ఉపాయాలేమీ తట్టలేదు. కానీ నీకు చిదానందస్వామి పైన నమ్మకమున్నదా?" అన్నది రమ.

"నన్నడుగుతావేమిటి? ఆశ్రమంలో కొన్నాళ్ళుండి వచ్చినదానివి. నువ్వే చెప్పాలి—" అన్నాడు రవి.

"ఆయన్ను నేను పూర్తిగా అర్థం చేసుకోలేక పోయాను—" అన్నది రమ ఆలోచిస్తూ—"నాకు ఎవ్వరూ లేరు. జీవితమంటే విరక్తికలిగిన సమయంలో అనుకోకుండా నాకు స్వామి దర్శనం అయింది. ఆయన

ప్రేమగా ఆదరించాడు. ఆశ్రమంలో చేరాను. ఆ జీవితం నాకు నచ్చింది. ప్రపంచంలో నేనే కాకుండా నాకులా కష్టాలు పడుతున్నవారెందరో వున్నారని నాకు అర్థమైంది. నాకైతే ఎవ్వరూ లేరు. అందరూ ఉండీ, అన్నీ ఉండీ మనశ్శాంతి లేకుండా వున్నవారెందరో ఆశ్రమానికి రావడం చూసేక నాకు మరింత తృప్తి కలిగింది.

అయితే ఆరు నెలల క్రితం స్వామి నాపట్ల మరోలా ప్రవర్తించసాగాడు. ఆయన నా చేయి పట్టుకుని దగ్గరగా తీసుకున్నాడు. ఆ ఆదరణలో చల్లదనం లేదు. వేడి వున్నది. నేను భయపడ్డాను. అయితే ప్రతిఘటించాను."

రవి ఆవేశంగా—"అయితే ఆ స్వామిదంతా బూటకం అన్నమాట—ఈ కథ పత్రికలవాళ్ళకి చెబుదాం—" అన్నాడు.

"అలా తొందరపడకు. చిదానందస్వామిని అంత తొందరగా అర్థం చేసుకోనడం కష్టం—" అన్నది రమ. "నేను ప్రతిఘటించినా స్వామి ముందడుగు మానలేదు. ఆయన నన్ను బెదిరించాడు. బ్రతిమాలాడు. ఆఖరికి బలవంతంగా అనుభవించడానికి సిద్ధపడ్డాడు. అప్పుడు నే నాయన్ను బలంగా ఒక్క తోపు తోశాను. స్వామి క్రిందపడ్డాడు. కానీ కేక పెట్టలేదు. నేనాయనవంకే చూస్తూ నిలబడ్డాను. ఎందుకో పారిపోవాలని నాకు అనిపించలేదు. స్వామి నెమ్మదిగా లేచాడు. నా వంక చూసి చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులో కాసం లేదు. ప్రశాంతత వున్నది. నేను ఆ చిరునవ్వుకు పరవశించి అప్రయత్నంగా ఆయనకు రెండు చేతులూ జోడించి నమస్కరించాను. అప్పుడాయన ఏమన్నాడో తెలుసా?"

"ఆయన ఏమన్నాడో చెప్పక్కర్లేదు. అప్పుడేం

జరిగిందో చెప్పు—" అన్నాడు రవి ఆత్రుతగా.

"అదే చెబుతున్నాను—" అన్నది రమ—"బాలా—నువ్వింక ఆశ్రమ జీవనానికి పనికిరావు. తాత్కాలికమైన సాంఘిక, ఆర్థిక బాధలు నిన్ను ఆశ్రమానికి రప్పించాయి తప్పితే — ఆశ్రమవాసానికి తగవు నీవు. నన్ను భగవంతుడిగా భావించి నాకు నిన్ను సమర్పించుకునే స్థాయికింకా నీవు ఎదగలేదు. పైగా నాతో పొందువల్ల నీ పవిత్రత దెబ్బతింటుందన్న భయంతో వున్నావు. ఈ విషయాన్ని నేనెప్పుడో గ్రహించాను.

ఆశ్రమానికి వచ్చే ఆదాయం చూస్తూంటే నీ కళ్ళు మెరుస్తున్నాయి. భక్తులు సమర్పించే నగలు నీలో ఆశలు రేపుతున్నాయి. నేను నిన్ను చాలా కాలంగా గమనిస్తున్నాను. నీవింక ఆశ్రమంలో ఉండడానికి వీల్లేదు—అని చిదానందస్వామి అన్నాడు. నాకు కోపం కూడా వచ్చి — నీవంటి దొంగస్వాముల ఆశ్రమాల్లో వుండడం నాకూ ఇష్టముండదు. నావంటివారిని వుంచుకునే స్థాయికి నీ ఆశ్రమం ఇంకా యెదగలేదు—అన్నాను—"

"చాలా బాగా చెప్పావు—" అని రవి ఆమెను మెచ్చుకున్నాడు.

"అప్పుడే ఎక్కడయింది?" అన్నది రమ"—ఆశ్రమం వదిలి ఏం చేస్తావని అడిగాడు స్వామి. అవసరమనిపిస్తే ఆత్మహత్యయినా చేసుకుంటానన్నాను. అప్పుడు స్వామి మళ్ళీ దివ్య మందహాసం చేశాడు — 'నా ఆశ్రమంనుంచి బయటపడిన నీకు ఆత్మహత్య అవసరమనిపిస్తే అది నాకు అవమానం. నీకు మంచి వరుణ్ని చూస్తాను. పెళ్ళి జరిపిస్తాను. హాయిగా జీవితం గడుపుదువుగాని—' అన్నాడు. నేను ఆశ్చర్యపోయాను.

రవి ఆశ్చర్యంగా వింటున్నాడు.

రమ చెప్పుకుని పోతున్నది. స్వామి నిజానికి ఆమెను వాంఛించలేదు. పరీక్షించాడు. స్వామి తలచుకుంటే రమ ఆయన్ను ప్రతిఘటించలేదు. ఆమె మనసునుబట్టి ప్రతిఘటించే శక్తి స్వామి ఆమెకు ఇచ్చాడు. ఆ తర్వాత స్వామి రమకు తన భక్తుల్లో ఒకడైన రవిబాబును సూచించాడు.

రవిబాబుకు వివాహమయింది. అతడు లేనికుటుంబం నుంచి వచ్చాడు. అతడి తెలివితేటలు, సామర్థ్యం గుర్తించిన ఓ ధనవంతుడు అతడికి తన పిల్లనిచ్చి పెళ్ళి చేయాలనుకున్నాడు. వధువు అనకారి. గయ్యాళి. తండ్రి బలవంతం వల్లనూ, వేరే గతిలేకనూ రవిబాబు ఈ వివాహానికి అంగీకరించాడు. వివాహమైనప్పట్నించీ రవిబాబును అసంతృప్తి బాధిస్తున్నది. గయ్యాళి భార్య అతడిని వేధిస్తున్నది. ఆ యింట్లో అందరూ అతణ్ని చిన్న చూపు చూస్తారు. అందుకు ఒక కారణమున్నది.

రవిబాబు అందగాడు, తెలివైనవాడు. అతడిపక్కన భార్య ప్రమీలను చూస్తే యెవరైనా జాలిపడతారు. మీదు మిక్కిలి రవిబాబు ఇప్పుడు ధనవంతుడు. అందువల్ల రవిబాబు చుట్టూ ఎందరో వలపన్నవచ్చును. రవిబాబు కూడా ప్రమీలను పెళ్ళాడి తానేదో పెద్ద త్యాగం చేశానన్న భావనలో వుండవచ్చును. అతదేమిటో, అతడి స్థానమేమిటో అనుక్షణం గుర్తుచేయడం ద్వారా రవిబాబును అదుపులో వుంచవచ్చునని ప్రమీల, ప్రమీల తండ్రి కూడా అభిప్రాయపడ్డారు. అయితే తమ ప్రవర్తన భార్యాభర్తలమధ్య యెటువంటి దూరాన్ని సృష్టిస్తున్నదీ వారాలోచించలేదు.

రవిబాబు ఆ యింట్లో యాంత్రికంగా జీవించడం నేర్చుకున్నాడు. మామగారివద్ద, భార్యవద్ద అతడొక బంధువులాకాక జీతానికి కుదిరిన ఉద్యోగిలా ప్రవర్తించే వాడు. అలా రెండు సంవత్సరాలు గడిచాయి. రవిబాబుకో కొడుకు కూడా పుట్టాడు. వాడి బారసాల యెంతో ఆర్భాటంగా జరిగింది. ఆ వేడుకలో కూడా రవిబాబు ప్రాముఖ్యత ఏమీ లేదు. అతడి గురించి ఎవరూ పట్టించుకోలేదు. సమయానికి పీటలమీద కూర్చున్నాడు. అంతే! అతడి మామగారి మనుమడిగా, ప్రమీల కొడుకుగా మాత్రమే రవిబాబు కొడుకు గుర్తించబడుతున్నాడు.

ఈ సమయంలో ఆ పట్టణంలో చిదానందస్వామి అడుగుపెట్టాడు. రవిబాబు వెళ్ళి ఆయన దర్శనం చేసుకున్నాడు. చిదానందస్వామి అతడి కథను విని జాలి పడ్డాడు. ఆయన అతడికి రమ గురించి చెప్పాడు.

"జీవితంలో అసంతృప్తి అన్నది వుండకూడదు. యాంత్రిక జీవనం మనిషికీ పశువుకూ భేదం లేకుండా చేస్తుంది. మనిషి మనిషిలా బ్రతకాలి. అందుకే నువ్వు నీ బంధాలు తెంచుకుని రమతో ఎక్కడికైనా వెళ్ళిపో! భగవంతుడి అవతారంగా నేను చెబుతున్నాను. రమ నిన్ను మనిషిని చేస్తుంది. నీ జీవితానికి సార్థకతను కలిగిస్తుంది—" అని ఆయన రవిబాబుకు చెప్పాడు.

ఇది జరిగి కొద్ది నెలలయింది. రవిబాబు రమతో కలిసి వెళ్ళిపోవడానికి మానసికంగా సిద్ధపడడానికి ప్రయత్నిస్తున్నాడు. కానీ అతడికి భయంగా వున్నది. ఆ భయంలో బంధాలు లేవు. స్వార్థం ఉన్నది.

భార్యపైగానీ, పుట్టిన బిడ్డపైగానీ, పుట్టబోయే బిడ్డపైగానీ రవిబాబుకు మమకారంలేదు. ప్రమీలను పెళ్ళిచేసు

కోమని ఎప్పుడైతే శాసించారో—అప్పట్నించీ అతడికి తల్లిదండ్రులపైనా మమకారం పోయింది. అతడు రమతో స్నేహం ఆరంభించాడు. ఆశ్రమంలో ఇద్దరూ యెవరికీ తెలియకుండా రహస్యంగా కలుసుకుంటున్నారు. ఆ ఏర్పాటు చాలా పకడ్బందీగా వున్నది.

రవిబాబు యోగాభ్యాసం పేరిట ఆశ్రమంలోని ఓ గదిలోకి వెడతాడు. ఆ గదిలోకి రమ మరో దారిన వస్తుంది.

రమ రవిబాబుకు నచ్చింది. ఆమెలో అందం, ఆకర్షణ, తెలివి—అన్నీ వున్నాయి. ప్రమీలను చూసిన కళ్ళకు ఆమె మరీ అద్భుత సౌందర్యవతివలె కనబడుతున్నది.

కొన్నాళ్ళు గడిచేసరికి రమ అతడికి వ్యసనంలా పరిణమించింది. రోజు కొక్కసారైనా ఆమెను కలుసుకుని మాట్లాడకపోతే వుండలేకపోతున్నాడు.

చిదానందస్వామికి ఆయిదారు పట్టణాలలో ఆశ్రమాలున్నాయి. ఆయన సంవత్సరంలో ఒకో ఆశ్రమానికింత కాలమని నిర్ణయించి సంచారం చేస్తూంటాడు. ఆయన ఆశ్రమాలకు చాలా మంచి పేరున్నది. రవిబాబు చిదానందస్వామి ఆశ్రమానికి వెళ్ళడం ప్రమీలకూ, ఆమె తండ్రికీ కూడా నచ్చింది.

రవిబాబుకు రమతో కలిసి ఎక్కడికైనా వెళ్ళిపోవాలని వున్నది. కానీ తను పట్టుబడితే?

అందుకు మంచి ఉపాయం కావాలి. తను ఏ విధంగానూ పట్టుబడని విధంగా పారిపోవాలి.

“రమా! నువ్వు చెప్పినదంతా విన్నాక—స్వామినే ఉపాయం అడగడం మంచిదనిపిస్తోంది—” అన్నాడు రవి.

"ఈ విషయమై నేను చిదానందస్వామిని అడిగాను. ఆయన చెప్పింది నీకు నచ్చుతుందో నచ్చదోనని అనుమానంగా వుంది—" అన్నది రమ.

స్వామి ఏమి చెప్పాడో తెలుసుకోవాలని రవి ఆత్రపడ్డాడు.

రమ చెప్పసాగింది.

## 3

"నా పేరు లక్ష్మీనారాయణ!" అన్నాడాయన.

ఇన్‌స్పెక్టర్ చౌదరి ఆయనవంక పరీక్షగా చూశాడు. ఎత్తయిన మనిషి. ఛాయ నలుపు. ఖద్దరు బట్టలు ధరించినా ఖరీదైన మనిషి అనిపిస్తుంది. ముఖం బాగో లేదు. ముఖ్యంగా రెండు ఎత్తుపళ్ళు.

"చెప్పండి—" అన్నాడు చౌదరి.

"నిన్న సాయంత్రంనుంచీ మా అల్లుడి ఆచూకీ తెలియకుండా పోయింది—" అన్నాడాయన.

చౌదరి ఆయన అల్లుడి వయసు వగైరా వివరాలడిగి "భార్యాభర్తలేమైనా దెబ్బలాడుకున్నారేమో —" అన్నాడు.

"లేదండి. ఇంట్లో అతడు నోరు విప్పడు. బొత్తిగా లేని కుటుంబంనుంచి రావడంవల్లనేమో, నేనన్నా, నా కూతురన్నా అతడు వల్లమాలిన గౌరవం చూపిస్తాడు. కృతజ్ఞత అందుకు కారణం. ఒకప్పుడు పూటకు గతిలేనివాడు-ఇప్పుడు మహారాజవైభోగాలకు వారసుడయ్యాడు కదా!" అన్నాడు లక్ష్మీనారాయణ.

"అదే భావాన్ని మీరు రోజూ అతడిముందు వ్యక్తపరుస్తూంటారా?" అన్నాడు చౌదరి.

"ఏం—అలా అడిగారు?" అన్నాడు లక్ష్మీనారా

యణ.

"అతడొక వేళ ఇల్లు వదిలి వెళ్ళడానికి కారణం అదేమో నని!" అన్నాడు చౌదరి సాలోచనగా.

"మా అల్లుడు ఇల్లువదిలి వెళ్ళాడని నేను భావించడం లేదు—" అన్నాడు లక్ష్మీనారాయణ.

"మరి?"

"అతడిని ఎందరో వలలో వేసుకోవాలని చూస్తున్నారు. అతడు కాస్త అమాయకుడు. నా అనుమానం అతడు ఎవరి వలలోనో చిక్కుకున్నాడని..."

"అంటే?"

"స్త్రీ వ్యామోహం...."

"ఎవరిమీదనైనా మీకు అనుమానముందా?"

"అతడు ఆడవాళ్ళతో తిరుగుతూండగా చూసిన ఆధారాలు ఒక్కటీలేవు. అతడలాంటి వాడు కాదు కూడా. అందుకే ఎవరైనా అతడిని అపహరించి బలవంతంగా స్త్రీ వ్యసనానికి గురిచేస్తారేమోనని నా అనుమానం...."

"మీ అమ్మాయితో మాట్లాడేరా?"

"మా ఇద్దరిదీ ఒక్కటే పోలిక — ఒక్కటే ఆలోచనలు...."

"అతడెందుకు పారిపోయాడో అర్థమయింది—" అనుకున్నాడు చౌదరి మనసులో. అయితే అతడు పరిస్థితిని అర్థంచేసుకునే ప్రయత్నం కూడా చేస్తున్నాడు.

లక్ష్మీనారాయణకు సంబంధించిన కంపెనీ ఆఫీసును నిన్న సాయంత్రం అయిదు గంటలకు వదిలిపెట్టాడు రవిబాబు. బయల్దేరడం ఇంటివైపే బయల్దేరాడు. కానీ ఇంతవరకూ

ఇల్లు చేరలేదు. అతడికి ఇల్లు తప్ప ఇంక వేరే ప్రదేశాలు లేవు.

"ఆఫీసు, ఇల్లు తప్ప ఇంక ఎక్కడికీ వెళ్ళడా?" ఆశ్చర్యంగా అడిగాడు చౌదరి.

లక్ష్మీనారాయణ కొద్దిక్షణాలు ఆలోచించి-"ఇటీవల అతడు చిదానందస్వామి ఆశ్రమానికి వెడుతున్నాడు—" అన్నాడు.

"ప్రతిరోజూ వెడుతున్నాడా?"

"అవును—"

"ఎందుకో చెప్పాడా?"

"యోగాభ్యాసానికని చెప్పాడు. అక్కడికి వెళ్ళి రావడం ప్రారంభించినప్పట్నించీ మనిషి చాలా సంతోషంగా వుంటున్నాడు. అంతకుముందు ఎప్పుడూ గంభీరంగా వుండేవాడు. అతడి ముఖంలోని సంతోషం చూసి నేనూ అందుకు అభ్యంతర పెట్టలేదు—"

"అతడి మాటలు మీరు నమ్మారా?" అన్నాడు చౌదరి.

"లేదు. ఆతడిమీద ఎప్పుడూ నా నిఘా వుంటుంది. అతడు ఆశ్రమానికి వెడుతున్నాడు. చిదానందస్వామిని దర్శించుకుంటున్నాడు. రోజూ కాసేపు యోగాభ్యాసం చేస్తున్నాడు—" అన్నాడు లక్ష్మీనారాయణ.

"మీకు మీ అల్లుడిమీద నమ్మకం లేదన్నమాట...."

"దేవుణ్ని నమ్మి చెడినవారు లేరంటారు. వ్యాపారంలో నమ్మక చెడినవారుండరు—" అన్నాడు లక్ష్మీనారాయణ.

"ఇప్పుడు నన్నేం చేయమంటారు?" అన్నాడు చౌదరి.

"మా అల్లుడి అచూకీ తెలుసుకోవాలి. అందుకు నేను మీకు వ్యక్తిగతంగా కూడా వేరే బహుమతి ఇచ్చు కుంటాను...."

"థాంక్స్!" అన్నాడు చౌదరి. అతను కేసు వివరాలు నోటు చేసుకున్నాడు.

## 4

"నాన్నా!" అన్నది ప్రమీల.

"ఏమిటమ్మా?" అన్నాడు లక్ష్మీనారాయణ.

"ఇప్పుడే ఉత్తరం వచ్చింది—"

"ఎక్కణ్ణించి?" లక్ష్మీనారాయణ మామూలుగా అడిగాడు.

"ఆయననుంచి—"

లక్ష్మీనారాయణ ఉలిక్కిపడి — "ఆయన అంటే?" అన్నాడు. కానీ ఆయన కర్థమైపోయింది.

"ఆయన కావాలనే ఇల్లు వదిలి వెళ్ళిపోయారు. ఇంక రారు—" అన్నది ప్రమీల.

"ఏదీ ఆ ఉత్తరం—" అన్నాడు లక్ష్మీనారాయణ. ప్రమీల తండ్రికి ఉత్తరం అందించింది.

"ప్రియమైన ప్రమీలకు—ఆశీస్సులు.

ఈ యింట్లో నాకు గౌరవం లేదు. మీ రెవ్వరూ నన్ను మనిషిగా చూడడం లేదు. ఈ జీవితంమీద నాకు విరక్తి కలిగింది. చిదానందస్వామిని ఆశ్రయించాను. ఆయన నాకు తరుణోపాయం చూపించాడు. ఆయన సలహాపై నేను మిమ్మల్నందర్నీ వదిలి దూరంగా వెళ్ళిపోతున్నాను. మీకు మళ్ళీ కనబడను. నా గురించి వెతికించాలని ప్రయత్నించ వద్దు. మీ ప్రయత్నం ఫలించదు. నీవు మరో

వివాహం చేసుకునేందుకు ఏ విధమైన అభ్యంతరమూ వుండకూడదని నీకీ ఉత్తరం వ్రాస్తున్నాను. ఈసారి అంతస్తులో నీకు తగినవాడిని ఎన్నుకుని సుఖపడు—....

నీ

రవి."

"డామిట్—" అన్నాడు లక్ష్మీనారాయణ ఆ ఉత్తరాన్ని నేలమీదకు విసిరికొడుతూ.

"మనిషిగా చూడడంలేదుట—అసలు తను మనిషైతే కదా—" అంది ప్రమీల.

"బాగా చెప్పావు—" అన్నాడు లక్ష్మీనారాయణ- "నా అనుమానం—ఎవత్తో వీణ్ని తగులుకుంది. లేదా ఆ చిదానందస్వామే ఎవత్తినో వీడికి తగిలించివుంటాడు. ఇంట్లోంచి ఎంతో కొంత డబ్బు తీసుకుని వెళ్ళుంటాడు. అది పెట్టి ఏ కూరగాయల కొట్టో తెరవొచ్చునని అయిడియా అయుంటుంది. కనకపు సింహాసనంమీదకు శునకాన్ని తీసుకొచ్చాను. నాకీ గుర్తింపు ముందే ఉండాల్సింది—ఇప్పుడనుకుని ఏం లాభం?"

లక్ష్మీనారాయణ క్షణాలమీద అన్ని ఎకౌంట్లూ వెరిఫై చేయగా—అల్లుడు కూడా ఇరవై వేలు తీసుకుని వెళ్ళాడని అర్థమయింది. ప్రమీల ఇల్లంతా శోధించగా సుమారు పాతికవేలు విలువచేసే నగలు కనబడ్డంలేదని తేలింది.

"నోట్లో వేలు పెడితే కరవలేడనుకున్నాను—ఎంత మోసం చేశాడు?" అన్నాడు లక్ష్మీనారాయణ. తండ్రీ కూతుళ్ళిద్దరూ కూడా పోయిన డబ్బు, నగలు గురించి కాసేపు గుండెలు బాదుకున్నాక లక్ష్మీనారాయణ—

"ఎట్టి పరిస్థితిల్లోనూ వీణ్ని వదిలిపెట్టటానికి లేదు. సరైన విధంగా బుద్ధి చెప్పాలి—" అన్నాడు.

"ఇన్‌స్పెక్టర్ ఈయన ఆమాకీ కనపెట్టగలడంటావా నాన్నా!" అంది ప్రమీల అనుమానంగానూ, దిగులుగానూ.

"చౌదరి చాలా గట్టివాడు. అయితే ముందు నేనోసారి ఆ చిదానందస్వామిని కలుసుకుని మాట్లాడాలి—" అన్నాడు లక్ష్మీనారాయణ.

## 5

ఆశ్రమంలో చిదానందస్వామి ఉండే కుటీరానికి ముందున్న రావిచెట్టు నీడలో సుమారు పాతికమంది కూర్చుని వున్నారు.

వారందరూ స్వామి దర్శనంకోసం ఎదురుచూస్తున్నవారే! వారిలో నలుగురు లక్ష్మీనారాయణకు బాగా తెలిసినవారు. లక్ష్మీనారాయణ అక్కడకు రాగానే వారతణ్ని గుర్తుపట్టి పలకరించారు.

లక్ష్మీనారాయణ వారిని చూసి ఆశ్చర్యపడ్డాడు. అప్పుడు వాళ్ళు లక్ష్మీనారాయణకు చిదానందస్వామి మహిమల గురించి చెప్పారు. లక్ష్మీనారాయణ అన్నీ మౌనంగా విన్నాడు. ఆయనకు మనసులో రకరకాల ఆలోచనలు పరుగెడుతున్నాయి.

ఈ స్వామికి పేరు బాగా వున్నట్టుంది. అటువంటి వాడు తన అల్లుడిని ఇంట్లోంచి పారిపొమ్మని యెందుకు సలహా యిచ్చాడు?

కొద్ది నిమిషాల్లో స్వామి కుటీరంనుంచి బయటకు వచ్చాడు. అంతా గౌరవ పురస్కారంగా లేచి నిలబడ్డారు. చిదానందస్వామి రెండు చేతులతోనూ అందరినీ

శించాడు. ఆయన ముఖంలో దివ్య తేజస్సు ఉట్టిపడు తున్నది.

ఒక్కొక్కరే ముందుకువచ్చి తమ సమస్యలు చెప్పుకుం టూంటే చిదానందస్వామి మందహాసం చేస్తూ విని— "నాతో చెప్పుకున్నావుగా—నీ సమస్యలింక పరిష్క రించబడినట్లే అనుకో—" అంటూ వచ్చాడు.

లక్ష్మీనారాయణ వంతు వచ్చింది—"స్వామీ! మీరు అందరికీ సమస్యలు పరిష్కరిస్తానంటున్నారు. కానీ నాకు మీరే సమస్యను సృష్టించారు—" అన్నాడాయన.

చిదానందస్వామి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ—"నావల్ల నీకు సమస్య వచ్చిందా—అదేమిటో చెప్పు—వింటాను—" అన్నాడు.

లక్ష్మీనారాయణ క్లుప్తంగా రవిబాబు గురించి చెప్పాడు.

"ఇందులో నేను చేసినదేమున్నది? సమస్యను నీవే సృష్టించుకున్నావు. నీ అల్లుడిని నీవొక మనిషిలా ఎందుకు చూడలేకపోయావు?" అన్నాడు చిదానందస్వామి.

"నా ఇంటి గొడవలు మీకు అనవసరం. కానీ ఒక సంసారిని ఇల్లువదిలిపొమ్మని ఆదేశించడం మీకు తగునా?" అన్నాడు లక్ష్మీనారాయణ.

"ప్రపంచం నిండా ఎన్నో సమస్యలుంటాయి. వాటిని విని పరిష్కార మార్గాలను అప్పటికప్పుడు సూచించడమే నా పద్ధతి. అంతేకానీ ఎవరి సమస్యలు ఏమిటీ వారికి ఏయే పరిష్కార మార్గాలు సూచించానూ అని నేను గుర్తుపెట్టుకోను. నీ అల్లుడు నా దగ్గరకువచ్చి వుండవచ్చు. దానికి సరియైన పరిష్కార మార్గం నేను సూచించి వుండనూవచ్చు. అది అతడికి నచ్చి వుండవచ్చు. అయితే

అందువల్ల నీకు నష్టంవాటిల్లిందంటున్నావు. నా పరిష్కార మార్గంవల్ల నీకు నష్టంవాటిల్లిందీ అంటే అందుకు ఒక్కటే కారణం—నువ్వు పాపివి అయుండాలి—" అన్నాడు చిదానందస్వామి తాపీగా.

లక్ష్మీనారాయణకు అప్పుడు జీవితంలో యెన్నడూ యెరుగనంత ఆవేశం కలిగింది. స్వామి మాటలు విని అక్కడున్న భక్తజనమంతా ఘొల్లుమన్నారు. అందువల్ల లక్ష్మీనారాయణ ఆవేశం మరింత పెరిగింది.

"పాపిని నేను కాదు నువ్వు. నీమూలంగా నా కూతురి కాపురం చెడిపోయింది—" అన్నాడు లక్ష్మీనారాయణ అరుస్తూ.

ఒక్కసారిగా అక్కడ స్మశాన నిశ్శబ్దం ఆవరించు కుంది. లక్ష్మీనారాయణ మాటలకు భక్తులంతా ఆశ్చర్య పోయారు. చిదానందస్వామిని ఆయన ఎదుట ఆయన ఆశ్రమంలో అంతమాట అనేవారుంటారని యెవ్వరూ అనుకోలేదు.

అయితే చిదానందస్వామి ఏ మాత్రమూ ఆవేశపడ లేదు—"చేసిన పాపాలకు ఇప్పటికే అనుభవిస్తున్నావు. ఇంకా నీ పాప భారాన్ని పెంచుకోకు నాయనా!" అన్నాడాయన. మళ్ళీ భక్తులందరూ ఘొల్లుమన్నారు.

లక్ష్మీనారాయణకు మరింత అవమానమయింది. ఆయన మరింత ఆవేశపడి చిదానందస్వామిని నోటికివచ్చినట్లు దూషించసాగాడు.

చిదానందస్వామి అన్నీ విని ప్రశాంతంగా—"ఇల్లు వదిలిన నీ అల్లుడు మళ్ళీ తిరిగివచ్చే అవకాశం లేశమాత్ర మయినా వుంటే అది నువ్విప్పుడు పోగొట్టుకున్నావు.

బహుశా నీ అల్లుణ్ణింక నువ్వు చూడలేవనుకుంటాను. అందుకు నాకెంతో విచారంగా వున్నది—" అన్నాడు.

అప్పటికి లక్ష్మీనారాయణ తన ఆవేశాన్ని అదుపు చేసుకుని చిదానందస్వామి పద్ధతిలోనే—"నిన్ను నేను చంపబోతున్నందుకు నాకెంతో విచారంగా వుంది—" అంటూ ఒక్కసారిగా ఆయనమీదకు దూకాడు.

భక్తులందరూ కలగజేసుకుని లక్ష్మీనారాయణను వెనక్కు లాగారు. ఆయన రొప్పుతూ—"స్వామీ—తప్పించుకున్నాననుకోకు. ఈ రాత్రికి నా అల్లుడు నా యింట్లో అడుగుపెట్టకపోతే తెల్లారేసరికి ఆశ్రమంలో నీ శవం వుంటుంది—" అన్నాడు.

లక్ష్మీనారాయణ పరిచయస్థులు ఆయన్ను తీవ్రంగా మందలించి అక్కణ్ణించి వెళ్ళిపొమ్మని చెప్పారు. వారు కలగజేసుకుని వుండకపోతే లక్ష్మీనారాయణ వల్ప అప్పుడే హుూనమయ్యుం డేది.

లక్ష్మీనారాయణ వెళ్ళిపోయాడు.

"స్వామీ! అతడిని మన్నించండి. మాకు అతడు చాలా సంవత్సరాలుగా తెలుసు. మనిషి అహంకారి కావచ్చు. కానీ మంచివాడు. ఎవరికీ ఏ అపకారమూ చేయడు...." అంటూ లక్ష్మీనారాయణ పరిచయస్థులు ఆయన తరఫున వేడుకున్నారు.

"నేను దూషణ భూషణలకు అతీతుణ్ని. నాకై నేను వాడినేమీ చేయను. కానీ వాడి పాపాలకు తగిన శిక్ష పడకుండా ఆపడంకూడా నావల్ల కాదు. ప్రకృతి సిద్ధంగా జరిగే వాటిని ఆపాలనుకోవడం ఈ సృష్టికే ప్రమాద కరం—" అని నిట్టూర్చాడు చిదానందస్వామి.

# 6

జగ్గయ్య సారాసీసా పక్కనపెట్టి గుడిసెలోంచి బయటకు వచ్చి—"ఎవరది?" అన్నాడు.

అక్కడ ఓ మనిషి నిలబడి వున్నాడు. కాస్త పొడుగ్గా వున్నాడు. ముఖం కనబడకుండా టోపీ ముందుకు లాక్కుని వున్నాడు.

"నన్ను లక్ష్మీనారాయణగారు పంపారు—" అన్నాడతడు.

"ఏ లక్ష్మీనారాయణ?"

అతడు అర్థమయేలా చెప్పాడు.

"ఓహో ఆ బాబా-ఏమిటి పని?" అన్నాడు జగ్గయ్య.

"హత్య!"

"హత్యా?" ఆశ్చర్యంగా అన్నాడు జగ్గయ్య.

"అవును....ఇదిగో వెయ్యిరూపాయలు అడ్వాన్సు. పని పూర్తయ్యాక మరో వెయ్యి ఇస్తారు...."

జగ్గయ్య డబ్బు తీసుకుని—"మనిషి ప్రాణాలు మరీ చవకై పోతున్నాయి. ఒక హత్యకు రెండువేలా?" అన్నాడు.

"ఏమో—అవన్నీ లక్ష్మీనారాయణగారితో మాట్లాడుకో—...."

"ఇంతకీ ఎవర్ని చంపాలి?"

"చిదానందస్వామిని...."

"ఎవరినీ?" అన్నాడు జగ్గయ్య.

"చిదానందస్వామిని.." అంటూ వివరాలు చెప్పాడా మనిషి.

"ఆ సన్యాసి లక్ష్మీనారాయణగారినేం చేశాడు?"

"అవన్నీ నీకు అనవసరం—" అన్నాడా మనిషి.

"సరే— రేపు వచ్చి మిగతా వెయ్యి పట్టుకుపోతాను" అన్నాడు జగ్గయ్య. ఆ మనిషి వెళ్ళిపోయాడు. జగ్గయ్య తన చేతిలో వున్న డబ్బు లెక్కపెట్టుకున్నాడు. సరిగ్గా వెయ్యిరూపాయలుంది. ఆ డబ్బును గళ్ళలుంగీ రొంటిన దోపుకున్నాడు. తర్వాత గుడిసెలోకి వెళ్ళాడు.

మంచంమీద తలగడ తీశాడు. దాని అడుగున ఒక కత్తి వున్నది. ఒకసారి దాన్ని పరీక్షగా చూసి-"మంచి పదునుమీద వుంది. ఒక్కవేటుకు తల తెగిపోతుంది—" అనుకున్నాడు.

## 7

"రమా!" అన్నాడు రవిబాబు.

"ఊఁ" అన్నది రమ.

"ఈ రోజుతో మన అజ్ఞాతవాసం ముగుస్తుందికదా" అన్నాడు రవిబాబు.

"ఊఁ" అన్నది రమ.

"నాకు చాలా థ్రిల్లింగ్ గా వున్నది—" అన్నాడు రవిబాబు.

"ఏమిటి?"

"నీతో అనుభవం...."

"ఛీ...." అంది రమ సిగ్గుపడుతూ.

"అవును రమా! ప్రమీలను చూస్తే నాకు ఆడదనే అనిపించేదికాదు. నీలో బాహ్య సౌందర్యమేకాదు— ఆత్మ సౌందర్యం కూడా వున్నది—" అన్నాడు రవిబాబు.

"స్వామివారి వుపాయం నీకెలాగుంది?"

"ఒక ఆశ్రమవాసిగా నీవిక్కడే వున్నావని వాళ్ళెవ్వరికీ తెలియదు. నీకోసం ఎక్కడెక్కడో వెతుకు

టున్నారు పోలీసులు—" అన్నది రమ.

"కానీ నా మామగారికి అనుమానం రాదంటావా? ఆశ్రమంమీద దాడి జరగదంటావా?" అన్నాడు రవిబాబు అనుమానంగా.

"ముందు నువ్వు ఆశ్రమానికి వచ్చావు. ఆ తర్వాత నువ్వు రాసిన ఉత్తరం పొరుగూరినుంచి పోస్టయింది. ఆ ఉత్తరం ఆధారంగా నువ్వీ ఊళ్లో లేవని అనుకుంటారు. ఈ రాత్రి పన్నెండు గంటలకు మనం బస్సెక్కుతాం. నాలుగు గంటలు ప్రయాణం. అక్కణ్ణించి రైలు. పన్నెండుగంటల ప్రయాణం .."

"ఉష్—మాట్లాడకు—గోడలకు చెవులుంటాయి...."

"మన విషయం చిదానందస్వామికి తప్ప ఇంకెవ్వరికీ తెలియదు—" అన్నది రమ.

రవిబాబు అదోలా రమవంక చూసి — "నాకో విషయం అనుమానంగా వుంది. చిదానందస్వామి మనకింతగా ఎందుకు సాయపడుతున్నాడు?" అన్నాడు.

"కష్టాల్లో వున్నవారంటే ఆయనకు జాలి...."

"నాకింకో అనుమానం వస్తున్నది...." అన్నాడు రవిబాబు.

"ఏమిటది?"

"చిదానందస్వామికి నీమీద మోహం ఉన్నదేమోనని..."

"వుంటే మాత్రం ఏమయింది?"

రవిబాబు నవ్వి — "ఆయన నిన్ను తాత్కాలికంగా వదిలిపెడుతున్నాడు. మనమెక్కడుందేదీ ఆయనకు తెలుస్తుంది. ఏదో ఓ రోజున నన్ను మాయచేసి మళ్ళీ నిన్ను లోబర్చుకుంటాడు—" అన్నాడు.

"నేను నీదాన్నయేక ఆయన కెందుకు లోబడతానూ?" అన్నది రమ.

"రమా! నువ్వు నన్ను మోసం చేయవు కదూ—నిజంగానే నన్ను ప్రేమిస్తున్నావు కదూ—" అన్నాడు రవిబాబు.

"ఈ విషయమై నీకు అనుమానమెందుకు వచ్చింది?" అన్నది రమ.

"నిజం చెప్పమంటావా?" అన్నాడు రవిబాబు.

"ఊఁ" అన్నది రమ.

"నిన్న చిదానందస్వామి నిన్ను ముద్దు పెట్టుకుంటూండగా చూశాను—" అన్నాడు రవిబాబు తాపీగా.

రమ ఉలిక్కిపడి—"ఎప్పుడు?" అన్నది.

రవిబాబు టైము చెప్పాడు.

రమ నిట్టూర్చి—"నీకోసం తాత్కాలికంగా ఆ మాత్రం త్యాగం చేయవలసి వచ్చింది—" అన్నది.

"నాకలా అనిపించలేదు. నీ చేతులు వాటంతటవే ఆయన చుట్టూ బిగుసుకున్నాయి. నీ ముఖంలో, ఆనందం, కళ్ళలో ప్రోత్సాహం చూశాను నేను—"

"అయితే నీకు నిజం చెప్పక తప్పదు...." అన్నది రమ.

"నిజం పేరుతో అబద్ధం చెప్పవుకదూ!"

రమ అతడివంక అదోలా చూసి—"పెళ్ళికాకుండానే నాపైన అపనమ్మకం పెంచుకుంటున్నావా?" అన్నది.

"అపనమ్మకం పెరిగినా నిన్ను నేను వదులుకోలేను. నువ్వు నన్ను మోసంచేస్తే నేను బ్రతకలేను-" అన్నాడు రవిబాబు.

"ఎందుకని?" అన్నది రమ.

"నాకు జీవితమంటే విరక్తి కలిగింది. నీ సాహచర్యం నాలో కొత్త ఉత్సాహాన్ని నింపింది. నాకిప్పుడు బ్రతకాలనిపిస్తోంది—నీతో! నీ కారణంగానే నాకు బ్రతుకుమీద ఆశ బయల్దేరింది. ఇప్పుడు నీకోసం నేనెంతగానైనా తెగించగలను!" అన్నాడు రవిబాబు.

"నీ ప్రేమ చాలా గొప్పది రవీ! నువ్వు నన్నెలా ప్రేమిస్తున్నావో నేనూ నిన్నలాగే ప్రేమిస్తున్నానంటే అందుకు నీ ప్రేమ గొప్పతనమే కారణం. అయితే నిన్న నీవు చూసినది వేరు—" అంది రమ.

నిన్న చిదానందస్వామి ఆమెను పిలిపించాడు. రవితో ఆమెను పంపుతున్నందుకు తనకు కానుక ఏమైనా ఇమ్మన్నాడు. కానుక తీసుకోనిదే తానెవరికీ సాయపడకూడదని గుర్వాజ్ఞ అన్నాడు.

"నన్ను తప్ప ఏమైనా అడగండి స్వామీ!" అన్నది రమ.

"అభిమానంతో ఎవరైనా ఎవరికైనా ఇచ్చేదే నేను నిన్ను అడుగుతాను. కాదనకూడదు. నీ శీలాన్నపహరించే కోరిక మాత్రం కాదది—" అన్నాడు చిదానందస్వామి.

రమ ఒప్పుకున్నది. ఆయన ముద్దు అడిగాడు. రమకు వేరేదారి లేకపోయింది—"ఈ ఒక్కసారికే—" అని మాత్రం చెప్పింది.

ఆ ఒక్కసారే రవి చూశాడు.

"నీ కార్యం నెరవేరిందనే అనుకో—" అన్నాడు చిదానందస్వామి తర్వాత. రమ ఆయన్ను పరపురుషుడిగా కాక భగవంతుడిగా భావించబట్టి ఆ పని చేయగలిగింది.

"భగవంతుడినని భ్రమపెట్టి ఆయన నీచేత ఇంకా ఏమైనా చేయించగలడు—" అన్నాడు రవిబాబు.

"రవిబాబూ — భారత స్త్రీకి వివాహమైనాక భర్తయే దైవం. తన జోలికి వచ్చినందుకు మహావిష్ణువునే నల్ల రాతిగా మార్చిన జలంధర నాకు ఆదర్శం. ఇంకా ఏమైనా చెప్పాలా?" అన్నది రమ.

"నేను నీ గురించి ఆలోచించడంలేదు. నీమీద నాకు అనుమానం, కోపం, ద్వేషం — ఏమీ కలుగవు—" అన్నాడు రవి—"నేను ఆ స్వామి గురించి ఆలోచిస్తున్నాను. ఆయన మహాపురుషుడు కాదు. కాముకుడు. సర్వసంగపరిత్యాగి కాదు. ఆశాపాతకుడు. ఆయన తప్పులను ఎన్నింటినైనా నేను క్షమించి వుండేవాణ్ని. కానీ నిన్ను ముద్దుపెట్టుకోవడంవల్ల ఆయన్ను నేను క్షమించలేకుండా వున్నాను. ఆయన్ను ఏమిచేయడానికైనా నాకు అవకాశం వున్నది. కొద్దిరోజులుగా నేనిక్కడ అజ్ఞాతవాసం చేస్తున్నాను. నా ఉనికి ఎవ్వరికీ తెలియదు. నన్నెవ్వరూ అనుమానించలేరు...."

"అంటే?"

"చిదానందస్వామి ఏం చెప్పాడు? ఈ రాత్రి ఒంటిగంటకు ఆశ్రమం నుంచి ఒక యువతి, యువకుడు బయటకు వెడతారు. వారినెవ్వరూ అభ్యంతర పెట్టవద్దు-అన్నాడు కదా!"

"అంటే?"

"నిన్ను ముద్దుపెట్టుకున్న ఆ స్వామి ముఖాన్ని పచ్చడి చేసి మరీ వెడతాను. అందుకు నాకు నీ సహకారం కావాలి—"

"చిదానందస్వామిని నీవపార్థం చేసుకుంటున్నావు. నా మాట విను. ఆయన దీవెనలతో మనం బయటపడదాం. ప్రజాక్షేమమే ఆయన ధ్యేయం. ఆయన ఏం

చేసినా దాని వెనుక ఏదో అర్థముంటుంది. ఆయన దైవ స్వరూపుడు...." రమ అతడి మనసు మార్చడానికి ప్రయత్నిస్తోంది.

"ఆయన దైవ స్వరూపుడేం-దైవమే అనుకుందాము. ఆ దైవమే నాకీ యోచన పుట్టించాడు. నీకు నామీద ప్రేమ వుంటే నువ్వు నాకు సహకరిస్తావు—" అన్నాడు రవి.

కాసేపు ఆలోచించి—"సరే!" అన్నది రమ.

# 8

"మీకోసం ఎవడో జగ్గయ్యట — వచ్చాడు—" అన్నాడు లక్ష్మీనారాయణ బాకుమరిది శంభునాదం.

"జగ్గయ్యా—వాడెవడు?" అన్నాడు లక్ష్మీనారాయణ ఆవులిస్తూ. అప్పటికాయన నిద్రలేచి పదినిమిషాలయింది. కానీ ఇంకా నిదురమత్తు వదల్లేదు.

"మనిషి చూడ్డానికి గూండాలా వున్నాడు—" అన్నాడు శంభునాదం.

"డ్రాయింగు రూంలోకి పంపించు—" అన్నాడు లక్ష్మీనారాయణ. ఆయన తనూ డ్రాయింగు రూంలోకి వెళ్ళాడు. కాసేపటికి జగ్గయ్య వచ్చాడు.

"నువ్వా?" అన్నాడు లక్ష్మీనారాయణ వాణ్ని చూసి.

"దండాలండి బాబయ్యా-తమరు చెప్పిన పని పూర్తి చేశానండి—" అన్నాడు జగ్గయ్య.

లక్ష్మీనారాయణ చిత్రంగా వాడివంక చూసి— "నేను నీకేం పని చెప్పలేదే!" అన్నాడు.

జగ్గయ్య ఆయనకు క్లుప్తంగా తననో మనిషి కలిసి అడ్వాన్సివ్వడం గురించి చెప్పాడు.

లక్ష్మీనారాయణ కంగారుగా-"ఇది అబద్ధం. ఎవరో

నా పేరు చెప్పి నిన్ను మోసం చేశారు. నేను చెప్పలేదు. డబ్బు పంపలేదు—" అన్నాడు.

జగ్గయ్య అనుమానంగా లక్ష్మీనారాయణ వంక చూశాడు. ఆయన చెప్పిందే ఆ మనిషి తనకు వెయ్యి రూపాయలెందుకిస్తాడు? ఆయన పేరెందుకు చెబుతాడు? ఈ పెద్దవాళ్ళింతే....వ్యవహారం చాకలో తేల్చేయాలని చూస్తారు. పని పోయిందిగా — ఇంక మిగతా డబ్బు ఎగేయాలని చూస్తున్నాడేమో?

"డబ్బు మీరే పంపారని నిర్ధారణ చేసుకున్నాక నే నేనా పనికి ఒప్పుకున్నాను—...." అన్నాడు జగ్గయ్య కాస్త కఠినంగా.

"ఎలా నిర్ధారించావో కాస్త చెప్పు—" అన్నాడు లక్ష్మీనారాయణ.

"మీరు డబ్బిచ్చేటప్పుడు నోట్లమీద మీ సంతకం పెడతారు. గుర్తుగా ఓ నోటు తెచ్చాను. మిగతావి వేరే చోట వున్నాయి. చూడండి—" అంటూ ఓ నోటు ఆయనకు అందించాడు.

అది లక్ష్మీనారాయణ అసలు సంతకం కాదు. వ్యక్తిగతమైన ఖర్చులకు తనవద్దనున్న డబ్బుపయోగించేటప్పుడు గుర్తుకోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసుకున్న రెండక్షరాల సంతకం.

ఆ డబ్బు తనదే—సందేహం లేదు. అయితే ఈ డబ్బు జగ్గయ్యకెలా వచ్చింది? ఆయనకు అసలు విషయం తెలియడానికెంతో సేపు పట్టలేదు. ఇంట్లోంచి ఇరవై వేల క్యాషు మాయమయింది—అల్లుడితో పాటు!

అల్లుడే తన పేరు చెప్పి ఈ హత్య చేయించాడా?

"చిదానందస్వామి చచ్చిపోయాడా?" అన్నాడు

లక్ష్మీనారాయణ.

"మీరు చెప్పడమూ— నేను చంపకపోవడమూనా? మిగతా డబ్బుకోసం వచ్చాను— నేనిప్పుడు!" అన్నాడు జగ్గయ్య.

ఈ సంభాషణ లక్ష్మీనారాయణకు సంబంధించినంత వరకూ—దురదృష్టకరంగానే పరిణమించింది. ఎందుకంటే జగ్గయ్యకు ఏదో బదులివ్వాలనుకుంటూ ఆలోచిస్తూ అటూ ఇటూ చూసిన ఆయనకు గుమ్మంలో ఇన్‌స్పెక్టర్ చౌదరి కనిపించాడు. అతడీ సంభాషణ విన్నాడు.

"రండి—ఇన్‌స్పెక్టర్ గారూ! మా అల్లుడి అమాకీ తెలిసిందా?" అంటూ సాదరంగా చౌదరిని ఆహ్వానించినా లక్ష్మీనారాయణ తడబడ్డాడు.

ఇన్‌స్పెక్టర్ని చూడగానే జగ్గయ్యలో వణుకుపుట్టింది. వాడక్కణ్ణించి వెళ్ళిపోబోయాడు.

"ఆగు—" అన్నాడు చౌదరి — "అనుకోకుండా లభించిన సాక్ష్యం అంత సులభంగా వదులుకుంటానా?"

జగ్గయ్య ఆగిపోయి—"నాకేం తెలియదు. నేనేమీ చేయలేదు—" అన్నాడు.

"కాసేపు నువ్వు నోరుమూసుకో—" అన్నాడు చౌదరి. తర్వాత లక్ష్మీనారాయణవైపు తిరిగి—"నేను మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడగాలి—" అన్నాడు.

"అడగండి—" అన్నాడు లక్ష్మీనారాయణ.

చౌదరి చెప్పడం ప్రారంభించాడు.

నిన్న రాత్రి ఎనిమిదింటికి చౌదరికి ఓ ఫోన్ కాల్ వచ్చింది. ఫోన్ ఎవరు చేసినదీ చెప్పలేదు. అతడు చిదానందస్వామి భక్తుడట. చిదానందస్వామికీ లక్ష్మీనారా

యణకూ జరిగిన వాగ్వివాదం గురించీ చెప్పి—లక్ష్మీనారాయణ అన్నంత పనీ చేయగలడనీ చిదానందస్వామి ప్రాణాలు ప్రమాదంలో వున్నాయని ఆయనకు పోలీసు రక్షణ కావాలనీ కోరాడు. లక్ష్మీనారాయణ పరిచయస్తులు నలుగురు జరిగినదానికి సాక్ష్యం అని కూడా ఆ భక్తుడు చెప్పాడు.

చౌదరి ఆ సాక్షుల్ని విచారించి భక్తుడు చెప్పింది నిజమేనని నిర్ధారించుకున్నాడు. అయితే ఆ సాక్షులు లక్ష్మీనారాయణ ఆవేశంలో అన్న మాటల్ని పట్టించుకోనవసరం లేదని చెప్పారు. చౌదరి రాత్రి పదింటికి వెళ్ళి చిదానందస్వామిని కలిశాడు. చిదానందస్వామి తన ఆశ్రమంలో పోలీసుల ప్రమేయం సహించనన్నాడు. తనకు ప్రాణభయం లేదన్నాడు.

"ప్రజల కష్టాలు, సమస్యలు తొలగించడానికి నా ఆయువును కరిగించి ఇస్తున్నాను. నాకు ప్రాణభయమేమిటి? నన్నెవ్వరూ చంపలేరు-నా ఆయువు కరిగిపోతే తప్ప—" అన్నాడు చిదానందస్వామి.

"వాడికి చాలా అహంకారం—" అన్నాడు లక్ష్మీనారాయణ.

"ఆ సంగతి మనం తర్వాత మాట్లాడుకుందాం—" అంటూ చౌదరి మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు.

ఈ రోజు తెల్లవారుఝామున చౌదరికి మళ్ళీ ఫోన్ వచ్చింది.

"అంతా అయిపోయింది ఇన్‌స్పెక్టర్! మీరు ముందుగా చెప్పినా పట్టించుకోలేదు. మా అందరికీ దైవంలా వున్న స్వామి ఇంకలేడు. మీరు కనీసం ఆ నీచుడు లక్ష్మీనారాయణను అరెస్టుచేయండి-" అన్నాడా

భక్తుడు.

చౌదరి వెంటనే లక్ష్మీనారాయణతో మాట్లాడాలనుకున్నాడు. అక్కణ్నించి ఆశ్రమానికి వెళ్ళాలనుకున్నాడు. అతడు వచ్చేసరికి చౌదరి జగ్గయ్యతో మాట్లాడుతున్నాడు. ఆ సంభాషణ చౌదరి విన్నాడు.

"మా ఉద్యోగంలో ఇలాంటి అదృష్టం ఎక్కడో గానీ వుండదు. ముందు హంతకుల్ని కలుసుకుని—అప్పుడు వాళ్ళను వెంటబెట్టుకుని హత్యా ప్రదేశానికి వెడుతున్నాను—" అన్నాడు చౌదరి.

"ఇన్‌స్పెక్టర్—ఏమిటి మీరనేది?" అన్నాడు లక్ష్మీనారాయణ.

"ముందు నాతో పదండి. హత్యా ప్రదేశానికి వెళ్లేక మనం అన్నీ మాట్లాడుకోనవచ్చు—" అన్నాడు చౌదరి.

జగ్గయ్య ఒక్క పరుగున వచ్చి చౌదరి కాళ్ళమీద పడి—"బాబూ—బుద్ధి గడ్డితిని వెయ్యిరూపాయలకోసం చిన్న అబద్ధం చెప్పాను. నేనీ హత్య చెయ్యలేదు. నన్ననుమానించకండి—" అన్నాడు.

చౌదరి వాణ్ని లేపి—"నువ్వు అబద్ధాలు చెబుతావన్న విషయం నాకు తెలుసు. నీచేత నిజం యెలా చెప్పించాలో కూడా నాకు తెలుసు—" అన్నాడు.

"నామాట కాస్త వినండి బాబూ!" అన్నాడు జగ్గయ్య.

వాడు హత్యచేద్దామని ఆశ్రమానికి వెళ్ళాడట. కానీ అప్పటికే చిదానందస్వామి అక్కడ చచ్చిపడి వున్నాడట.

చౌదరి నవ్వాడు. ఆ నవ్వు చూడగానే జగ్గయ్య

గుండెలదిరాయి. తన మాటలు నమ్మలేదని వాడికి తెలిసింది.

# 9

చిదానందస్వామి హత్య ఇన్‌స్పెక్టర్ చౌదరికి మరో చిక్కు సమస్యగా తయారయింది.

ఆశ్రమంలో స్వామి చచ్చిపడివున్నాడు. ఆయనమీద అంత కసి ఏమిటోకానీ స్వామి ముఖం పచ్చడి అయిపోయింది. హత్య జగ్గయ్య చేసినట్లూ, లక్ష్మీనారాయణ చేయించినట్లూ బలమైన ఆధారాలున్నప్పటికీ ఆశ్రమంలో మరో ఆధారం దొరికింది.

అది ఒక టేపు రికార్డరు. అందులో రవి అనబడే వ్యక్తి రమ అనే అమ్మాయిని ప్రేమిస్తున్నట్లూ ఆ అమ్మాయిని చిదానందస్వామి ముద్దుపెట్టుకున్నట్లూ ఆ కారణాన రవి చిదానందస్వామి ముఖం బద్దలుకొట్టి చంపాలన్నట్లూ—ఓ సంభాషణ వున్నది. చిదానంద స్వామి రవి, రమ—ఒకటి కావడానికి ఎంతగానో సహకరించినా రవికి ఆ స్వామి మీద సదభిప్రాయంలేదని ఆ సంభాషణలో స్పష్టమవుతున్నది.

ఆ గొంతు తన అల్లుడిదని లక్ష్మీనారాయణ అన్నాడు.

అయితే ఆ సంభాషణను ఎవరు టేపు చేశారు?

రమ టేపుచేసి వుండాలి. అందువల్ల ఆమె ఆశించే ప్రయోజనమేమిటి? బహుశా ముందు రవిని బ్లాక్ మెయిల్ చేయడానికి ఉపయోగించుకోవాలని ఆమె అనుకుని వుండవచ్చు. అయితే ఆమె అతడిని ప్రేమించి వుండదు.

మరి ఇప్పుడు రవి, రమ—ఇద్దరూ మాయమయ్యారు. ఆశ్రమంలో ఎవరినడిగినా రమ గురించి చెప్పలేక

పోయారు. అక్కడ మొత్తం ఎనమండుగురు అమ్మాయి లున్నారు. అంతా వయసులోనే వున్నారు. కానీ వారిలో రమ అన్న పేరుగల వారెవ్వరూలేరు. వారిలో ఎవ్వరిని ప్రశ్నించినా ఏ విధమైన ప్రయోజనమూ లేక పోయింది.

"ఈ హత్య నా అల్లుడే చేసి వుండాలి. వాడు ముందుగా పథకం వేసుకుని స్వామిని చంపాలనుకుని ఆ తర్వాత హత్యా నేరం నామీదకు వచ్చే విధంగా ఏర్పాట్లు చేశాడు. నా అదృష్టంకొద్దీ ఈ టేపురికార్డరు కొరికింది కానీ లేని పక్షంలో నా పని ఏమయ్యేది?" అని లక్ష్మీనారాయణ వాపోయాడు.

రవి ఫోటోలు దేశంలోని అన్ని వార్తాసంస్థలకూ, పోలీసు స్టేషన్లకూ పంపబడ్డాయి. రోజులు గడుస్తున్నా అతడి గురించిన ఆచూకీ తెలియడంలేదు.

చిదానందస్వామికి యెందరో ప్రముఖులు భక్తులుగా వుంటున్నారు. హంతకుణ్ణి పట్టుకొనడంలో జరిగే జాప్యం గురించి చౌదరిమీద ఒత్తిడి రాసాగింది. చౌదరికి కేసు ఒక అంగుళం కూడా ముందుకు వెళ్ళడానికి లేకుండా వున్నది.

ఆ సమయంలో అతడికి దైవంలా రంగారావు కన బడ్డాడు.

"చిదానందస్వామి నిజంగా మహామహిమాన్వితుడు. ఆయన తాకిన గ్లాసు మా యింట వారంరోజులున్నది గదా—నన్ను పీడించిన చిక్కు సమస్య తొలగిపోయింది. ఆయన వద్దకు వెళ్ళి పాదాభివందనం చేసివద్దామను కున్నాను కానీ ఈలోగా ఆయన హత్య చేయబడ్డాడు. ఆయనే చెప్పాడు కదా — తన ఆయువును కరిగించి

పదిమందికీ సాయపడుతున్నానని! ఇప్పటికాయన ఆయువు కరిగిపోయి వుంటుంది—" అన్నాడు రంగారావు.

"ఇప్పుడు నా ఆయువు కరుగుతున్నది—" అన్నాడు చౌదరి.

"దిగులు పడకండి—మీకు సాయపడాలనే వచ్చాను" అన్నాడు రంగారావు.

"ఎలా?" అన్నాడు చౌదరి.

"చూడండి. చిదానందస్వామి తాకిన గ్లాసుకూ మామూలు గ్లాసుకూ వున్న తేడా ఏమిటి? ఆయన తాకిన గ్లాసుమీద ఆయన వేలిముద్రలుంటాయి. మహిమ అంతా ఆ వేలిముద్రలదే అయుండాలి. అందుకే ఆ గ్లాసుమీది వేలిముద్రలు నేను జాగ్రత్తగా ఫోటో తీయించాను. ఓ కాపీ మీ కిస్తాను. మీ పూజామందిరంలో వుంచి—వారం రోజులపాటు పూజచేయండి—" అన్నాడు రంగారావు. అతడు చౌదరికి ఓ ఫోటో అందించాడు.

చౌదరి ఆ ఫోటో అందుకుని—"ఇలాంటిదేదో చేస్తేతప్ప నా కష్టాలు తీరేలా లేవు-" అన్నాడు. ఉన్నట్లుండి అతడికో అనుమానం వచ్చింది — "చిదానందస్వామి తాకిన గ్లాసును ఆ తర్వాత రాజారావు తాకాడు. మీరు తాకారు. దీనిమీద ఎందరివో వేలిముద్రలు పడివుండాలి. అసలాయన వేలిముద్రలింతవరకూ వున్నాయని నమ్మక మేమిటి? ఇవి చిదానందస్వామి వేలిముద్రలు అవునో కాదో!" అన్నాడు.

"రాజారావుగారు, నేను కూడా గ్లాసు అంచులనే తాకాము. అందువల్ల మా వేలిముద్రలు గ్లాసుమీద పడే అవకాశంలేదు. స్వామికి మంచినీళ్ళిచ్చే ముందు రాజారావుగారు శుభ్రంగా గ్లాసును తుడిచారు. ఈ గ్లాసు

మీద ఒక్క స్వామివి తప్ప ఇంకెవరి వేలిముద్రలుండ డానికి వీలులేదు—" అన్నాడు రంగారావు.

"అయినా నా తెలివిగానీ—ఇవి చిదానందస్వామి వేలిముద్రలైనదీ కానిదీ తెలుసుకోవడం నాకు క్షణాల మీద పని—" అన్నాడు చౌదరి.

చౌదరి క్షణాలమీదనే రియాక్టయ్యాడు. హాతుడి వేలిముద్రలతో పోల్చడం జరిగింది. అయితే రెండూ ఒకటి కాదు.

"నేను చెప్పానుగా!" అన్నాడు చౌదరి విజయ గర్వంతో.

"సరే—అయితే అది రాజారావు గారి గ్లాసు. దాని మీద వారింటి వాళ్ళవో, వారి పనిమనుషులవో లేదా మా యింటివారివో, మా పనిమనుషులవో తప్ప ఇంకెవరి వేలి ముద్రలూ వుండవు. గ్లాసుమీద వేలిముద్రలు స్పష్టంగా వున్నాయి. ఈ వేలిముద్రలెవరివో తేల్చాలి-" అన్నాడు రంగారావు.

చౌదరి అదీ చేశాడు. ఆ వేలిముద్రలెవరివో తెలియ లేదు.

"చూశారా—" అన్నాడు రంగారావు విజయ గర్వంతో.

"నా కేసు తేలక నేను చస్తున్నాను. ఈ కొత్త కేసు సంగతి తర్వాత చూస్తాను—" అన్నాడు చౌదరి కాస్త చిరాగ్గా.

"అదికాదు. ఈ వేలిముద్రలు చిదానందస్వామివి. అందులో సందేహం లేదు. వీటిని పూజించండి...." అన్నాడు రంగారావు.

"అయితే మరి....?" అన్నాడు చౌదరి-ఉన్నట్లుండి

అతడి బుర్రలో ఏదో మెరిసింది — "ఈ వేలిముద్రలు చిదానందస్వామివి కాకపోతే — హతుడు చిదానంద స్వామి కాదా?"

దీనికి రంగారావు ఉలిక్కిపడ్డాడు. ఇంత సేపూ అతడా కోణంలో ఆలోచించడమే లేదు. తనవద్దనున్న వేలి ముద్రలు చిదానందస్వామివని ఋజువు చేయాలన్నదే అతడి తాపత్రయం.

చౌదరి తలపట్టుకుని కూర్చున్నాడు.

ఇది సాధ్యమా?

హతుడు చిదానందస్వామి కాడా? అయితే ఎవరు?

చౌదరి మొత్తం కథనంతా తలలోకి తెచ్చుకున్నాడు. అన్నింటినీ తార్కికంగా ఆలోచిస్తున్నాడు.

"ఈ చిక్కుముడి విప్పగలిగినది రమ అనే అమ్మాయి. ఆ అమ్మాయి ఆశ్రమంలోనే వున్నది. ఎందుకంటే ఆశ్రమంలో మొత్తం ఎనమండుగురు అమ్మాయిలుండాలి. ఎవరూ తప్పిపోలేదంటున్నారు. రమ ఆ ఎనమండుగురి లోనూ ఒకతె అయుండాలి. చిదానందస్వామి ఆమెను రమ అనే పేరుతో—రవికి పరిచయం చేసివుండాలి. ఆ రమను ఎలా కనుగొనడం?" అతడు ఆలోచిస్తున్నట్లుగా నే పైకి అన్నాడు. అప్పుడతడికి ఉపాయం స్ఫురించింది.

టేపురికార్డర్లో రమ గొంతు వున్నది. ఆశ్రమవాసులైన ఆడవారిలో ఆ గొంతును గుర్తుపట్టడం కష్టంకాదు.

# 10

ఇన్స్పెక్టర్ చౌదరి రంగంలోకి దిగాడు. ఆ ఎనమండుగురి ఆడవారి గొంతులనూ టేపు చేశాడు. రమ దొరికిపోయింది. ముందామె నిజాన్ని ఓ పట్టాన ఒప్పుకో లేదు. ఎలాంటివారినైనా ఒప్పించగల శక్తి చౌదరి

కున్నది.

రమ చెప్పిన కథ విని చౌదరి తెల్లబోయాడు.

రమ ఆశ్రమంలో చేరినాక చిదానందస్వామికి ఐహిక వాంఛలు బయల్దేరాయి. ఆయన రమను వివాహం చేసుకుని పదిమందిలో హాయిగా జీవించదల్చుకున్నాడు. అయితే ఎలా? ఆశ్రమాన్ని వదిలి పారిపోతే ఆయన గురించి పోలీసుల వేట ప్రారంభమవుతుంది. ఆశ్రమంలో డబ్బంతా ఆయన అధీనంలో వున్నది. అది చేజిక్కించుకుని గౌరవంగా బయటపడడానికి మార్గం కోసం ఆయన అన్వేషిస్తున్నాడు. అప్పుడాయనకు రవిబాబు దొరికాడు.

రవిబాబు ఒడ్డూ, పొడుగూ, అంగసౌష్టవంలో— అన్నివిధాలా స్వామీజీలా వుంటాడు. రవిబాబు సమస్య కూడా స్వామికి పనికివచ్చింది. ఆయన వెంటనే పథకం వేసి రమను రవిబాబుపై ప్రయోగించాడు. ఆమె పేరు, అతడి ఉనికి, వారి కలయిక, అన్నీ రహస్యంగా జరిగిపోయాయి. అతనిని తన స్థానంలో పెట్టి చంపటమే స్వామీజీ పథకం.

చిదానందస్వామి తన పథకాన్ని పకడ్బందీగా రూపొందించుకున్నాడు. రవిబాబును రెచ్చగొట్టించే బాధ్యత రమపైన పడింది. ఆ సంభాషణ టేపు అయింది. చనిపోయినవాడి ముఖం గుర్తు తెలియకుండా చేయడానికి ఆ సంభాషణ చిదానందస్వామికి ఉపయోగపడింది.

ఆయన అనుకున్న ప్రకారం రవిబాబును హత్యచేసి తనలాగా వేషం మార్చి ఆశ్రమంలోని డబ్బును తీసుకుని వెళ్ళిపోయాడు. ముందాయన రమను కూడా తీసుకుని వెళ్ళాలనుకున్నాడు. అయితే కొంతకాలంపాటు ఆమె

ఆశ్రమంలో వుండకపోతే తామిద్దరం పట్టుబడిపోవచ్చునని భయపడి చివరి క్షణాల్లో ఉద్దేశ్యం మార్చుకున్నాడు. కొన్నాళ్ళాగి ఆయన ధనవంతుడిలా ఆశ్రమానికి వచ్చి రమను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాడు. కానీ ఈలోగా పోలీసులు చనిపోయింది స్వామికాదని తెలుసుకోవడం జరిగింది.

"అది స్వామివారి వేలిముద్రల మహిమ!" అన్నాడు చౌదరి—"తన వేలిముద్రలు భక్తులకెన్నడూ సాయపడుతూనే ఉంటాయని ఆయన గ్రహించలేదేమో!"

చిదానందస్వామిని పట్టుకొనడానికి పోలీసులు రమను ఉపయోగించదల్చుకొనడంవల్ల మొత్తం కథ రహస్యంగా వుంచబడింది.

సరిగ్గా నెల్లాళ్ళ అనంతరం ఆయన పట్టుబడ్డాడు.

—: అయిపోయింది: —

# మాయమయిన శవాలు

## బొమ్మిడి అచ్చారావు

"హల్లో, క్రైం బ్రాంచ్?"

"ఎస్. ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ స్పీకింగ్!"

"అయామ్ సారీ టు ఇన్ఫార్మ్ డ్యూటీ పాథాలజిస్ట్ స్పీకింగ్! పోస్టుమార్టమ్ చెయ్యబడ్డ రెండు శవాలు మార్చ్యురీనించి మాయమయ్యాయి!"

ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ కుర్చీనుంచి దిగ్గున లేచాడు.

"వ్వాట్? అదెలా జరిగింది? మార్చ్యురీ వార్డుబాయ్స్ ఏమయ్యారు? ఎలా మిస్సయ్యాయి?"

"అదే తెలీటంలేదు సార్! పోస్టుమార్టమ్ పూర్తయ్యే సరికి రాత్రి పన్నెండున్నరయింది. నేను పదిగంటలకే డ్యూటీ దిగాల్సినవాడిని — పోస్టుమార్టమ్ పూర్తయ్యే వరకు వుండిపోయాను అప్పటివరకు మీరు కూడా మార్చ్యురీ దగ్గరే వున్నారు కదా! ఐడెంటిఫికేషన్ కోసం బయట వరండాలో మెష్ రూంలో శవాల్ని పెట్టించాం. నేను నా రిలీవర్ సర్జన్ రాకపోవడంతో

నైట్ డ్యూటీ చేశాను.

ఉదయం అయిదు గంటల ప్రాంతంలో మరో మర్డర్ కేస్ పోస్టుమార్టంకి వచ్చింది, త్రీ టౌన్ ఏరియా నుంచి. అదీ నేనే అటెండ్ కావలసి వచ్చింది. వెళ్ళే సరికి శవాలు లేవు. డ్యూటీ వార్డు బాయ్ తప్పతాగి వరండాలో బల్ల కిందపడి నిద్రపోతున్నాడు. వాడ్ని అడిగితే ఏం తెలియదంటున్నాడు. దాదాపు ఓ గంట సేపు హాస్పిటల్ చుట్టుపక్కలంతా వెతికించి, లాభం లేకపోగా మీకు ఫోన్ చేస్తున్నాను."

శ్రీనివాస్ అతను చెప్పిందంతా టెన్షన్‌లో వింటూ ఊపిరితియ్యటం మర్చిపోయాడు.

"చాలా డేంజరస్ పొజిషన్‌లో పడ్డాం సార్! అవి నేను డ్యూటీలో వుండగా పోవటం నా దురదృష్టం. నా సర్వీస్‌కి మాయని మచ్చ! మీరు వెంటనే బయల్దేరి రాగలరా?" ప్రాధేయపడుతున్నట్టు అన్నాడు పాథాలజిస్టు.

"ఇప్పుడే బయల్దేరి వస్తూన్నాను. ఓ పక్క శవాల ఐడెంటిఫికేషన్ కూడా కాలేదు. పూర్తిగా డార్క్‌నెస్‌లో వున్నాం — ఇప్పుడీ అవాంతరం వల్ల మాకూ చాలా చెడ్డపేరొస్తుంది. ఎనీ వే, అయామ్ కమింగ్!" అంటూ ఫోన్ పెట్టేసి సార్జంట్ శివాన్ని, రాజుని, మరో యిద్దరు కాన్‌స్టేబుల్స్‌ని తీసుకుని బయల్దేరాడు శ్రీనివాస్.

వాళ్ళు వెళ్ళేసరికి మార్చురీ వరండాలో నే యెదురు చూస్తున్నారు. పాథాలజిస్టు, మేల్ నర్సు, స్టాఫ్ నర్సు, యిద్దరు వార్డు బాయ్స్. అందులో రాత్రి డ్యూటీలో వున్న వార్డుబాయ్ యెవరో తేలిగ్గానే గుర్తుపట్టాడు

శ్రీనివాస్.

పాథాలజిస్టు ఎదురొచ్చి, "అయామ్ సో సారీ! నా పర్యవేక్షణలో యింత ఘోరమైన బ్లండర్ జరగటం యిదే మొదటిసారి! హాస్పిటల్ సూపర్నెంటుగారికీ విషయం తెలిసి చాలా సీరియస్ అయ్యారు. నా కాన్ఫిడెన్షియల్స్ పాడయిపోక తప్పదు" అన్నారు.

శ్రీనివాస్ వరండా అంతా ఓ పక్క కళ్ళతో వెతుకుతూ మౌనంగా అతను చెప్పేది వింటున్నాడు. అదే పరిస్థితి తనది కూడా. డిఎస్పీ, అసిస్టెంటు కమిషనర్ యిద్దరూ యీ శవాల గురించి గత సాయంత్రం తన నడిగారు. ఇంకా పోస్టుమార్టం కాలేదని, శవాల్ని గుర్తుపట్టడానికి ఇంతవరకూ ఎవరూ రాలేదనీ తను చెప్పాడు. ఇప్పుడు బాధ్యత పాథాలజిస్టుతో బాటు తనదీ వుంది.

"డ్యూటీ వార్డు బాయ్ నువ్వేనా?" అనడిగాడు ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ ఇంకా తాగుడు మైకం పూర్తిగా వదలని ఓ వార్డుబాయ్ని గుచ్చి చూస్తూ.

"అయ్యా, నే నేనండీ!"

"రాత్రి ఎన్ని గంటల్నించీ వున్నావిక్కడ?"

"పోస్టుమార్టం మొదలెట్టిందగ్గర్నుంచీ నేనే వున్నానండి. ఆ తర్వాత శవాల్ని యిదిగో యీ టేబిల్ మీద నే పెట్టి వుంచారండి. నే నిదిగో యీ గుమ్మందగ్గిరే కాపలా వున్నానండి. గుర్తుపట్టడాని కెవరైనా వస్తే పిలిచి చెప్పమని డాక్టరయ్యగారు వెళ్ళిపోయారండి. నేనొక్కడ్నీ కాపలా వున్నానండి!"

"మరి శవాలెలా మాయమయ్యాయి?"

"అదే తెలియటంలేదయ్యా! కాస్త నిద్రమత్తులోకి జారానండయ్యా, ఎప్పుడు పట్టేసిందో మొద్దు నిద్ర

పట్టేసింది. నిద్ర రాకుండా వుండాలని కాస్త సారా కూడా తాగానండయ్యా. కాని అదేంటో మైకం ముంచేసి నట్టయిపోయిందండి."

"శవాల్ని నువ్వే కావాలని మాయం చేశావని నే నంటాను. దానికి నీ సమాధానం?"

శ్రీనివాస్ గద్దింపుతో వార్డుబాయ్ మత్తు పూర్తిగా దిగిపోయింది. "అదేంటయ్యా, శవాల్ని నేను మాయం చెయ్యటమేమిటి? మాయం చేస్తే నాకేముస్తుంది?"

"హంతకుడు శవాల్ని మాయం చెయ్యటానికి నీ సహాయం తీసుకున్నాడు. అందుకు నీకు బాగా డబ్బు ముట్టచెప్పాడు. హంతకుడికి సాయం చేశావు."

వార్డు బాయ్ అమాంతం శ్రీనివాస్ కాళ్ళమీదపడి పోయాడు. "నాకేం తెలీదండయ్యా! హంతకుడెవడో, ఏమిటో నాకెలా తెలుస్తది? అసలు నేను డ్యూటీలో వుండగా శవాలు మాయమైతే అది నా తప్పుకింద వస్తదికదా, అలాంటి ఎదవపనెందుకు చేస్తాను?" అన్నాడు ఏడవటానికి సిద్ధమవుతూ.

"సరే, నీ సంగతి తర్వాత చెపుతాం" అని డాక్టరు వంక తిరిగి. "మార్చురీకి వాచ్ మెన్ యెవరూ వుండరా డాక్టర్?" అన్నాడు శ్రీనివాస్.

"ప్రత్యేకం వాచ్ మన్ వుండడు సార్! ప్రత్యేకమైన పరిస్థితుల్లో యిలా వార్డు బాయ్స్ నే నియమిస్తాం అవసరాన్ని!"

"ఓ.కే! శవాల్ని బయటకి తీసుకుపోవాలంటే గేట్లోంచే వెళ్ళాలి కదూ!"

"సాధారణంగా అవుట్ గేట్లోంచి వెళ్తాలనుకోండి.

వుంచం. ఇన్ గేట్ కూడా పూర్తిగా తెరిచి వుండదు. క్యాజువాల్టీ వార్డు దగ్గర గేట్ మెన్ కాపలా వుంటాడు. ఎమర్జెన్సీ కేసెస్ వస్తే అతనే యిన్ గేట్ తలుపులు తెరిచి పేషెంట్సుని లోపలికి రానిస్తాడు."

"సో, గేట్ లోంచి యెలాంటి వాహనమూ రాలేదని అర్థమౌతోంది" అంటూ శ్రీనివాస్ మార్చురీ బయట పరీక్షగా చూశాడు. హాస్పిటల్ మెయిన్ బిల్డింగ్ నించి దాదాపు ఏభై గజాల దూరంలో వుంది మార్చురీ బిల్డింగ్. మెయిన్ బిల్డింగ్ దగ్గర క్యాజువాల్టీ దగ్గరున్న వాచ్ మన్ కి మార్చురీ దగ్గరేం జరిగేదీ కనిపించే అవకాశంలేదు!

శ్రీనివాస్ మార్చురీకి చేర్చివున్న కాంపౌండ్ వాల్ వంక దృష్టి సారించాడు. ఎంతో ఎత్తులేదు గోడ! నాలుగడుగులలోపే వుంటుంది. గోడకి అవతలిపక్క రోడ్ వుంది.

హాస్పిటల్ వూరికి కొంత దూరంగా కట్టబడివుండటం వల్ల హాస్పిటల్ కి చుట్టుపక్కల నివాస గృహాలు లేవు! కాకపోతే రెండు మూడు హోటల్సు, కిళ్ళీబడ్డీలు, రోగులతో వచ్చేవారికి అద్దెకిచ్చే గదులున్న రెండు మూడు లాడ్జీలు వెలిశాయక్కడ!

శ్రీనివాస్ మార్చురీ వెనక ద్వారం దగ్గర ఇసకలో ఏవో బూట్ల గుర్తులు, రెండు సిగరెట్ పీకలు గుర్తించాడు. గోడపక్కగా పచ్చగడ్డి పెరిగివుంది. అక్కడ గడ్డి ఎవరో తొక్కేసినట్టు బాగా నలిగి వుంది. గోడమీది నుంచి బయటకి తొంగిచూశాడు. అక్కడ కూడా కొంత మేర యిసక వుంది. ఆ యిసకలో కారు టైర్ల గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

శ్రీనివాస్ సాలోచనగా తలపంకించాడు. శవాలు

యా గోడమీదినుంచే బయటికి తీసుకుపోవటం జరిగిందని అతను గ్రహించాడు. అవసరముండదని ఫోటోగ్రాఫర్ని, వేలిముద్రల నిపుణుడ్ని తీసుకురాకపోవటం పొరపాటయిపోయిందనుకున్నాడు.

హాస్పిటల్ నించి ఫోన్ చేసి వాళ్ళిద్దర్నీ వెంటనే పంపించమని హెడ్క్వార్టర్స్కి మెసేజ్ పంపాడు. అలాగే డిఎస్పీకి, అసిస్టెంటు కమిషనర్కి ఫోన్ చేసి జరిగిన విషయం రికార్డిచ్చాడు శ్రీనివాస్.

## 2

ఆమె చాలా అందంగా వుంది. సుంద్రటి ఆరోగ్యమైన ముఖం. పెద్ద పెద్ద కాటుక తీర్చిన కళ్ళు. కోటేరు వేసినట్టున్న ముక్కు. శ్రీకారంలాంటి చెవులకి జూకాలు వింత సోయగాన్ని తెచ్చిపెట్టాయి. గులాబి రంగు చీరకు మేచింగ్ బ్లౌజ్ వేసింది.

గుండెలు ఎత్తుగా చూపరుల దృష్టిని కదల్చకుండా చూసేలా వున్నాయి. గుండెలమీదుగా మెరిసిపోతూ అటు ఇటు ఊపిరి పీల్చినపుడల్లా ఎగిరిపడుతున్న లాకెట్!

డిటెక్టివ్ కిరణ్ ఆమెని పరిశీలించటం ముగించి, "చెప్పండమ్మా, మీ కేవిధంగా సహాయపడగలను?" అన్నాడు.

ఆమె నోరు విప్పగానే దానిమ్మగింజల్లాంటి పలువరుస తళుక్కున మెరిసింది.

"నా పేరు వకుళ. పద్మా పవర్ లూమ్స్ జనార్దనంగారు మా నాన్న. వారం రోజులుగా మావారు కనిపించటం లేదు."

"వివరంగా చెప్పండి!" అన్నాడు కిరణ్ నోట్ బుక్ ముందుకు జరుపుకుని.

కమల చెప్పసాగింది. "నాన్నగారికి నేనొక్కర్తెనే సంతానం. నన్ను అత్తారింటికి పంపించటానికి ఇష్టంలేక యిల్లరికపుటల్లుడికోసం అన్వేషించి చివరికి మావారిని సెలక్టు చేశారు. ఆయన పేరు శివరావుగారు. బి.ఎస్సీ ఫస్టు క్లాస్‌లో పాసయ్యారు. మాకన్న ఆస్తి అంతస్తుల్లో కిందుగా వున్నా ఇల్లరికం రావటాని కంగీకరించటంతో యీయనతో నా పెళ్ళి జరిపించారు. దాదాపు రెండు సంవత్సరాలు పూర్తయ్యింది మా పెళ్ళయి.

ఈమధ్య నెలరోజులుగా మావారికి ఎందుకో మా ఇంట్లో వుండటానికి యిష్టత వుండటంలేదు. స్వతంత్రంగా ఉద్యోగం చేసుకుంటూ నన్ను తన వెంట తీసుకుపోతానని అనటం మొదలెట్టారు.

నాన్నగారికి ఈ విషయం తెలిసి చాలా కోప్పడ్డారు. తనకి ఉద్యోగం చెయ్యవలసిన అవసరం లేదని, హాయిగా యింట్లోనే వుంటూ ఏం తోచకపోతే బిజినెస్ ఎకౌంట్సు చూస్తూండమనీ, యింకా కాలక్షేపం కాకపోతే తనతోపాటు మిల్లుకి వచ్చి పనివాళ్ళని అజమాయిషీ చెయ్యమనీ అంటుండేవారు నాన్న.

కాని యీయన ససేమిరా యింట్లో వుండనని భీష్మించుక్కూచున్నారు. ఆ కారణంగా నాన్నకు, యీయనకు రెండురోజులకోసారి ఘర్షణ జరుగుతోంది. సరిగ్గా వారం రోజులక్రితం నాన్నగారు యీయనమీద కేకలువేశారు. పోతే తనొక్కడ్నే పొమ్మని, నన్ను మాత్రం పంపేది లేదని బెదిరించారు. అంతే, ఆ రాత్రినించే ఆయన కనిపించటంలేదు."

"మీ నాన్నగారిది పవర్‌లూమ్స్ అని చెప్పారుకదా,

అంటే బట్టలు నేయటంవరకేనా, వాటిపై డిజైన్ ప్రింటింగు, కలరింగు కూడా చేస్తారా?"

"కలర్ త్రెడ్స్‌తో రకరకాల డిజైన్సు వేస్తూంటారు. దాదాపు ఏభైమంది పనిచేస్తారు మర మగ్గాలమీద. మా టెక్స్‌టైల్స్‌కి మంచి మార్కెట్ కూడా వుంది. ఆమాటకొస్తే మా పిల్లలు, వారి పిల్లలు కూడా కాలు మీద కాలేసుకుని కూచుంటే చాలు—ఏ ఉద్యోగం చెయ్యక్కర్లేదు. మంచి యిన్‌కమ్."

"అంటే మీ వారు యిన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడేవారా?"

"అదీ కాదనుకుంటానండి. స్వతంత్రంగా బతకాలనే వెర్రి ఆలోచన ఆయనకెందుకొచ్చిందో అర్థం కాలేదు. నాన్నగారు ఆయన్ని స్వంతబిడ్డలా చూసుకునే వారు. మా యింట్లో వచ్చివున్నారని ఎన్నడూ అలక్ష్యం చెయ్య లేదు. నాన్నగారికి నామీద పిచ్చిప్రేమ! వారంటే నాకు ప్రాణమని తెలిసి, మరీ జాగ్రత్తగా వ్యవహరించే వారు అల్లుడి విషయంలో!"

"మరి యీమధ్య యిద్దరు ఘర్షణపడ్డారని చెప్పారు కదా, పరుషమైన మాటలేమైనా అన్నారా మీ నాన్న గారు?"

"అదేం లేదండి. పెద్దరికంతో మందలింపు ధోరణిలో అన్నారేగాని, అసలు నిజానికి అది లెక్కలోకి తీసుకో వలసింది కాదు."

"మీవారు బాగా సెన్సిటివ్ అనుకుంటాను."

"మరీ యెక్కువండి. అందుకే నాన్నగారి మంద లింపుతో హర్టయి వెళ్ళిపోయారేమోనని నా అను మానం."

"మీ వారి స్వంత ఊరు?"

"రాజమండ్రి."

"అక్కడికి వెళ్ళారేమో కనుక్కున్నారా?"

"అక్కడ వారికి ఎవరూ లేరండి. మా అత్తగారు వెళ్ళేవరకు వున్నారు. తర్వాత సంవత్సరానికి కాలం చేశారు. రాజమండ్రిలో వారికి స్వంత ఇల్లుంది. నాలుగు భాగాలు అద్దెకిచ్చేసి మా అత్తగారు ఓ భాగంలో వుండి అద్దెలమీద సుఖంగా బతికారు. ఆమె పోయాక ఆ పోర్షన్ కూడా అద్దెకిచ్చేశారు మావారు. అసలు నన్ను ఆ ఇంటికి తీసుకుపోవాలనే ఆయన సంకల్పం! కాని నాన్నగారు నన్ను మా గడప దాటించటానికిష్టపడలేదు."

"ఈయన కనిపించకుండా పోయిన మర్నాడే రాజమండ్రి నాన్నగారు కాళ్ళోపోయి వచ్చారు. ఈయన అక్కడికి రాలేదని తెలిసింది. రాజమండ్రిలో ఆయన స్నేహితులనీ బంధువుల్నీ ఎంక్వయిరీ చెయ్యబోయి మళ్ళీ విషయాన్ని బజారుకెక్కించటం యిష్టంలేక వచ్చేశారు. అయినా పరోక్షంగా మనుషుల్ని ఆపి ఆరాతీయించారు తర్వాత. కాని ఆయన జాడ తెలియలేదు" వకుళ కంఠంలో విచారం ధ్వనించింది.

కిరణ్ ఆమె కళ్ళకింద కనిపిస్తున్న నల్లగీతల్నిబట్టి ఆమె రాత్రిళ్ళు నిద్రపోవటంలేదని గ్రహించాడు. శివ రావుని బాగా ప్రేమిస్తూ వుండివుండాలి! అతని ఎడబాటు ఆమెని బాగా కుంగతీసినట్టుంది, లేకుంటే ఆమె ఇంకా చాలా అందంగా వుండేది!

"మీరు పోలీస్ రిపోర్టు ఏమైనా యిచ్చారా?"

"లేదండి. ఇలాంటి విషయాలు పోలీసులదాకా తీసుకు పోతే వాళ్ళు అడ్డమైన ప్రశ్నలతో విసిగించి మా పరువు

బజారుపాలు చేస్తారని ఆ ప్రయత్నం మాత్రం చెయ్య లేదు."

"శివరావుగారు వెళ్ళిపోయి వారంరోజులయినా రిపోర్టివ్వకపోతే ఎలా? ఇలాంటి కేసులో పోలీసుల అవసరం చాలా వుంటుంది."

"వాళ్ళకన్నా కూడా మీమీద గురి ఎక్కువ మాకు. మీ గురించి మీ పరిశోధనల గురించి పేపర్లలో చాలా సార్లు చదివాను. అందుకే నేరుగా మీదగ్గరకొచ్చాను."

"ఓ. కే! మరీ అవసరమనుకుంటే నేను పోలీసులకి యీ విషయం తెలియపర్చవలసి వుంటుంది. అందుకు మీ కభ్యంతరముండదు కదా!"

"విషయం మరీ రచ్చకెక్కకుండా చూసే భారం మీది! మా కుటుంబం నలుగుర్లోను హాస్యాస్పదంగా కాకుండా వుండాలని మా కోరిక! తర్వాత మీరేం చేసినా అది మీ యిష్టానికి వదిలేస్తున్నాను. మావారు క్షేమంగా నా దగ్గరికి చేరాలి, అదే నాక్కావలసింది!" ఆమె కళ్ళనుండి రెండు కన్నీటి బిందువులు చెక్కిళ్ళ మీదుగా జారి గుండెలోతుల్లో యింకిపోయాయి.

కిరణ్ తలూపాడు. "ఈ క్షణంనించీ మీ వారి అన్వేషణలో వుంటాను. శివరావుగారి ఫోటో తెచ్చారా?" అడిగాడు.

వకుళ హేండ్ బేగ్ తెరిచి, కాబినెట్ సైజ్ రెండు ఫొటోలు పైకి తీసింది.

"ఆల్బంలోనించి తీసి తెచ్చాను. ఇందులో ఆయన బస్టువరకే వుంది. ఇది ఆయన ముఖకవళికలు తెలియటం కోసం తెచ్చాను. ఈ రెండో ఫోటోలో మేమిద్దరం పెళ్ళిదండలు వేసుకుని నుంచుని తీయించుకున్నాం. దీన్ని

బట్టి ఆయన ఒడ్డుపొడవు మీరు తెల్సుకోగలుగుతారు కదా! దాదాపు ఆయిదడుగులు ఎనిమిదంగుళాల పొడవు. ఎర్రగా వుంటారు. ఈ ఫోటోలోకన్న కొంచెం లావుగా వుంటారు. ఈమధ్యనే కాస్త పుష్టిగా తయారయ్యారు."

"ఓ. కే!" అన్నాడు కిరణ్.

"మీ ఫీజు....?" చెక్ తెరిచి పట్టుకునే అడిగింది వకుళ.

కిరణ్ చెప్పాడు.

## 3

వకుళ వెళ్ళిన పదినిమిషాలకు కిరణ్ డ్రస్ చేసుకుని మెట్లు దిగి కిందికి వచ్చాడు. సరిగ్గా అదేసమయంలో ఫియట్ కారు గేటునించి లోపలకు వస్తోంది.

గరాజ్ దగ్గరికి వెళ్ళబోతూ ఆగాడు కిరణ్. కోర్టు నించి తిరిగొస్తూన్న లాయర్ బిందు చిరునవ్వుతో చెయ్యి ఊపింది.

కిరణ్ మందహాసం చేస్తూ గరాజ్ లోనించి టయోటా బయటికి తీశాడు. బిందు ప్రొఫెషన్ సుఖం! టైంటు టైం పని! తనకో....? రాత్రింబగళ్ళ భేదం వుండదు. అదీగాక ప్రతిక్షణం ప్రమాదాలకి మృత్యువుకి అతి సమీపానికొచ్చి తప్పించుకోవటం తన వృత్తితో ముడి పడిపోయాయి!

టయోటా గేటు దాటకుండానే పోలీస్ జీప్ దూసుకొచ్చి ఆగింది కిరణ్ యింటిముందు.

శ్రీనివాస్ హడావిడిగా జీప్ దిగి, "హల్లో బ్రదర్, నీతో పనిపడి వచ్చాను. ఏదైనా అర్జంటు పనిమీద వెళ్తున్నావా?" అన్నాడు.

కిరణ్ మందహాసం చేసి, "ఏమిటా పని?" అనడిగాడు,

"ఒక్కసారి స్టేషన్‌కొస్తే అన్ని విషయాలు అక్కడ మాట్లాడుకుందాం. జీప్‌లో పోదాంరా!" అన్నాడు శ్రీనివాస్.

"నేను నా కార్లో వస్తానులే! అట్నుంచి అటే వెళ్ళాల్సిన పనులున్నాయి" అన్నాడు కిరణ్.

పదినిమిషాల తర్వాత శ్రీనివాస్, కిరణ్ పోలీస్ స్టేషన్‌లో ఎదురెదురుగా కూచుని వున్నారు.

"....ఇది బ్రదర్ విషయం. శవాల గుర్తింపు కూడా యింకా పూర్తి కాకుండానే శవాలు మాయమయ్యాయి. అప్పుడే ఏ.సి. రెండుసార్లు, డి.ఎస్పీ. నాలుగుసార్లు ఫోన్ చేసి, ఏమైనా ఆచూకీ తెలిసిందా అంటూ ఊదరగొట్టి వదిలిపెట్టారు. ఫోన్ వస్తే చాలు, ఎవరిదో అడక్కుండా నాకివ్వద్దని సార్జెంట్సుని హెచ్చరించి వుంచాను" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ శ్రద్ధగా విన్నాడు.

"అసలు యీ శవాలు నీకు ఎక్కడ దొరికాయి? ఎలా దొరికాయి?" అడిగాడు కిరణ్.

"నిన్న మధ్యాహ్నం సమయంలో ఊరవతల చింతల తోపులో దొరికాయి శవాలు. అక్కడ పొలాల్లో పని చేసుకునేవాళ్ళు వార్త తెచ్చారు. చింత చిగురు కోయటానికి ఆ తోపుకు పోయిన ఆడవాళ్ళు ముగ్గురు అలవాటు ప్రకారం చెట్లెక్కపోతూ చెట్ల మొదట్లో పడుకుని వున్నారెవరా అని దగ్గరికిపోయి చూశారట. అంతే 'కెవ్వు'న అరుచుకుంటూ సిటీలోకి వచ్చిపడ్డారట! ట్రాఫిక్ కానిస్టేబుల్ వాళ్ళ హడావిడి చూసి అడిగేసరికి, తాము చూసింది చెప్పారు. ట్రాఫిక్ కానిస్టేబుల్ నాకు రింగ్ చేసి చెప్పగానే సిబ్బందితో ఏకాఏకిన

వెళ్ళాను.

"శవాలు రెండు దర్శనమిచ్చాయి. ఒంటిమీద ఎక్కడా గాయంగాని మరేవిధమైన యింజరీస్ లేవు. హతులిద్దరు నిద్రపోతున్న భంగిమలో చింతచెట్టుకింద పడున్నారు. శరీరాలు అప్పటికే నీలిరంగుకి తిరిగున్నాయి. అక్కడికక్కడ జరిగిన హత్యలా, ఆత్మహత్యలా అన్నది యింకా నాకిప్పటికీ అర్థంకాని సమస్య! ఎందుకంటే పోస్టుమార్టంలో విషప్రయోగంవల్ల చనిపోయినట్టు వెల్లడయిందిగాని, ఆ ప్రయోగం బయటివాళ్ళ వల్ల జరిగిందా, లేక హతులే ఎందులోనైనా విషం కలుపుకు తాగి చచ్చారా అన్న విషయం ప్రశ్నార్థకంగానే వుండిపోయింది" అన్నాడు శ్రీనివాస్.

"చింతల తోపులో ఆధారాలేమైనా దొరికాయా?"

"దొరకలేదు. ఆ చుట్టుపట్లకూడా యెక్కడా ఏం దొరకలేదు!"

"శవాల ఫోటోలు తీయించావా!"

"ఆఁ! తీ యిం చా ను, చూస్తావా?" అన్నాడు శ్రీనివాస్.

"ఓసారి చూపించు!....ఆ హతుల వివరాలు—అంటే ఐడెంటిఫికేషన్ మార్క్సు నోట్ చేశావా?"

"ఆఁ యిదిగో ఫైలు!"

కిరణ్ ముందుగా హతుల ఫోటోలు పరిశీలనగా చూశాడు. వాటిలో శివరావు ఫోటోకి ఎక్కడా పోలికలు కనిపించలేదు. గుడ్ గాడ్! శివరావు ఎక్కడో ఓచోట సురక్షితంగానే వున్నాడనుకోవచ్చు.

"ఇప్పుడు నాకేది దారి? నువ్వు ఏదయినా ఉపాయం చెప్పి పుణ్యంకట్టుకో!"

"ఇప్పుడు నువ్వుగాని నేనుగాని చెయ్యగలిగిందేమీ లేదు. మొదటి పాయింటు. శవాలు అంతర్ధానమయ్యాయి, రెండు. ఎందుకు దొంగిలించారు, ఎవరు దొంగిలించారు. వాళ్ళకు శవాలవల్ల ప్రయోజనమేమిటి? మూడు. ఆ రెండు మరణాలు హత్యలా లేక ఆత్మ హత్యలా? నాలుగు. ఇంతకీ ఆ శవాలు ఎవరివి? ఒంటిమీద గుడ్డలను బట్టి ఖరీదైన మనుషులే కావచ్చునని చెప్తున్నావు. కాబట్టి కొండను తవ్వి ఎలుకను పట్టినట్టు అవుతుందా అని ఆలోచించాలి."

శ్రీనివాస్ తలూపాడు. "ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు?" అనడిగాడు.

"మరేం లేదు—ఐడెంటిఫికేషన్ మార్క్స్ ఎలాగూ వున్నాయికదా! వాటిని ఉదహరిస్తూ పేపర్లో ప్రకటించు! వాళ్ళ శవాలు పోలీస్ స్టేషన్లో ఐడెంటిఫికేషన్ నిమిత్తం వుంచబడ్డాయని, వారి తాలూకువాళ్ళు వచ్చి శవాన్ని గుర్తుపట్టాల్సిందనీ, వేయించు. హత్య ఆత్మ హత్యల మీమాంసగాని, నేను కేసులో పనిచేస్తున్న నిజంగాని వాళ్ళకు తెలియనివ్వద్దు!"

"అలాగే! మంచి సలహానే యిచ్చావు. కాని మరో ధర్మసందేహం! ఒకవేళ శవాల తాలూకు మనుషులు వచ్చారే అనుకుందాం—తను మనుషుల్ని—అదే—శవాల్ని హేండోవర్ చెయ్యమని అడుగుతే ఏం చెయ్యాలి? శవాలు మాయమయ్యాయని చెపితే వూరుకోరు కదా!"

"ఈ లోపల మీ డిపార్టుమెంటు మాయమయిన శవాల్ని పట్టుకోలేదా? షేమ్ షేమ్!"

"ఏమో, పట్టుకోలేకపోయిన పక్షంలో పబ్లిక్లో గొడవయిపోదా? బాగా ఆలోచించు."

"నా ఉద్దేశ్యం నీ కర్థం కాలేదు. శవాల తాలూకు బంధువులు వస్తే వాళ్ళనుండి శవాల హతుల వివరాలు, వాళ్ళకెవరైనా శత్రువులుంటే వాళ్ళ వివరాలు తెల్సుకోవచ్చుకదా! అప్పుడు హంతకుల గురించి—హత్యలే అయితే తెల్సుకోవటానికి ఓ దారంటూ ఏర్పడుతుంది. తర్వాత వాళ్ళని పట్టుకోవటం పెద్ద కష్టంకాదు!"

"ఆల్ రైట్! నీ సలహా ప్రకారమే లోకల్ పేపర్సు అన్నిట్లోను ప్రకటనలిస్తాను. అన్ని టౌన్ స్టేషన్స్‌కీ శవాల అంతరానం గురించి యిన్ఫర్మేషన్ యిదివరకే వెళ్ళిపోయింది. పాత కేడీలని కూడా యింటరాగేట్ చెయ్యటం ప్రారంభమయింది."

"గుడ్! నా ఊహే నిజమయితే, శవాల తాలూకు బంధువులొచ్చేసరికి శవాలు మనకి దొరికితీరతాయి. లెటజ్ ట్రై సిన్సియర్లీ!"

"మార్ఛ్యురీకి వెళ్ళి పరిశోధించావా?"

"నువ్వు డీటెయిల్డుగా చేశావుకదా! నీ ఫైండింగ్స్ బాగానే వున్నాయి. నేనయినా అంతకన్న చేసేదిలేదు. అయితే నువ్వీలోపల ఆ వాహనం టైర్ల ఆధారంతో అది ఎవరి వాహనమో ఎంక్వయిరీ చేయించు. మార్చ్యురీ బల్ల మీద, వరండా తలుపులమీద దొరికిన వేలిముద్రలు పాత నేరస్తులవేమో టాలీ చేయించు. హాస్పిటల్ వెనకపక్కనున్న లాడ్జిల్లోగాని, టీ బంకుల్లోగాని యెవరైనా శవాల్ని ఎత్తుకుపోతుండగా చూశారేమో వాకబు చేయించు, ఇది చాలా ముఖ్యం! పేషెంట్లు తాలూకు మనుషులుగాని, టీ బంకుల్లో పనిచేసేవాళ్ళుగాని చూసి వుండొచ్చు. కాని కేసులు, కోర్టులు అంటే చాలామంది చూసినా చెప్పటానికి ముందుకి రారు!"

"అలాగే ఇప్పుడే సార్జంటు శివాన్ని, రాజునీ పంపి స్తాను. వాళ్ళు యిలాంటి ఎంక్వయిరీస్ చెయ్యటంలో ఎక్స్‌పర్ట్స్!"

కిరణ్ లేచాడు. "అవసరమైతే ఫోన్ చెయ్యి! ఈ లోపల వీలయితే మళ్ళీ వస్తాను" అన్నాడు.

# 4

కిరణ్ బయట తిరిగి యింటికొచ్చేసరికి ఓ ముస లాయన అతనికోసం ఎదురుచూస్తూ కూచున్నాడు. ఆయన వరండాలోనే అటు యిటు లేచి పచార్లు చేస్తూ కూచుంటూ మళ్ళీ లేచి పచార్లు చేస్తూ అస్థిమితంగా వున్నాడు.

రాత్రి ఎనిమిదిగంటల సమయం.

కిరణ్ డ్రాయింగ్ రూంలోకొస్తూనే ఆయన లేచి నిలబడి నమస్కారం చేశాడు.

"మీకోసం దాదాపు ఓ గంటనించి ఎదురుచూస్తు న్నాను. అప్పుడే లాయరుగారు రెండుసార్లు టీ పంపిం చారు కూడా!" అన్నాడాయన.

కిరణ్ ఆయనవంక పరిశీలనగా చూశాడు. ఆయన వయసు దాదాపు ఏభై ఏళ్ళుండవచ్చు. కాని నలభై ఏళ్ళవాడిలాగా దృఢంగా బలంగా వున్నాడు. తెల్ల పంచె, తెల్ల లాల్చీ వేసుకుని, భుజాన పెద్దాపురం సిల్కు కండువా వేసుకున్నాడు.

కిరణ్ ఆయన్ని కూర్చుండజేసి, తను కూర్చుని "చెప్పండి!" అన్నాడు.

ఆయిన కుర్చీలో అస్థిమితంగా కదిలి, "నా పేరు జనార్ధనం. పద్మా పవర్ లూమ్స్ ప్రొప్రయిటర్ని!" అన్నాడు.

కిరణ్ ముఖం వికసించింది. తలూపాడు.

"నా అల్లుడు శివరావు వారంరోజులుగా యిల్లువదిలి వెళ్ళిపోయాడు. ఎన్నిచోట్ల వెతికించినా లాభంలేక పోయింది. పోలీసు రిపోర్టివ్వబోయి, వాళ్ళు ఎక్కడలేని అనుమానాలతో మమ్మల్ని మనశ్శాంతి లేకుండా చేస్తారని భయపడి ఆ ప్రయత్నం చెయ్యలేదు.

అయితే రెండురోజుల క్రితం నాకో బెదిరింపు ఉత్తరం వచ్చింది. అందులో నా అల్లుడు వాళ్ళదగ్గర క్షేమంగా వున్నట్టు, ఏభై వేలిచ్చి విడిపించుకోవలసిందని ఉత్తరంలో రాశారు. నేను దాన్ని లెక్కచెయ్యలేదు. ఆమర్నాడే నేను మిల్లులో కూచునే టేబిల్ సొరుగులో మరో చీటీ పడివుంది—

అందులో 'నీ అల్లుడి ప్రాణంకన్న నీకు డబ్బు ముఖ్యమా? మాది ఉత్త బెదిరింపు కాదని నువ్వే తెల్సుకుంటావు' అని వున్నది." జనార్దన్ ఓక్షణం ఆగి నుదుటికి పట్టిన చెమట అద్దుకున్నాడు. ఆయన కంఠంలో విచారం ధ్వనించి గొంతు మారుతోంది.

"డబ్బు ఎక్కడ అందించాలో రాసిలేదా ఉత్తరంలో?"

"రాశారండి. ఊరి చివర చింతలతోపు దగ్గరికి తీసుకు రమ్మన్నాడు. మా అల్లుడ్ని అక్కడే అప్పగిస్తానని రాశాడు. ఇవిగో ఆ రెండు ఉత్తరాలూను!" అంటూ రెండు కాగితాలు—పావురావు సైజువి—తీసియిచ్చాడు జనార్దనం.

రెండూ యింగ్లీషులో టైప్ చేయబడి వున్నాయి.

"రెండూ మీ మిల్లు ఆఫీసులోనే దొరికాయా మీకు?"

"మొదటిది పోస్టులో వచ్చిందండి. రెండోది టేబిల్

సొరుగులో దొరికిందండి.''

"లోకల్ లెటరో కాదో పోస్టల్ ముద్రచూశారా?"

"లేదండి ఆ కంగారులో నాకే ఆలోచన రాలేదు."

"బహుశా లోకలే అయుండాలి. కిడ్నాపర్స్ మిమ్మల్ని యీ వూరి చివర చింతలతోపుకే కదా రమ్మన్నారు!"

"అవునండి. అసలు, సమస్య యీ ఉత్తరాలు కాదండి, యిదిగో యిది!...." అంటూ జనార్దన్ తన వెంట తెచ్చిన జిప్ బ్యాగ్ నించి ఓ కాగితం ప్యాకెట్టు పైకితీశాడు. దాన్ని టేబిల్ మీద పెట్టి కాగితం విప్పాడు.

ఆ వస్తువును చూసి కిరణ్ ఉలిక్కిపడ్డాడు.

అది మణికట్టువరకు తెగ్గొట్టిన చెయ్యి! భయంకరంగా వుంది.

జనార్దనం కళ్ళు వర్షించటానికి సిద్ధంగా వున్నాయి.

"ఇది నా అల్లుడి చెయ్యి! తెగ్గొట్టి పంపారు దుర్మార్గులు! రేపు ఉదయంలోపల లక్షరూపాయలు తీసుకుని చింతలతోపుకి రాకుంటే నా అల్లుడు శవాన్ని చింతచెట్ల మధ్య చూసుకోమని రాశారు. ఇదిగో ఉత్తరం!" అన్నాడు జనార్దనం.

కిరణ్ కళ్ళు ఆ హస్తంవంకే దీక్షగా చూస్తున్నాయి. చెయ్యి తెగ్గొట్టబడి మూడురోజులు కావచ్చు. తెగిన ప్రదేశంలో నల్లగా వుంది. చెయ్యి పాడవకుండా ఫార్మలిన్ ద్రవంలో వుంచినట్టు స్పష్టంగా తెలుస్తోంది.

కిరణ్ జనార్దనంవంక చూసి, "ఈ చెయ్యి మీ అల్లుడిదేనని ఖచ్చితంగా చెప్పగలరా?" అనడిగాడు.

"మా అల్లుడిదేనండి. కుడిచేతి ఉంగరం వేలికి నేనే వెంకటేశ్వరస్వామి ఉంగరం చేయించాను. దాన్ని

అలాగే వుంచి మరీ పంపించారు. దాన్నిబట్టి యిక అనుమానం పూర్తిగా తీరిపోయింది నాకు!"

"వేరే చెయ్యి ఖండించి, ఆ చేతి వేలికి మీ అల్లుడి ఉంగరం పెట్టి వుండొచ్చుకదా! అప్పుడు మీరు ఆ చెయ్యి మీ అల్లుడిదేనని పొరబడవచ్చుకదా! మిమ్మల్ని బాగా భయపెట్టడానికి వాళ్ళు అలా చేసి వుండొచ్చు. చెయ్యి ఖండించాక బాగా రక్తం పోతుంది. అప్పుడు మీ అల్లుడి ప్రాణం కూడా దక్కకపోవచ్చు. అంచేత ఆ పనికి వాళ్ళు పూనుకుని వుండరు."

"ఏ డాక్టరుచేతనో ట్రీట్‌మెంటు యిప్పించి మనిషి ప్రాణం పోకుండా చేస్తారు సార్! వాళ్ళు మరీ అంత తెలివితక్కువ వాళ్ళు కాదని నాకు వాళ్ళ ధోరణినిబట్టి అర్థమయ్యింది."

"ఈ చెయ్యి మీకు ఎలా అందజేయబడింది?"

"రెండో ఉత్తరం పెట్టినట్టే దీన్ని నా ఆఫీసు సొరుగులో పెట్టి వుంచారు."

"అదెలా వీలవుతుంది? మీరు టేబిల్ సొరుగుకి తాళం వెయ్యరా? ఆఫీసురూంకి కూడా తాళం పెట్టి వుంచరా?"

"వేసే వుంచాను సార్! ఇంతకు తెగించిన వాళ్ళకి తాళాలు తియ్యటం ఓ లెక్కా?"

"మీ మిల్లులో పనిచేసేవాళ్ళ ద్వారా యీ తతంగమంతా జరుగుతుండవచ్చు. మీ వర్కర్సులో అనుమానాస్పదమైన వాళ్ళెవరైనా వున్నారా?"

జనార్దన్ రెండు నిమిషాలు ఆలోచించి, "అందరూ నమ్మకస్థులేనండి. మొత్తము ఏభై రెండుమంది వున్నారు. వీళ్ళలో మూడువంతులమంది నా మిల్లు పెట్టినప్పట్నుంచీ నమ్మకంగా పనిచేస్తున్నారు. తక్కినవాళ్ళని దరిమిలా

అప్పుడప్పుడు పనిలోకి తీసుకున్నాను. వ్యక్తిగతంగా నా మీద కక్షగాని ద్వేషంగాని వున్నవాళ్ళు మా వర్కర్సులో ఎవరూ లేరు!" అన్నాడు.

"గుర్తు తెచ్చుకోండి. జీతాలు చాలవనిగాని, బోనస్ పెంచమనిగాని యిలా ఎవరైనా కోర్కెలు డిమాండ్ చేసినవాళ్ళెవరైనా వుండొచ్చు. మీరు వాళ్ళ కోర్కెలు తీర్చకపోవటంతో యిలా కక్ష సాధింపు ధోరణికి దిగి వుండవచ్చు!"

జనార్దన్ కొద్ది క్షణాలు మౌనం తర్వాత, "లేదు సార్! అసలు జీతాలు పెంచమని యీ మధ్య మా వర్కర్సు ఎవరూ అడగలేదు. నే నెవరితోనూ ఘర్షణ పడలేదు. ప్రతి సంవత్సరం పెరుగుతున్న ధరల్ని దృష్టిలో పెట్టుకుని నేనే జీతాలు పెంచుతూ వస్తున్నాను." అన్నాడు.

"సరే, మీ మిల్లువాళ్ళని వదిలెయ్యండి. మీకుగాని మీ అల్లుడికిగాని వ్యక్తిగతంగా ఎవరైనా శత్రువులున్నారా? ముఖ్యంగా మీకు....?"

"పర్టిక్యులర్‌గా చెప్పనుగాని, మా మిల్లుతో బాటు మరొకాయన పవర్‌లూమ్స్ పెట్టాడు. కాని ఆయనకి దాన్ని నడిపే సామర్థ్యంలేక బాగా నష్టాలమీద నడుస్తోంది. అతనికి వృత్తిపరంగా నామీద చాలా కోపంగా వుంది—నా ప్రోడక్టుకి మార్కెట్లో మంచి విలువుంది. నా పనివాళ్ళు కూడా అనుభవంలో ఆరితేరినవాళ్ళు. ఒకప్పుడు నా వర్కర్సుకి ఎక్కువ జీతం ఆశపెట్టి తన ఫర్మ్‌లోనికి లాక్కోవాలని కూడా చూశాడాయన!"

"ఆయన పేరు?"

"మల్లేశం! మా మిల్లుకి ఓ అరవై గజాలదూరంలో నే

ఆయన మిల్లో వుంది, లక్ష్మీ పవర్ లూమ్స్!"

"ఊం! అలాగే ఇంకా ఎవరైనా వుంటే చెప్పండి."

జనార్దనం ఓ నిమిషం ఏదో ఆలోచించి "అంతే సార్! నా కింకెవరిమీదా అనుమానంలేదు" అన్నాడు. ఆ చెయ్యిని తిరిగి పేపర్లో చుట్టేసి బ్యాగ్ లో పెట్టుకో బోతుంటే కిరణ్ అన్నాడు.

"ఆ చెయ్యి నా దగ్గర వుంచటానికి మీకేమైనా అభ్యంతరమా?" అని.

"అబ్బే, అదేంలేదండి! దీన్ని నేను మిల్లునుంచి సరాసరి యిక్కడికే తీసుకొచ్చాను. ఇంటికి తీసుకువెళ్తే నా కూతురు చూసిందంటే యింక ఆమెను ఆపటం ఎవరి వల్లాకాదు. మీ దగ్గరే వుంచండి" అంటూ ప్యాకెట్ టేబిల్ మీద పెట్టాడు జనార్దనం.

"ఓ.కే! మీ అల్లుడిగారి పోలికలు, తక్కిన వివరాలు, ఆయన ఫోటో కావాలి నాకు!" అన్నాడు కిరణ్. వకుళ చూడబోతే తండ్రికి తెలియకుండానే తన దగ్గరకు సహాయంకోరి వచ్చిందని అతనికర్థమైపోయింది. తన కస్టమర్స్ రహస్యాలు దాచటం తన వృత్తి ధర్మం! అందుకే ఏం ఎరగనట్టు శివరావు వివరాలు మళ్ళీ అడిగాడు.

జనార్దనం ఓ కార్డు సైజు ఫోటో యిచ్చి శివరావు ఒడ్డు, పొడవు వివరాలు చెప్పాడు.

ఆ తర్వాత, "ఈ చెయ్యి నా అల్లుడిది కాకూడదని వెయ్యి దేవుళ్ళకి మొక్కుకుంటున్నాను. మీరు చెప్పాక నాకు ధైర్యం వచ్చిందే. వేరేవాళ్ళ చేతివేలికి నా అల్లుడి ఉ ం గ ర ం తగిలించటానికవకాశముంది" అన్నాడు జనార్దనం."

జేబునుండి చెక్ బుక్ తీసి సంతకం చేసి కిరణ్ ముందు

పెట్టాడు. "బ్యాంక్ చెక్. మీ ఫీజు ఎంతో ఫిగర్ వేసుకోండి" అన్నాడు.

కిరణ్ చెక్ బుక్ ఆయనవంక చూసి, "అవసరమైతే నేనే అడుగుతానులెండి. అందాకా మీ దగ్గరేవుంచండి" అన్నాడు.

"అదేమిటి బాబూ, అడ్వాన్స్ తీసుకోరా?"

"అంతా ఒకసారే యిద్దురుగాని!" అన్నాడు కిరణ్ చిన్నగా నవ్వి.

"నా అల్లుడ్ని క్షేమంగా కళ్ళచూస్తాననే ధైర్యం నాకు చాలటంలేదు. రేపు ఉదయంలోపల డబ్బివ్వకపోతే నిజంగానే ఏదైనా చేస్తారేమో, నా అల్లుడ్ని. మీ సలహా ఏమిటి?"

"మీ అడ్రసు యిచ్చారుగా. ఫోన్ నంబర్ కూడా నోట్ చేసుకున్నాను. అవసరమైతే ఉదయమే మీ దగ్గర కొస్తాను. మీ యింటినుంచి సరాసరి చింతలతోపుకి వెళ్దాం!" అన్నాడు కిరణ్.

"చాలా సంతోషం బాబూ! మీకు అప్పగించేసి నా భారం దించేసుకున్నాను. నా అల్లుడ్ని యిప్పుడే చూసి కౌగలించిన ఆనందం కలుగుతోంది. నా కూతురి కష్టం చూడలేకుండా వున్నాను. త్వరలో ఈ సమస్య పరిష్కరించండి" అన్నాడు జనార్దనం లేచి నిలబడి.

"మీరు నిశ్చింతగా వుండండి. మీ అల్లుడిగారికే ప్రమాదమూ లేదు" అన్నాడు కిరణ్ మందహాసం చేస్తూ.

జనార్దనం నమస్కరించి కిందకు దిగి వెళ్ళిపోయాడు. ఆయన మెట్లు దిగి తన కారు దగ్గరికి వెళ్తూండగానే కిరణ్ జనార్దనం నంబర్ కి రింగ్ చేశాడు.

వకుళ ఫోన్ ఎత్తింది.

"హలో మిసెస్ శివరావుగారూ! నేను కిరణ్‌ని మాట్లాడుతున్నాను. మీవారి కుడిచేతిమీద ఏమైనా పుట్టుమచ్చలుగాని, ఉలిపిరికాయలుగాని వున్నాయా?" అనడిగాడు కిరణ్.

"లేవండీ! పుట్టు మచ్చల్లాంటివేమీ లేవు. ఏమైనా ఆచూకీ తెలిసిందాండీ?"

"లేదులెండి. గుర్తుకోసం అడిగాను."

"మావారి నుదుటిమీద కుడివైపు పెసరగింజంత పుట్టు మచ్చ వుంది. ఛాతీమీద ఎడమపక్క వీపుమీద కంది గింజంతేసి పుట్టుమచ్చలున్నాయి. నాకు తెలిసినంతవరకు గుర్తున్నవి యివే!"

"ఓ.కే! వుంటానండి. ఏమైనా తెలిసినవెంటనే మీకు ఫోన్ చేస్తాను" అంటూ ఫోన్ పెట్టేశాడు.

టేబిల్ మీదున్న చెయ్యివంక చూశాడు. అది కుడి చెయ్యి. బొటనవేలిమీద చిన్న ఉలిపిరికాయ వుంది!

కిరణ్ మస్తిష్కంలో ఏదో మెరిసింది. వెంటనే శ్రీనివాస్‌కి రింగ్ చేశాడు.

"హలో, నేనే బ్రదర్! ఏమైనా తెలిసిందా?"

"ఇంకా ఏం లేదుగాని, నీ మాయమైన శవాలు ఎవరికైనా కుడిచేతిమీద ఉలిపిరికాయలున్నాయా?"

"ఒక్క నిమిషం....ఆఁ! ఓ శవానికి కుడిచేతిమీద ఉలిపిరికాయ వుంది. ఐడెంటిఫికేషన్ మార్కుల్లో నోట్ చేశాను."

"అలాగా! అయితే నీ మాయమైన శవాల్లో ఓ శవం కుడిచెయ్యి నీకు హేండోవర్ చెయ్యబోతున్నాను" అంటూ ఫోన్ పెట్టేశాడు కిరణ్.

# 5

"ఒకసారి మీరు రాగలరా మా ఇంటికి?" అన్నాడు కిరణ్ ఫోన్‌లో.

"ఇప్పుడే రమ్మంటారా? మీ యింటికేనా, అక్కడి నుంచి ఎక్కడికైనా వెళ్ళాలా?" జనార్దన్ అడిగాడు.

"చింతలతోపుకి వెళ్ళాలి. మీ కార్లో రండి.

"అలాగా! అయితే డబ్బు తీసుకుని రమ్మంటారా?"

"ఏం అక్కర్లేదు. నా దగ్గర బ్రీఫ్ కేసులో వుంది. ఏం చెయ్యాల్సిందీ మీరొచ్చాక చెపుతాను."

"అలాగే! ఓ అరగంటలో వస్తున్నాను."

కిరణ్ సోఫాలో కూచుని ఆలోచిస్తున్నాడు.

"ఇదిగో ఈ బ్రీఫ్ కేస్ చింతలతోపులో కిడ్నాపర్స్ పెట్టుకున్న సంకేత స్థలంలో మీరొక్కరే తీసుకుని వెళ్ళి పెట్టండి! నేను కారు వెనక సీట్లో బయటికి కనపడకుండా కూచుని వాచ్ చేస్తూంటాను. మీ అల్లుడిగార్ని వాళ్ళు తీసుకువస్తే జరగాల్సిన కార్యక్రమం నేను చూసుకుంటాను."

జనార్దనం బ్రీఫ్ కేసు తెరిచి, "అరె, అన్నీ వంద రూపాయల నోట్లు! నన్ను వద్దని మీరు తెస్తున్నారు దేనికి?" ఆశ్చర్యంగా అడిగాడు జనార్దనం.

కిరణ్ చిన్నగా నవ్వి, "సరిగ్గా చూడండి!?" అన్నాడు.

జనార్దనం ఓ కాగితం కట్ట తీసుకుని తిరగేసి, "అరె పైన క్రింద కరెన్సీ నోట్లున్నాయి. మధ్యలో అదే సైజు తెల్ల కాగితాలు! ఒకవేళ యిది మోసమని గ్రహించి ఆ కిడ్నాపర్స్ నా అల్లుడినేమైనా చేస్తే....?" అన్నాడు.

"అసలు ఆ కిడ్నాపర్స్‌ని రంగంలోకి ప్రవేశించ

నివ్వండి. ఏం చెయ్యాలో అంతా ప్లాన్ చేసి వుంచాను. సమయానికి పోలీస్ సహాయంకూడా సిద్ధంగా వస్తుంది."

జనార్ధనం ప్రశంసగా చూశాడు కిరణ్ వంక.

"ఇక బయల్దేరుదామా?" అన్నాడు కిరణ్ బ్రీఫ్ మూసి చేత్తో పట్టుకుంటూ.

జనార్ధనం "అలాగే!" అన్నాడు.

"నేను కారు వెనక సీట్లో నే కనపడకుండా కూచుని వుంటాను. చింతలతోపు మీకు తెలుసుకదా!"

"ఊరి చివర లొకేషన్ తెలుసునుకోండి. ఎప్పుడూ పోలేదక్కడికి!"

"అవసరమైతే రూట్ చెపుతాలెండి."

ఇద్దరు జనార్ధనం కారెక్కారు. కారు ఊరిచివర చింతలతోపువైపు దూసుకుపోయింది.

ఇరవై నిమిషాల ప్రయాణం తర్వాత చింతలతోపు చేరారు యిద్దరు.

కిరణ్ సైగ చేశాక జనార్ధనం బ్రీఫ్ కేసుతో దిగాడు.

అక్కడ నిర్మానుష్యంగా వుంది. దూరంగా పొలాల్లో పనులు చేసుకునే వాళ్ళు కనిపిస్తున్నారు. చింతచిగురు కోసుకోవటానికి వచ్చే ఆడవాళ్ళు కనిపిస్తారేమోనని చూశాడు కిరణ్. మొన్నటి సంఘటనతో బెదిరిపోయి నట్టున్నారు—ఎవరూ రాలేదు.

జనార్ధనం తోపు మధ్యలో బ్రీఫ్ కేసుతో నిలబడి వున్నాడు. పదినిమిషాలు... యిరవై నిమిషాలు....

టైం గడిచిపోతూనే వుంది.

సరిగ్గా ఓ గంట గడిచినా ఎవరూ వస్తున్న జాడ కనిపించలేదు. జనార్ధనం కారువైపు చూస్తున్నాడు కిరణ్ సూచనలకోసం!

జనార్ధనం నించున్న చింతచెట్టు మొదట్లో ఏదో కాగితం గాలికి రెపరెపలాడుతోంది. దానిమీద ఎగిరి పోకుండా ఓ చిన్నరాయి బరువు పెట్టబడి వుంది.

కిరణ్ కారు దిగాడు. చెట్టు దగ్గరికి వెళ్ళి రాయి కిందనుంచి కాగితాన్ని తీశాడు. జనార్ధనం ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

కిరణ్ కాగితం చదివాడు. నాలుగే లైన్లు టైప్ చేయబడి వున్నాయి యింగ్లీషులో.

“జనార్ధనం, నిన్ను ఒంటరిగా డబ్బుతో రమ్మని రాస్తే కిరణ్ సహాయం కోరారు కదూ! అంటే నీకు మా హెచ్చరిక లెక్కలేదన్నమాట! రేపే సమయానికి నీ అల్లుడి శవం యిదే చెట్టుకింద పొర్లుతుంటుంది, వచ్చి కలెక్టు చేసుకో!” అని వుంది. సంతకం లేదు.

ఇదివరకటి ఉత్తరాలకు మల్లే అదే టైపు అక్షరాలు! అలాంటి పేపరే వాడారు.

కిరణ్ ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాడు.

“పదండి వెళ్దాం!” అన్నాడు కిరణ్.

“ఆ ఉత్తరం నేను చూడవచ్చా?” అడిగాడు జనార్ధనం.

కిరణ్ ఓ క్షణం ఆలోచించి జేబులోనుండి ఉత్తరం తీసిచ్చాడు. అది చదివిన జనార్ధనం నిశ్చేష్టుడయ్యాడు.

## 6

కిరణ్ యింట్లోకొస్తూనే శ్రీనివాస్‌కి రింగ్ చేశాడు.

“హల్లో మైడియర్ ఇన్స్పెక్టర్! నేను చెప్పిన విషయం ఏం చేశావు?”

“ఏమిటి, శివరావు విషయమేనా?”

“అవును. ఏమయినా ఎంక్వయిరీ చేయించావా?”

"సిటీలో ఎక్కడ ఏ మూల వున్నా మా వాళ్ళు పట్టేస్తారు బ్రదర్! రాత్రి మా శవం చెయ్యి హేండోవర్ చేసినప్పుడు చెప్పావో లేదో మా వాళ్ళందరికీ పేరు పేరునా పిలిచి చెప్పేశాను. అప్పుడే కొన్ని ఏరియాస్ నుంచి రిపోర్ట్సుకూడా వచ్చేసినవి. ఎక్కడా అతని జాడ లేదు. రాజమండ్రి మా ఫ్రెండుకి ఎస్పీ డీల్ కాంటాక్టు చేసి చెప్పాడు. అతను సర్కిల్ ఇన్స్పెక్టర్. అక్కడ కూడా శివరావు స్నేహితుల్ని, బంధువుల్ని అందర్నీ ఎంక్వయిరీ చేయమన్నాను. మధ్యాహ్నానికి ఆ రిపోర్టు కూడా వస్తుంది."

"థాంక్యూ బ్రదర్!"

"నాకు థాంక్సు వద్దుగాని, నా మాయమైన శవాల సంగతి నువ్వే చూసుకోవాలి. ఈ విషయంలో మా వాళ్ళ అసమర్థతకి నేను సిగ్గుపడుతున్నాను."

"ఇదేవిధంగా శివరావు విషయంలోకూడా సిగ్గుపడవు కదా!"

"నో, నో, బ్రదర్! ఏమో, ఏ పుట్టలో ఏ పాముందో? శివరావు అంతర్ధానానికి నా శవాల అంతర్ధానానికి సంబంధమున్నా వుండొచ్చు, ఏం చెప్పగలం?"

"యూ ఆర్ రైట్! తప్పకుండా సంబంధమున్నది. ఆ వాహనం టైరు గుర్తులు ట్రేస్ చేశావుకదా! ఆ టైర్లు మెటాడార్ వేన్ వని నా నమ్మకం. యామై రైట్?"

"కరెక్టు బ్రదర్! మెటడార్ వేన్ వే! అయితే సిటీలో కొన్ని వేల వేన్‌లున్నాయి. ఇదెవరిదో ఎలా కని పెట్టడం?"

"నేను వచ్చాక మాట్లాడదాం. ఫోన్‌లో వివరాలు చెప్పడం బావుండదు. అయితే ఒక్క విషయం నీకు

క్లారిఫై చేస్తున్నాను. నీ శవాల్లో ఓ శవం చెయ్యిని కత్తిరించి శివరావు కిడ్నాపర్స్ అతని మామకు పంపించారు. అంటే శవాల్ని మాయం చేసినవాళ్ళు, కిడ్నాపర్స్ వేరువేరు కాదు. అంటే ఆ కిడ్నాపర్స్ శివరావు మామ జనార్ధనం శత్రువులు. ఆ శత్రువు యెవరో చూచాయగా అతను చెప్పాడు. అట్నుంచి నరుక్కొనివద్దాం" అంటూ ఫోన్ పెట్టేశాడు కిరణ్.

అంతలోనే ఫోన్ గణగణ మోగింది.

"హలో కిరణ్ స్పీకింగ్!"

"నేనండీ, వకుళని మాట్లాడుతున్నాను."

"శివరావుగారి విషయం యింకా ఓ నిర్ణయానికి రాలేదమ్మా!"

"నాకు ఏదో భయంగా వుందండి!"

"ఫరవాలేదమ్మా. త్వరలోనే ఆయన్ను క్షేమంగా నీకు అప్పగిస్తాను, సరేనా!"

"మీరు చెప్పే ధైర్యమే నాకు ఊపిరిపోస్తోంది."

"ఆ, మీ నాన్నగారింట్లో వున్నారా?"

"ఎక్కడికో వెళ్ళివచ్చి, యిప్పుడే మిల్లుకి వెళ్ళిపోయారండి."

"నీకో విషయం చెప్పాలమ్మా, మీ నాన్నగారు కూడా శివరావుగారి గురించి ఆచూకీ తెలుసుకోమని నన్ను కోరారు."

"చూశారా, నాన్నగారికి నామీద ఎంత ప్రేమో!"

"ఉంటానమ్మా!" ఫోన్ పెట్టేశాడు కిరణ్.

ఫోన్ దగ్గర్నుంచి లేస్తూండగానే మళ్ళీ రింగయింది.

"హల్లో డిటెక్టివ్ కిరణ్ హియర్?" అన్నాడు.

"సార్! నా పేరు రమేష్. ఫోటోగ్రాఫర్ని. వకుళా

స్టూడియో నడుపుతున్నాను. నా గురించి మీకు తెలియక పోయినా మీ గురించి నాకు తెలుసు. వకుళ తన భర్త అంతర్ధానం గురించి, మీ సహాయంకోరి రావటం నాకు తెలుసు. ఆ విషయమై కొన్ని వివరాలు మీకు చెప్పాలని రెండు రోజులుగా ప్రయత్నిస్తున్నాను. కాని మిమ్మల్ని కలుసుకోలేకపోతున్నాను" అతను చెప్పటం ఆపాడు రెండు క్షణాలు.

కిరణ్ టెన్షన్‌తోను, ఉత్సుకతోను కుర్చీలో ముందుకి వంగి జాగ్రత్తగా వింటున్నాడు.

"కారణం—ఎవరో గుర్తు తెలీని యిద్దరు వ్యక్తులు అనుక్షణం నన్ను నీడలా వెన్నంటుతున్నారు. అందుకే నేను చెప్పాలనుకున్న విషయాలు వివరంగా రాసి మీ పేర యిందాకే పోస్టు చేశాను."

"మీరెక్కడనుంచి మాట్లాడుతున్నారు?"

"నా స్టూడియోకి దగ్గర్లోనే వున్న పబ్లిక్ బూత్ నించి! ఇప్పుడే లెటర్ పోస్టుచేసి వచ్చాను. అందులో కొన్ని ముఖ్యమైన ఫోటోలు కూడా జతచేశాను. అవి చూడగానే శివరావుని దాచినదెవరో, మార్చ్యురీనించి రెండు శవాల్ని మాయంచేసిందెవరో మీకు తెలిసి పోతుంది....అదిగో నన్ను వెంటాడుతున్న మనుషులు కనిపెట్టేసి యిటే వస్తున్నారు. ఫోన్ పెట్టే...." అంటూండగానే ఢామ్మని పిస్తోలు పేలిన శబ్దం, ఆ వెనకనే ఫోన్‌లో రమేష్ ఆర్తనాదం హృదయవిదారకంగా విన్పించాయి.

కిరణ్ ఒక్కక్షణం వృధా చెయ్యలేదు. శ్రీనివాస్‌కి రింగ్ చేసి, "వెంటనే నీ సిబ్బందితో మెయిన్‌రోడ్‌లో వున్న వకుళా స్టూడియోకి సమీపంలో వున్న టెలిఫోన్

బూత్ కి రా! నేను యింటి దగ్గర్నుంచి అక్కడికే బయల్దేరి వెళుతున్నాను. ఓ ముఖ్యమైన సాక్షి చేజారి పోతున్నాడు" అని ఫోన్ పెట్టేసి రెండేసి మెట్లు ఒకే సారి గెంతుతూ గరాజ్ నించి టయోటా బయటికి తీశాడు.

## 7

పదినిమిషాల్లో టెలిఫోన్ బూత్ దగ్గరికి చేరుకున్నాడు కిరణ్. అప్పటికింకా శ్రీనివాస్ చేరలేదు.

టెలిఫోన్ బూత్ చుట్టూ జనం గుమిగూడి వున్నారు. మిట్టమధ్యాహ్నం జరిగిన సంఘటన కావటంతో జనం అందరూ అక్కడికే పరుగులు పెడుతున్నారు.

కిరణ్ కారుని పక్కగా పార్క్ చేసి, బూత్ లోపలికి దారిచేసుకోవటానికి చాలా అవస్థపడాల్సి వచ్చింది. అద్దాల్లోంచి బూత్ కి అడ్డంపడ్డ యువకుడు కనిపించాడు. అతని వీపులోని గాయంనించి యింకా రక్తం స్రవిస్తూనే వుంది. ముందుకి వాలిపోయాడు. అతన్ని వెనకనించి కాల్చినట్టుంది.

అతనే రమేష్ అని అర్థం చేసుకున్నాడు కిరణ్. మనిషిలో చలనంలేదు. వెంటనే ప్రాణం పోయుండాలి.

సైరన్ వేసుకుంటూ శ్రీనివాస్ జీప్ రావటంతో గుంపు చెదిరింది. ఎవరిమటుకు వాళ్ళు సాక్ష్యం వుండాల్సి వుంటుందని ఒకరొకరు జారుకున్నారు.

తక్కిన వాళ్ళని పోలీసులు చెదరగొట్టారు.

కిరణ్ క్లుప్తంగా రమేష్ కి తనకి మధ్య జరిగిన సంభాషణ తెలియచేశాడు.

శ్రీనివాస్ తన సిబ్బందికి ఆదేశాలిస్తున్నాడు. కిరణ్ తన సూదంటు రాయివంటి కళ్ళతో అక్కడ ప్రతి సెంటిమీటరు పరీక్షగా వెతుకుతున్నాడు—ఆధారాల

కోసం.

ఇంతలో దూరంగా ఏదో కలకలం విన్పించింది.

జనం హడావిడిగా పరుగులు పెడుతున్నారు.

కిరణ్ అటు దృష్టిసారించాడు. ఏదో కాలిపోతోంది. ఎర్రటి వస్తువు పరీక్షగా చూశాడు.

పోస్టు డబ్బా!

రమేష్ మాటలు గుర్తొచ్చాయి. అప్పుడే తనకి లెటర్ పోస్టుచేసి ఫోన్ చేస్తున్నానని చెప్పాడు. అంటే యిదే పోస్టుబాక్సులో వేసివుంటాడు ఆ ఉత్తరం! అది అతన్ని అనుసరిస్తూన్న మనుషులు గమనించి వుంటారు.

కిరణ్ నిస్సహాయంగా చూస్తుండిపోయాడు. అప్పటికే బాక్సంతా కాలిపోయింది. లోపల ఉత్తరాలన్నీ పూర్తిగా కాలిపోయి వుంటాయి. తన ఆధారాలు ఎక్కడా వదలకుండా జాగ్రత్త తీసుకోవటమేకాక, తనకి చేరబోయే ఆధారాల్ని కూడా చాలా కాషన్‌గా వాచ్ చేసి వాటి రూపాల్లేకుండా చేశాడు.

కిరణ్‌కి ప్రత్యర్థి ఎంత తెలివైనవాడో తెలిసివచ్చింది. ఇంతలోనే అతని మస్తిష్కంలో మెరుపులు మెరిశాయి.

"శ్రీనివాస్, నువ్విక్కడి తతంగం చూస్తుండు. నేనిప్పుడే పదినిమిషాల్లో వస్తాను" అంటూ కిరణ్ అతని సమాధానం కోసం కూడా చూడకుండా చకచక అడుగులు వేసుకుంటూ రోడ్డున నడిచాడు. బోర్డులు చూస్తూ నడుస్తూ 'వకుళా స్టుడియో' అన్నచోట ఆగాడు.

తలుపులు తీసే వున్నాయి.

పెద్ద హాలులాంటి గదిలో పార్టిషన్ ముందు కాస్త జాగాలో ఓ టేబిలు, కుర్చీలు వున్నాయి. పార్టిషన్ వెనక కెమెరా స్టాండు, లైట్సు కనపడుతున్నాయి

దానికి దూరంగా బ్యాక్ గ్రౌండ్ సీనరీ వున్న గుడ్డ తెర కార్డుబోర్డుమీద అతికించి వుంది.

లోపల యెవరూ లేరు. ఖాళీగానే వుంది.

రమేష్ ఒక్కడే సింగిల్ గా చూసుకుంటున్నట్టున్నాడు స్టుడియో. చిన్న స్టుడియో!

కిరణ్ సరాసరి లోపలికి వెళ్లాడు. హాలుకి కుడిపక్క ఏంటీ రూంవుంది. అదే డార్క్ రూమని గ్రహించాడు కిరణ్. తలుపులు తీసేసి వున్నాయి. ఎర్రటి బల్బ్ వెలుగుతోంది లోపల.

ఆ ఎర్రటి కాంతిలో నేలమీద నెగిటివ్ లున్న చిన్న అట్టపెట్టెలు చెదిరిపడివున్నాయి. గదినిండా నెగిటివ్ లు చెల్లాచెదురుగా చిందరవందరగా పడున్నాయి. అంటే డార్క్ రూమంతా యిదివరకే ఎవరో నెగిటివ్ లు వేటికోసమో వెతికారన్నమాట!

ఫోటోలు పోస్టులో పంపటంచూసిన హంతకుడి మనుషులు అటు పోస్టు డబ్బాని కాల్చెయ్యటమేకాక యిటు ఆ ఫోటోల నెగిటివ్ లు కూడా వెతుక్కు తీసుకుపోయారు. అన్ని మార్గాలు మూసేశారు తనకి!

ప్రత్యర్థి తెలివికి మరోసారి విస్తుపోయాడు కిరణ్. కొద్ది క్షణాలు కర్తవ్యం తెలీనివాడిలా అట్లాగే నిల్చుండిపోయాడు.

అసలు రమేష్ తనకేం రాశాడు? ఫోటోలు ఎవరివి? హంతకుడివేనా? అదే నిజమయితే తనకి బ్రహ్మాండమైన అవకాశం. వెంట్రుకవాసిలో తప్పిపోయిం దన్నమాట! ఇప్పటిదాకా సరైన ఆధారంలేక కేసు నత్త నడక నడుస్తోంది. ఒకేసారి కేసుకి ఆయువుపట్టులాంటి ఇన్ఫర్మేషన్ ఆధారాలతోసహా దొరికి అంతలోనే చేజారి

పోయింది.

కిరణ్ అక్కడే నిలుచుని స్టుడియోని పరీక్షగా చూశాడు. పెద్దగా ఫర్నిచర్ కూడా లేదు. స్టుడియో లోపల వున్న కెమెరా, ఫ్లేమ్స్ తప్ప యిక ఖరీదైన వస్తువులేం లేవు. చాలా చిన్న స్టుడియో.

స్టుడియో పేరు కూడా చిత్రంగా అనిపించింది. వకుళా ఫోటో స్టుడియో అన్న పేరు చిత్రంగా ధ్వనించింది. జనార్ధనం కుమార్తె—తన క్లయింటు—పేరు కూడా వకుళే! వకుళ తనకెంతో పరిచయమున్నట్టు ధ్వనించింది రమేష్ గొంతు ఫోన్‌లో. అదీకాక వకుళ చర్యల్ని ఎప్పటికప్పుడు కనిపెట్టి వుండటంలో రమేష్ ఆంతర్యమేమిటి?

వకుళపట్ల ఏమిటతనికి యింట్రెస్టు?

ఈ ఆలోచన రాగానే కిరణ్ రమేష్ డ్రాయిరు సొరుగు తెరిచి చూశాడు డైరీలాంటిదేమైనా దొరుకుతుందేమోనని!

అతని ఊహ నిజమయింది. డ్రాయరు సొరుగులో డైరీ వుంది. పైన ఎస్. రమేష్ బి. ఎస్సీ. అని వ్రాసి వుంది. రమేష్ గ్రాడ్యుయేట్ అన్నమాట! ఏ ఉద్యోగం దొరక్క చిన్న ఫోటోస్టుడియో పెట్టుకున్నాడన్నమాట!

లోపలి పేజీలు చాలవరకు ఖాళీగానే వున్నాయి.

ఒకచోట మాత్రం ఈ రోజు వకుళ చాలా విచారంగా వున్నట్టు కనిపించింది. యెందుకో మరి? రెండు రోజులుగా శివరావు కనిపించటంలేదు, రాజమండ్రి వెళ్లాడేమో అని వుంది.

తరవాత రెండు రోజులు ఖాళీ. మూడో రోజున శివరావు ఎక్కడికో వెళ్ళిపోయినట్టున్నాడు. వకుళ చాలా

విచారంగా వున్నట్లు కనిపిస్తోంది. వకుళ ముఖం వాడిపోతే చూడటానికి చాలా బాధనిపిస్తుంది అని రాసుకున్నాడు రమేష్...

మరోచోట 'ఈ రోజు వకుళ డిటెక్టివ్ కిరణ్ గార్ని కల్సుకుని మాట్లాడింది. శివరావు గురించి వెతికి పెట్టమని వుంటుంది. కిరణ్ గారికి అప్పచెపితే యిక ధైర్యంగా వుండొచ్చు. శివరావు యెక్కడికి వెళ్ళిపోయాడో మరి?' అని వుంది.

తర్వాత రెండురోజులు ఏం రాయలేదు. తర్వాతి పేజీలో ఉత్త నంబర్లు వేసివున్నాయి—3,1. 3,5,18,1 అని ఆరు నెంబర్లున్నాయి, అంతే! వాటికేసి దీర్ఘంగా చూశాడు కిరణ్. కాని అవి అంతుబట్టలేదు.

పక్కన ఏదో సవ్వడి అవటంతో చటుక్కున తల తిప్పాడు కిరణ్. కాని అప్పటికే ఆలస్యమయింది.

కిరణ్ తలమీద వెయ్యి సమ్మెట్లతో మోదినట్లయి ఓ క్షణం ముందుకు తూలబోయి ఆగాడు. కాని అంతలోనే కుప్పలా కూలి పడిపోయాడు.

అదే సమయంలో స్టుడియో బయట పోలీస్ జీప్ ఆగటం, అందులోనించి శ్రీనివాస్ ఆత్రుతగా దిగటం గుర్తు తెలీదు. అప్పటికే అతనికి స్పృహతప్పిపోయింది.

# 8

కిరణ్ భారంగా కళ్ళు తెరిచాడు.

ఎదురుగా ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్, లాయర్ బిందు, డాక్టర్లు, సార్జంట్లు, కానిస్టేబుల్స్ వున్నారు.

శ్రీనివాస్ మందహాసం చేశాడు.

బిందు ముఖం ఆనందంతో విప్పారింది.

కిరణ్ పైకి లేవబోయాడు. తలంతా దిమ్ముగా వుంది.

తల తడుముకున్నాడు. బాండేజి వుంది.

"పెద్ద దెబ్బ కాదులెండి. కొంచెం చిట్లింది. గత రాత్రి తో స్పృహ రాలేదు మీకు. ఇప్పుడు ఉదయం పది గంటలు కావస్తోంది. దాదాపు యిరవై గంటలు స్పృహ లేకుండా వున్నారు" అన్నాడు డాక్టరు.

"నువ్వు యెంత సేపటికీ రాకపోవటంతో వకుళా స్టుడియోకి వచ్చాను. అప్పటికే యెవరో గుర్తు తెలీని వ్యక్తులు ముగ్గురు స్టుడియో బయటికొచ్చి మోటర్ బైక్ ఎక్కి వెళ్ళిపోతున్నారు. లోపలికి వచ్చి చూసేసరికి పార్టిషన్ పక్కన నువ్వు పడిపోయి వున్నావు" అన్నాడు శ్రీనివాస్.

"వాళ్ళే వాంతకుడి మనుషులు! నన్ను నెత్తిమీద కొట్టి రమేష్—అదే స్టుడియో వర్రాడు, హాతుడు డైరీ పట్టుకుని పారిపోయారు."

"అందులో ముఖ్యమైన సమాచారమేదైనా వుందా?"

"ఆఁ! ఓ విధంగా ముఖ్యమైనదే వుంది" అన్నాడు కిరణ్, తను చివరిగా చూసిన నంబర్లు గుర్తు తెచ్చుకుంటూ. ఓసారి మననం చేసుకున్నాడు. రమేష్ ఆ నంబర్లు వూరికినే వేసివుండడు. దాని వెనుక ఏదో అంత రార్థం వుండివుండాలి. అదే అందటంలేదు!

"మాయమైన శవాల ఆచోకీ ఏమైనా తెలిసిందా?" కిరణ్ అడిగాడు శ్రీనివాస్‌ని.

"లేదు బ్రదర్! ఇక నువ్వే వచ్చి ఆ పని పూర్తి చేస్తావని యెదురుచూస్తున్నాం" అన్నాడు శ్రీనివాస్.

"ఓ.కే! ఇప్పుడే బయల్దేరి వెళ్దాం! ముఖ్యమైన వ్యక్తిని కలుసుకోవాలని చెప్పానుకదా, అతన్ని వెంటనే కలవాల్సి వుంది....ఆఁ, వకుళ స్టుడియోని సీల్ చేయించావా?"

అడిగాడు కిరణ్.

"ఆఁ! నిన్ను హాస్పిటల్‌కి చేర్చేముందు సీలువేసి మరీ కదిలాం అక్కడినుంచి!"

"గుడ్! అవసరమైతే ఓసారి మళ్ళీ వెరిఫైచేద్దాం. రమేష్ యిల్లెక్కడో తెలుసా?"

"ఆఁ! స్వంత యిల్లంటూ ఏదీ లేదు. అతనికి వెనకా ముందు యెవరూ లేరు. ఓ రూం తీసుకుని వుంటున్నాడు రవీంద్ర నగర్‌లో. గది వెతికించాను. అనుమానాస్పదమైన ఆధారాలేం దొరకలేదు."

"గుడ్, కాని అతని గది నువ్వు సోదా చేసేసరికి మామూలుగానే వుందా, యెవరైనా యిదివరకే సోదా చేసినట్టుందా?"

"కరెక్టు! ఇదివరకే యెవరో గదంతా వెతికారు దేని కోసమో. వస్తువులన్నీ చిందరవందరగా పడున్నాయి."

కిరణ్ సాలోచనగా తలూపాడు. హంతకుడి ప్రయత్నం ఫలించలేదు. నెగిటివ్ అతని చేతికి చిక్కలేదని అర్థమయిపోయిందతనికి. రమేష్ తెలివైనవాడు. నెగటివ్స్ విషయంలో జాగ్రత్తపడ్డాడు. కాని ఇప్పుడు బతికిలేడు. అవి యెక్కడ దాచాడో తెలిసే అవకాశం కాస్తా పోయింది. రమేష్ ఒక్కడికే హంతకుల విషయం తెలుసు!

కిరణ్ లేచాడు.

డాక్టర్ వారించి, ఈ రోజు పూర్తిగా విశ్రాంతి తీసుకోండి!" అన్నాడు.

కిరణ్ ఆయనకి నమస్కరించి, "విశ్రాంతి తీసుకునే టైం లేదు సర్. అవతల చాలా ముఖ్యమైన పనులకు హాజరు కావల్సి వుంది నేను" అన్నాడు.

డాక్టర్ కాదనలేకపోయాడు.

హాస్పిటల్ నించి వకుళకి ఫోన్ చేశాడు కిరణ్. ఆమె అందుకుంది.

"నేనమ్మా, కిరణ్ మాట్లాడుతున్నాను. మీ నాన్న గారింట్లో వున్నారా?"

"లేరండి. మిల్లుకి వెళ్ళిపోయి గంట దాటింది."

"మీరింటి దగ్గరే వుండండి. ఓ ముఖ్యమైన విషయం మీతో మాట్లాడవలసి వుంది."

వారి విషయం ఏమైనా తెలిసిందాండి?"

"అన్నీ మీ యింటివద్ద మాట్లాడుదాం" అంటూ ఫోన్ పెట్టేశాడు కిరణ్. శ్రీనివాస్ వంక తిరిగి, "నా కారు నిన్న స్పాట్‌లో వదిలేశాను, ఏమయింది?" అనడిగాడు.

"మీ గరాజ్‌లో పెట్టించాను. నీ పాకెట్లో యిగ్నిషన్ కీ తీసుకున్నాం" అన్నాడు శ్రీనివాస్.

వకుళ గుమ్మంలోనే స్వాగతం చెప్పింది.

ఇద్దరు ఆమె చూపించిన కుర్చీల్లో కూచున్నారు.

కిరణ్ ఉపోద్ఘాతం లేకుండా, "రమేష్ నెవరో హత్య చేశారు!" అన్నాడు ఆమె ముఖకవళికలు గమనిస్తూ.

ఆమె ముఖంలో ఆశ్చర్యం కనిపించింది. "రమేష్ యెవరు?" అన్నది.

"అదే మెయిన్ రోడ్‌లో వకుళా స్టుడియో పెట్టుకున్నాడే—ఆ రమేష్."

వకుళ ముఖంలో ఏదో మెరుపు కనిపించింది. తర్వాత మామూలుగా అయిపోయింది."

"అతను మీకు తెలుసా?"

"తెలుసు. నాతో కలిసి చదువుకున్నాడు."

"మీరు మరోలా అనుకోకుంటే — మీరతనికి కాస్త దగ్గరగా వచ్చారనుకుంటాను చదువుకునే రోజుల్లో!" అన్నాడు కిరణ్ మెల్లగా.

వకుళ రెండు క్షణాలు మాట్లాడలేదు.

"నేను అతనికి దగ్గరగా వెళ్ళలేదు — అతనే నాకు దగ్గర కావాలని చాలా ప్రయత్నించాడు. నాకెందుకో అతనిపట్ల ఆసక్తిలేదు. అతను మాత్రం నన్నో దేవతలా ఆరాధించేవాడు. ఓసారి తన యిష్టాన్ని వెల్లడిస్తే ఫ్రాంక్‌గా చెప్పేశాను — అలాంటి పిచ్చి ఆశలు పెట్టుకోవద్దని!"

"ఆ తర్వాత మీమీద కక్ష సాధింపు ధోరణిలో ఏమైనా ప్రయత్నించాడా? మిమ్మల్ని అల్లరి చెయ్యాలని గాని, మీమీద స్కాండల్స్ ప్రచారం చెయ్యాలని గాని...."

"అహా, అదేంలేదు. నేను నా నిర్ణయం ముఖంమీద తేల్చి చెప్పగానే అఫెండయ్యాడు. మానసికంగా బాగా క్రుంగిపోయినట్టు కనిపించాడు. ఆ తర్వాత నాతో ఎన్నడూ అలాంటి ప్రసక్తి తేలేదు. చాలా మర్యాదగా ప్రవర్తించేవాడు. ఓసారి నన్ను అల్లరిపిల్లలు చుట్టుముడితే వాళ్ళబారినుండి నన్ను రక్షించటానికి బాగా దెబ్బలు తిన్నాడు కూడా. నేనంటే అంత ఆరాధన!"

"ఆ విషయం అతను తన ఫోటో స్టుడియోకి మీ పేరు పెట్టుకోవటంవల్ల అర్థం చేసుకున్నాం. ఆ తర్వాత, అంటే మీ పెళ్ళయ్యాక అతను మిమ్మల్ని కలవాలని ప్రయత్నించటం, మాట్లాడాలనుకోవటం వంటిదేమైనా చేశాడా?"

"మా పెళ్ళి ఫోటోలు అతనే స్వయంగా కలర్‌లో

తీశాడు. అవన్నీ ఆల్బంలో అతికించి నెగటివ్ లతోపాటు నాకు పెళ్ళి కానుక అంటూ ప్రజెంట్ చేశాడు. ఆ తర్వాత ఎప్పుడైనా మా యింటిమీదుగా వెళ్తుండే వాడుగాని నన్నెప్పుడూ పలకరించాలనిగాని, నావైపు పరీక్షగా చూడాలనిగాని ప్రయత్నించేవాడు కాదు."

"మొదట్నుంచీ రమేష్‌ది యీ వూరేనా?"

"అవునండి. ఇక్కడే చదువుకున్నాడు. ఉద్యోగ ప్రయత్నాలు చేసి కలిసిరాక ఫోటో స్టుడియో పెట్టుకున్నట్టు, మా ఫోటోలు ఇచ్చే సమయంలో చెప్పాడు."

శ్రీనివాస్, కిరణ్ లేస్తుండగా వకుళ కిరణ్ నుద్దేశించి, "మా వారు క్షేమమే కదండీ! నాకెందుకో భయంగా వుంది" అన్నది బేలగా చూస్తూ.

"ఏం ఫరవాలేదమ్మా, ఆయన క్షేమంగానే వున్నారని నిశ్చయంగా చెప్పగలను. త్వరలోనే మిమ్మల్ని కలిపే ప్రయత్నంలో వున్నాను" అన్నాడు కిరణ్ ధైర్యం చెపుతూ.

"రమేష్ నెవరు చంపారండీ?" మళ్ళీ అడిగింది.

"అదింకా తెలియలేదు. పాపం నిర్దాక్షిణ్యంగా చంపేశారు. ఆ హంతకుల్ని అంత తేలిగ్గా వదలను" అన్నాడు కిరణ్. అతని దవడ కండరాలు బిగుసుకున్నాయి.

వకుళ అప్పుడే కిరణ్‌ని గమనించినట్టు, "మీ తలపైన ఏదో కాటన్ ప్యాచ్ కనిపిస్తోంది. ఏదైనా గాయమయిందాండీ?" అనడిగింది.

కిరణ్ బాండేజి క్లాత్ విప్పేసి కాటన్ ప్యాచ్ మాత్రమే గాయంమీద వుండనిచ్చాడు. ఆ ప్యాచ్ వకుళ దృష్టిలో పడింది.

"ఏదో చిన్న గాయం, ఫరవాలేదులెండి, ఏం కాదు" అంటూ జీవ్ దగ్గరికి నడిచాడు. శ్రీనివాస్ డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

శ్రీనివాస్ జీవ్ స్టార్టు చెయ్యబోతుండగా చటుక్కున వారించాడు కిరణ్.

ఇగ్నిషన్ కీ తీసేసి కిందికి దిగాడు కిరణ్. శ్రీనివాస్ ఆశ్చర్యంగా అతనివంకే చూస్తున్నాడు.

కిరణ్ ముందువైపుకి వెళ్ళి బోనెట్ ఎత్తి లోపలి నుండి ఎలక్ట్రిక్ ట్రాన్స్‌ఫార్మర్ పరమాణంలో వున్న ఓ వస్తువును పైకి తీశాడు. దాని చివర వైర్లున్నాయి. ఆ వైరు డాష్‌బోర్డువున్న వైర్లతో కనెక్టు చేయబడి వున్నాయి.

శ్రీనివాస్ కళ్ళప్పగించి చూస్తున్నాడు. "ఏమిటిది?" అన్నాడు,

"హ్యాండ్ బాంబ్. జీవ్ స్టార్టుచేసిన వెంటనే పేలేలాగా అమర్చారు. మనం వరుళతో మాట్లాడుతుండగా గుండగులు చేసిన పని యిది! ఈసరికి మనిద్దరం పరలోకంలో వుండేవాళ్ళం!" అన్నాడు కిరణ్.

"బోనెట్‌లో బాంబ్ వున్నట్టు ఎలా గ్రహించావు?"

"ఇవిగో, వీటినిబట్టి" అన్నాడు కిరణ్ వైరు పైనుండే యిగుళ్ళేబెడ్ కవరింగ్‌ని చూపిస్తూ "వైరు అతకటానికి లోపల రాగివైరు పైనుండే యిన్సులేషన్ కత్తిరించి బోనెట్ మీద పడేశారు. సీట్లో కూచోగానే ఫ్రంట్ మిర్రర్‌లోంచి బోనెట్ మీదున్న యీ కవరింగ్ పీసెస్ కనిపించాయి. అవి అక్కడ ఎందుకుండాల్సి వచ్చింది? వెంటనే తట్టింది—మనం లేనప్పుడు బోనెట్ లోపల ఏదో రిపేర్ జరిగుండవచ్చని! నా అనుమానమే నిజ

మయింది."

శ్రీనివాస్ అభినందన పూర్వకంగా కిరణ్ వంక చూసి, "యూ ఆర్ గ్రేట్! హేట్సాఫ్ బ్రదర్!" అన్నాడు.

"థాంక్స్‌లు తర్వాత. ముందు జీప్‌ని పద్మా పవర్ లూమ్స్‌వైపు పోనియ్యి. అక్కడికి దగ్గర్లో మల్లేశం అనబడే మరోకాయన పవర్ లూమ్స్ నడుపుతున్నాడు—'లక్ష్మీ పవర్ లూమ్స్' అక్కడికి పోనియ్యి-కమర్షియల్ రోడ్డు" అన్నాడు కిరణ్.

సరిగ్గా పదినిమిషాల్లో జీప్ కమర్షియల్ రోడ్డులో వున్న 'లక్ష్మీ పవర్ లూమ్' ముందాగింది.

పోలీస్ జీప్ చూసి ఫ్రంట్ రూంలో వున్న ఓ నడి వయసాయన లేచి నిలబడ్డాడు.

ఇద్దరు లోనికి ప్రవేశించగానే మర్యాదగా ఆహ్వానించాడు.

"మీరేనా ప్రొప్రయిటర్?" అడిగాడు కిరణ్.

"అవును సార్. నా పేరు మల్లేశం" అన్నాడతను.

"మీనుంచి కొన్ని వివరాలు కావాలి."

"అడగండి."

"మీరు ఎన్నాళ్ళుగా నడుపుతున్నారీ మిల్లు?"

"దాదాపు యిరవై ఏళ్ళనుండీ."

"ఎంతమంది పని చేస్తున్నారు?"

"అరవై ఎనిమిదిమంది."

"మీకు కాంపిటిటర్స్ యెవరైనా వున్నారా?"

"నాదికాక మరో పవర్ లూమ్స్ మాత్రమే వున్నదండి యీ సిటీలో. అదీ యిదే రోడ్డున వుంది—పద్మా పవర్ లూమ్స్."

"మీ యిద్దర్లో ఎవరి టర్న్ ఓవర్ అవుట్‌లో వుంది?"

"ఒకప్పుడు నాదే బావుండేదండి! కాని ముఖ్యమైన నలుగురు లీవర్సుని పద్మా పవర్ లూమ్స్ జనార్ధనం ఎక్కువ ఆశ చూపి తనవైపు లాగేసుకున్నాడు. అయినా ప్రొడక్టివిటీ నాదే ఎక్కువ వుండేది. కాని జనార్ధనం నన్ను పడగొట్టాలని నష్టానికి నడుపుతున్నాడు—రేట్లు బాగా తగ్గింది."

"అలాగా! కాని మార్కెట్ బావుండటమేగాక, చాలా లాభాలు సంపాదించాడని విన్నాం. అతని విషయంలో మాకు చాలా రిపోర్టులు వచ్చాయి" అన్నాడు శ్రీనివాస్.

మల్లేశం విజృంభించాడు. "అవును సార్! అదంతా మిల్ మీద ఆర్జించినదైతే కదా! అంతా అక్రమంగా సంపాదించిందే!"

"అంటే...."

మల్లేశం రెండు క్షణాలు తటపటాయించాడు.

"ఫరవాలేదు చెప్పండి—మాకు తెలుసులెండి. సాటి వ్యాపారస్తులు కాబట్టి మీకైతే వివరంగా తెలుస్తుందని అడుగుతున్నాం" అన్నాడు కిరణ్.

మల్లేశం గొంతు బాగా తగ్గించి, "కొరియానుంచి స్మగుల్డు పాంట్, షర్టు బిట్స్ తెప్పిస్తాడు. వాటిని తన మిల్లులో తయారైన బట్టలమధ్య పెట్టి దేశంలోని అన్ని ప్రాంతాలకి పంపించి అమ్మిస్తాడు. ముఖ్యంగా యీ బిజినెస్ కోసం కొంతమందిని తనకు నమ్మకస్తులైన వాళ్ళని తన చేతికింద వుంచుకున్నాడు."

"వాళ్ళెవరో మీకు తెలుసా? వచ్చిన బిట్స్ ఎక్కడ స్టోర్ చేస్తాడో ఆ వివరాలు చెప్పగలరా?"

మల్లేశం తడబడి, "అది చాలా రహస్యంగా జరుగు

తున్నది సార్! యెవరికీ తెలియనివ్వడు జనార్ధనం!" అన్నాడు.

శ్రీనివాస్ మల్లేశం కళ్ళలోకి చూస్తూ, "ఇప్పుడు మీరు చెప్పిన విషయాలు నిజమేనా? లేక అనూయతో లేనిపోనివి జనార్ధనంమీద కల్పించి చెప్తున్నారా?" అనడిగాడు.

"నూటికి నూరుపాళ్ళు నిజం బాబూ! మీతో అబద్ధం చెపుతానా?" అన్నాడు మల్లేశం.

"మీరు చెప్పిన విషయాలు నిజంకాదని రుజువైతే మీమీద తీవ్రమైన చర్య తీసుకుంటాను" అన్నాడు శ్రీనివాస్ అధికార స్వరంలో.

మల్లేశం తలూపాడు.

ఇద్దరు బయటికొచ్చేక ఓ వర్కర్‌ని పక్కకు పిలిచాడు కిరణ్. అతను అప్పుడే మిల్లు లోపలికి వస్తున్నాడు.

కిరణ్ అతన్ని చూసి, "బాబూ, ఇక్కడ జనార్ధనం మిల్లు ఎక్కడ?" అనడిగాడు.

ఆ వర్కరు వెంటనే వేలుపెట్టి దూరంగా చూపిస్తూ, "అదిగో ఆ కనబడే ఆస్‌బెస్టాస్ రేకుల షెడ్ పక్కనే వుంది సార్!" అన్నాడు.

కిరణ్ గొంతు తగ్గించి, "మాకు కొరియా బట్టలు కావాలి, అక్కడ దొరుకుతాయా?" అనడిగాడు.

ఆ వర్కరు తల అడ్డంగా తిప్పి, "నాకు తెలియదు సార్!" అన్నాడు.

"సరే, నువ్వు వెళ్ళు బాబూ! మేం చూసుకుంటాంలే!" అన్నాడు కిరణ్.

వర్కర్ మిల్లులోకి వెళ్ళిపోయాడు.

"నీ ఖాకీ బట్టలు చూసి ఎవరూ నిజం చెప్పటానికి

భయపడుతున్నారు. అందుకే మీ డిపార్టుమెంటు తెలుసుకోలేని ఎన్నో విషయాలు మేము తేలిగ్గా సేకరించగలం" అన్నాడు కిరణ్ శ్రీనివాస్‌తో జీప్ దగ్గరికి నడుస్తూ.

శ్రీనివాస్ కన్విన్సింగ్‌గా తలూపాడు.

"ఇప్పుడు జనార్దనం పవర్‌లూమ్స్‌లోకి వెళ్దామా?" అనడిగాడు శ్రీనివాస్.

"వద్దు. అందునా మనిద్దరం వెళ్తే కథ అడ్డం తిరుగుతుంది. కేవలం మల్లేశం మాటలమీద ఆధారపడి జనార్దనంమీద దాడిచెయ్యటం మంచిపనికాదు. అందుకు మీ సార్జెంట్ శివాన్ని నియోగిద్దాం. ఏం చెయ్యాల్సిందీ అతనికి చెబుతాను. సరాసరి స్టేషన్‌కి పోనియ్యి" అన్నాడు కిరణ్.

## 9

"మీకోసం, ఓ గంటనుండి యెదురు చూస్తున్నారు సార్ వీళ్ళు. పేపర్లో మన ప్రకటన చూసి శవాన్ని ఐడెంటిఫై చెయ్యటానికి వచ్చారట" అన్నాడు సార్జెంట్ శివం.

శ్రీనివాస్, కిరణ్ స్టేషన్ రూంలో కూచుని వున్న ఆ వ్యక్తులవంక పరీక్షగా చూశారు. కొంత బీదకుటుంబాల్లోనించి వచ్చినట్టు కనిపిస్తున్నారు. దుఃఖంతో పాలిపోయిన ముఖాలు. ఓ ముసలి దంపతులు ఓచోట, ఓ యిరవయ్యేళ్ళ యువతి, మరోపక్క కూచునివున్నారు. యువతి కళ్ళు ఏడ్చినట్టు ఉబ్బి వున్నాయి.

కిరణ్ వాళ్ళవంక చూసి, "ఏం పనిమీద వచ్చారు?" అనడిగాడు, ముసలి దంపతుల్ని.

"పేపర్‌లో ఏదో ప్రకటనిచ్చారంటగద బాబూ అది

ఊరొసి వచ్చాం. మా బిడ్డ వారం-పదిరోజుల్నించీ కన పడ్డంలేదు బాబూ! పేపరులో రాసిన వోర్తలో ఏవో పోలికలు గురించి రాసారంట. మా అబ్బాయి దాదాపు అట్టాగే వుంటాడు" అన్నాడు ముసలతను.

శ్రీనివాస్ వంక సాభిప్రాయంగా చూశాడు కిరణ్.

సార్జెంట్ శవం వాళ్ళముందుకు వచ్చి "ఓ శవం తాలూకు ఐడెంటిఫికేషన్స్ వీళ్ళు చెప్పిన పోలికలకు సరిపోయాయి సార్! నేను ఆ విషయం వాళ్ళకింకా చెప్పలేదు. రెండో శవం పోలికలు, ఆ యువతి చెప్పిన ఐడెంటిఫికేషన్ మార్క్సుతో సరిపోయాయి. ఆ యువతి చెప్పిన గుర్తులో కుడిచేతిమీద ఉలిపిరికాయవున్న సంగతి చెప్పింది" అన్నాడు. వాళ్ళిద్దరికి మాత్రమే వినిపించే లాగా.

కిరణ్ ముసలివాళ్ళని సమీపించి "మీ అబ్బాయి ఏం చేస్తుంటాడు?" అనడిగాడు.

"ఈ ఊళ్ళోనే మరమగ్గాల మిల్లులో పనిచేస్తాడు బాబూ!"

"ఎవరి మిల్లులో?"

"జెనారదనంగారి మిల్లు."

"ఏం పని చేస్తారు? అతని పేరేమిటి?"

"మగ్గంమీద పనిజేత్తాడు బాబూ, నేతపనే! పేరు సింహాద్రి."

ఆ యువతి కూడా అదే యిన్ఫర్మేషన్ యిచ్చింది. ఆమె భర్త పేరు నరహరి అని చెప్పింది.

"వీళ్ళకేం సమాధానం చెప్పాలిప్పుడు?" అన్నాడు శ్రీనివాస్ నిస్పృహోయంగా చూస్తూ.

"ప్రస్తుతానికి అబద్ధం చెప్పి పంపక తప్పదు. మీరు

చెప్పిన పోలికలుతో ఆ శవాల గుర్తులు సరిపోవటం లేదు. ఆ గుర్తులుగల శవాల్ని నిన్ననే వాళ్ళ తాలూకు బంధువులు తీసుకుపోయారని చెప్పు. శవాలు దొరికితే మనమే వాళ్ళకి కబురుచేసి వాటిని స్వాధీనంచేద్దాం. అయినా యిప్పటివరకు ఆ శవాలు కుళ్ళిపోకుండా వుంటాయా? అలాంటివి వాళ్ళకి అప్పగించేబదులు తమ బిడ్డలు ఎటో వెళ్ళిపోయారనే భ్రాంతిలో వాళ్ళ నుంచడమే మంచిది" అన్నాడు కిరణ్.

"కాని యిద్దరు విషయంలో కూడా వాళ్ళు మిల్లుకి డ్యూటీమీద వెళ్ళాకే కనిపించకుండా పోయారట. మిల్లుకుపోయి కనుక్కుంటే వాళ్ళిద్దరు అందరితో కలిసి మిల్లు మూసేశాక ఆ సాయంత్రం వెళ్ళిపోయారని చెప్పారట" అన్నాడు శ్రీనివాస్.

"మనకి కావలసిన యిన్ఫర్మేషనొచ్చింది. మాయమైన రెండు శవాలు వీళ్ళ తాలూకువేనన్న విషయం కన్ఫర్మ్ అయింది. ఇక శివం చెయ్యాల్సిన పని మిగిలివుంది" అని శివాన్ని పిలిచి ఏం చెయ్యాల్సిందీ చెప్పాడు కిరణ్. "వెళ్ళేటప్పుడు రహస్యంగా ఓ మినీ కెమెరా నీతో తీసుకుపో, అవసరమైన యిన్ఫర్మేషన్ దొరికితే వెంటనే ఫోటోలు తియ్యి.." అంటున్న కిరణ్ మెదడు మెరుపులు మెరిశాయి.

ఓ కాగితంమీద చకచక యింగ్లీషు అక్షరమాల (ఆల్ఫబెట్) 'ఎ' నుండి 'జడ్' వరకు రాశాడు. అక్షరాల కింద 'ఎ'కు 'బి'కు 2 అంటూ వరసగా 26 అంకెలు వేశాడు.

తన మెదడులో రికార్డు చేసుకున్న నెంబరు కాగితం మీద రాశాడు—3,1,13,5,18,1.

అవి అక్షరములలోని యింగ్లీషు అక్షరాలను సి, ఎ, ఎం, ఇ, ఆర్, ఎ—లను సూచించాయి. కలుపుకుంటే పదం 'కెమెరా'.

అంకెలకు ముందున్న (—) మైనస్ మార్క్ కి, నెగటివ్ అనే అర్థంకింద సింబల్ గా వేస్తారు. అంటే నెగటివ్ కెమెరాలో వుంది.

కిరణ్ కి సమస్య విడిపోయింది. తనకు రమేష్ పంపించిన ప్రింటుల తాలూకు నెగటివ్ ఫిల్మ్ ని జాగ్రత్తగా కెమెరాలో దాచివుంచాడు రమేష్. రాబోయే ఆపద ముందుగానే గ్రహించి తెలివిగా వ్యవహరించాడు. రమేష్ ముందు చూపుకి మనసులోనే జోహార్లర్పించాడు.

“కమాన్ శ్రీనివాస్. కమలా ఫోటో స్టుడియోకెళ్ళి రావాలి” అన్నాడు కిరణ్ చెపుతూనే. చకచక జీప్ వైపు పరుగులాంటి నడకతో.

పదినిమిషాల్లో మెయిన్ రోడ్ లోని కమలా స్టుడియో దగ్గర ఆగింది జీప్. 'సీల్' తెరిచి తాళం తీశాడు శ్రీనివాస్.

కిరణ్ రెండంగల్లో కెమెరా స్టాండువైపు పరుగెత్తి కెమెరా విప్పి లోపలినుండి రెండు ఫిల్మ్ నెగటివ్ లను బయటకు తీశాడు. డార్క్ రూంలోకిపోయి 'హైపో' సొల్యూషన్ తయారుచేసి ఓ పావుగంట తర్వాత రెండు ప్రింటులతో బయటికొచ్చాడు.

శ్రీనివాస్, కిరణ్ అవి చూస్తూనే ఆశ్చర్యంలో కొయ్యబారిపోయారు. ఓ ఫోటోలో దూరంగా సముద్రం బాక్ గ్రౌండ్ కనిపిస్తోంది. దగ్గర్లో ఓ మెటడార్ వేన్ దానిలోనికి లోడ్ అవుతున్న పార్శిల్సు కనిపిస్తున్నాయి. వేన్ డ్రయివింగ్ సీట్లో జనార్థనం కూచుని వున్నాడు.

రెండో ఫోటోలో అదే మెటడార్ వేన్‌నించి ఇద్దరు వ్యక్తులు రెండు శవాల్ని దించుతున్నారు. ఆ రెండూ శ్రీనివాస్ వెంటనే గుర్తుపట్టాడు.

"అవే, మాయమయిన శవాలు!" అన్నాడు.

ఈ ఫోటో బాక్‌గ్రౌండ్ చింతలతోపు.

"కమాన్ శ్రీ ని వా స్! ఈ ఆధారాలు చాలు జనార్ధనం హంతకుడని రుజువు చేయటానికి! ముందు సేషన్‌కి పద! ఈపాటికి సార్జెంట్ శివం ఏదయినా యిన్ఫర్మేషన్ తెచ్చి వుంటాడు. మనం తొందరపడితే శివరావు ఆచూకీ శాశ్వతంగా తెలియకుండాపోయే ప్రమాదముంది!" అన్నాడు కిరణ్.

"అయితే శవాన్ని అంత అజాగ్రత్తగా తోపులో పారేసిన హంతకుడు మళ్ళీ వాటిని మార్చ్యురీనుంచి మాయం చెయ్యవలసిన అవసరమేం వచ్చింది?" అడిగాడు శ్రీనివాస్.

"నీ పోలీసు బుద్ధి పోనిచ్చుకోవు, శవాల్ని చింతల తోపులో పాతేద్దామనుకుని వుంటారు. నువ్వు గమనించావో లేదో తోపులో ఓ పక్క రెండు గోతులు కనిపించాయి నాకు. జనార్ధనంతో ఓసారి వెళ్ళానులే. ఇంతలో యెవరో అక్కడికి రావటంవల్ల వాళ్ళ పనికి అంతరాయం కలిగివుంటుంది. బహుశా ఆ వచ్చినవాళ్ళు చింతచిగురుకోసే ఆడవాళ్ళయివుంటారు. దాంతో శవాల్ని అలా వదిలేసిపోక తప్పలేదు. అవి యెవరివో ఐడెంటిఫై కాకూడదని, మార్చ్యురీనుండి ఎత్తుకుపోయి వుంటారు."

"ఐతే....?"

"నీ అనుమానం తర్వాత. ఇప్పటికే మనచుట్టూ

జనార్ధనం మనుషులు నిఘావేసి తిరుగుతూనే వుండి వుంటారు. పద, సరాసరి స్టేషన్‌కి పోనియ్యి జీప్" అంటూనే పోయి జీప్‌లో కూచున్నాడు కిరణ్.

శ్రీనివాస్ తాళాలు వేసివచ్చి జీప్ స్టార్టుచేశాడు.

వాళ్ళు వెళ్ళిన సమయానికి సార్జెంట్ శివం వచ్చాడు.

"సార్, మీరు అడగమన్నట్టే జనార్ధనాన్ని కొరియా బట్ట వెయ్యిమీటర్లు కావాలన్నాను. చాలా రహస్యంగా అడిగాను. మొదట్లో ససేమిరా తన దగ్గర దొరకదని చెప్పాడు. చివరికి అతనికి తెలిసిన కొందరి మనుషుల పేర్లు చెప్పగానే నమ్మేశాడు. ఈ రాత్రికి రమ్మన్నాడు. పదకొండు దాటాక వాళ్ళ యింటికి రమ్మన్నాడు.

తర్వాత మెటడార్ వేన్ చక్రాల్ని ట్రేస్ చేసి తెచ్చాను. నంబరు ఎ. టి. వై. 3743. అతని మిల్లులో అండర్‌గ్రౌండ్ కూడా వున్నదని నా అనుమానం. హేండ్ స్టిక్‌తో తట్టి నడిచాను. నేను నిజంగా ముసలి వాడినేననుకున్నాడు నా వేషంచూసి! తట్టినపుడు ఓ చోట బోలుగా వున్న శబ్దం వచ్చింది. ఖచ్చితంగా నేల మాళిగే అది!" అన్నాడు శివం కిరణ్‌తో.

"బహుశా అందులోనే తన స్మగుల్డు క్లాత్ దాస్తుండి వుండాలి జనార్ధనం. మరి నిన్ను యింటికెందుకు రమ్మన్నాడో! అన్నాడు శ్రీనివాస్.

"మిల్లుకొస్తే తన రహస్య గోడౌన్ సంగతి తెలిసి పోతుందని యింటికి రమ్మన్నాడు. మధ్యస్తంగా మరో చోటేదైనా చెపితే సెక్యూరిటీ వుండదని యింటికి రమ్మన్నాడు. ఇంటి దగ్గర బహుశా తన మనుషుల్ని— అంటే తను ఆ పనికోసం ప్రత్యేకం నియమించుకున్న

వాళ్ళని—సాయంగా వుంచుకుంటాడు. అంత తెలివి తక్కువవాడు కాదు జనార్ధనం!"

"అయితే తరవాత ప్లాన్!...."

"ఈ రాత్రి శివాన్ని యిలాగే ముసలివేషంలో జనార్ధనం యింటికి పంపిద్దాం. అంతకుముందే మనం పద్మా పవర్ లూమ్స్ దగ్గర నిఘా వేద్దాం. క్లాత్ తీసుకు పోవటానికి జనార్ధనం తన మనుషులో అక్కడికి వస్తాడు. రెడ్ హేండెడ్ గా పట్టుకోవచ్చు" అన్నాడు కిరణ్.

# 10

కిరణ్ యింట్లో కిరణ్, శ్రీనివాస్, బిందు, శివరావు, వకుళ, సార్జెంట్ శివం కూచుని వున్నారు.

"మీవారిని మీకు క్షేమంగా అప్పచెప్పాను—కాక పోతే మీ నాన్నగారిని అప్పచెప్పలేకపోయాను" అన్నాడు కిరణ్ వకుళతో.

వకుళ చాలా సంతోషంగా వుంది. "నాన్న నన్ను ఎంతగానో ప్రేమించినమాట వాస్తవమే! కాని అలాంటి తండ్రి దేశద్రోహానికి పూనుకోవటంవల్ల నా దృష్టిలో చాలా దిగజారిపోయారు. అయినా మావారిముందు కన్న తండ్రి నాకు ఎక్కువ కాదు!" అన్నది భర్తవంక మెరిసే కళ్ళతో చూస్తూ.

శివరావు తన అనుభవం చెపుతూ, "వారంరోజుల పాటు నన్ను పాతాళంలో దాచేశాడు మీ నాన్న! అనుకోకుండా ఓరోజు మీ నాన్న రహస్యంగా దాచిన విదేశీ గుడ్డలు నాకంటబడ్డాయి. అప్పట్నించే నా ఒంటిమీద గొంగళిపురుగులు పాకుతున్నట్టనిపించింది. అలాంటి పాపిష్టి కూడు తింటూ మీ ఇంట్లో వుండ బుద్ధి కాలేదు. అందుకే నిన్ను తీసుకుని మా వూరు పోవాలని నిర్ణయించు

కున్నాను. మీ నాన్న అందుకు ఒప్పుకోలేదు.

ఖర్మచాలక ఆ రోజు మీ నాన్న చేసిన మరో ఘాతకం నా కళ్ళబడింది. అదే, సింహాద్రి, నరహరిలను దారుణంగా హత్యచేయుటం. సింహాద్రి, నరహరి, డేవిడ్, రషీద్, జాన్ — ఈ అయిదుగురు మీ నాన్న కుడి భుజాలుగా వ్యవహరించారు. స్మగుల్డు గుడ్డని లోడ్ చేసి తేవటం, దాన్ని గోడౌన్‌లో దాయటం, దాన్ని సరఫరా చేయటం—వీటిలో వీళ్ళ ముగ్గురికీ ప్రముఖ స్థానమున్నదని నాకు తర్వాత, నేను బంధింపబడ్డాక తెలిసింది.

అనుకోకుండా సింహాద్రి, నరహరి మీ నాన్నగారిని ఎదురుతిరగటంతో వాళ్ళిద్దర్నీ డేవిడ్, రషీద్, జాన్‌ల చేత చంపించి చింతలతోపులో కప్పిపెట్టమని ఆదేశాలిచ్చాడు. సరిగ్గా ఆ దృశ్యం నా కంటబడింది. అంతే, అల్లుడినని కూడా స్పేర్ చెయ్యకుండా శత్రువుని బంధించినట్టు ఆ పాతాళ గృహంలో పారేసి రెంకి కాసిని నీళ్ళు రొట్టెముక్కలు పడేసి నన్ను బతికుండగానే చంపేయాలని చూశాడు. ఇన్నాళ్ళకు బతికి బయట పడ్డాను కిరణ్ గారి దయవల్ల!" అన్నాడు.

శ్రీనివాస్ అందుకుని, "బ్రదర్, నీ వూహ కరెక్టే! ఆ రోజు చింతలతోపులో నరహరిని, సింహాద్రిని పూడ్చిపెట్టే సమయానికి చింతచిగురు ఏరుకునే ఆడవాళ్ళు రావటంతో డేవిడ్ అండ్ కో శవాల్ని వదిలేసి దూరంగా పోయి చూస్తున్నారట! ఆడవాళ్ళు కేకలు వేయటంతో యిక అక్కడ వుండకుండా పారిపోయారట.

ఇంతలో మేము రంగప్రవేశంచేసి శవాల్ని తీసుకుపోవటంవల్ల వాటిని మార్చ్యురీనుంచి ఎత్తుకుపోయారు. అందులో నరహరి చేతిని నరికి అది తన అల్లుడిదనీ

యెవరో బెదిరించి తనసుంచి డబ్బు వసూలు చేయ నున్నారని జనార్ధనం కథ అల్లి నీ దగ్గరకొచ్చాడు" అన్నాడు. "అయితే, రమేష్‌కి అతని రహస్య కార్య కలాపాలు ఎలా తెలిశాయి? ఆ ఫోటోలు ఎలా తియ్య గలిగాడు?" అన్నాడు.

కిరణ్ అందరివైపు చిరునవ్వుతో చూసి, "మీకు తెలియని మరో రహస్యం, రమేష్ నరహరికి చిన్నాన్న కొడుకనే విషయం! నరహరి తన భార్యవద్ద రహస్యాలు దాచేవాడు కాదు. ఆమె మాటల సందర్భంలో రమేష్ దగ్గర నోరు జారిపోయింది.

రమేష్‌కి వకుళంటే ఆరాధనేగాని, వకుళ తండ్రిపట్ల సదభిప్రాయంలేదు. వకుళ భర్త అంతర్ధానం వెనక జనార్ధనం చేయి వుందని అనుమానించాడు. అందుకే కీలకమైన సమయాల్లో తీసిన ఫోటోలు నాకు పంపించి తన కక్ష తీర్చుకోబోయాడు. కానీ జనార్ధనం పంపిన డేవిడ్ బృందం చేతిలో చనిపోయాడు." అన్నాడు.

—:ఐపోయింది:—

# మర మనుషులు

బి. రాజేశ్వరి

"ఇంకా ముందుకు వెళ్ళటం అనవసరమని నా అభిప్రాయం! మనం కోరి కొరివితో తల గోక్కుంటున్నామని అనుమానం" అన్నాడు వినాయక్.

"ఇదిగో వచ్చేశాం! ఉత్తరంలో సూచించిన ప్రదేశం యిదే! అదిగో ఏటవాలు కొండ. ఆ కొండ శిఖరం ఎక్కి అవతలివైపుకు దిగగానే మనం చేరాల్సిన గమ్యం వస్తుంది. ఇదిగో, ఈ కాగితంలో సూచించిన గుర్తులు, ఏరో మార్క్స్ చూడు!" అన్నాడు రవీంద్ర.

వినాయక్ ఓసారి కాగితంలోకి తొంగిచూసి, "బ్రదరూ! నేనిక ముందుకు రాలేను. ఈ కొండలు, గుట్టలు అసలే ఎక్కలేను. అర్భకుడ్ని నన్నొదిలెయ్!" అన్నాడు.

రవీంద్ర కోపంగా చూశాడు.

"మరీ అంత సీరియస్‌గా చూడకు, భస్మమైపోతాను. నువ్వు కూడా నా మాట విని వెనక్కి వచ్చేసెయ్యి.

ఎవడో ముక్కు మొహం తెలీనివాడి ఉత్తరం చూసుకుని యెవరికీ చెప్పాపెట్టకుండా మనం ఇలా రాళ్ళపాలు కావటం నాకిష్టంలేదు. అనక మనకి ఏదయినా జరిగితే ఇంటికి కబురుచెప్పే దిక్కు కూడా లేదిక్కడ. చూశావా, అంతా నిర్మానుష్యంగా, భయంకరంగా వుంది!" వినాయక్ చుట్టూ ఓసారి కలియజూసి, భయంగా రవీంద్ర వంక చూశాడు.

రవీంద్ర ముఖంలో దృఢనిశ్చయం, పట్టుదల, సాధించాలనే దీక్షా ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. వినాయక్ మాటలు అతనిలో యెలాంటి చలనమూ పుట్టించలేక పోయాయి.

కాగితంలోకి పరిశీలనగా చూశాడు. బాణం గుర్తు వేసినచోట కొండ ప్రాంతం గుర్తించబడివుంది. అక్కడ ఏటవాలుగా ఓ కొండ గుర్తించబడివుంది. కొండపైవరకు ఏవేవో పిచ్చిమొక్కలు అల్లుకు పోయినట్టు సూచించబడి వుంది.

"కొండ ఎక్కబోతున్నాను. ఇప్పుడే చెప్పెయ్యి నీ అభిప్రాయమేమిటో, సూటిగా!" అన్నాడు రవీంద్ర వినాయక్ ముఖంలోకి చూస్తూ గంభీరంగా.

"రవీ, నా మాట విను! ఇదేదో ప్రమాదకరమైన ప్రయత్నమని నాకనిపిస్తోంది. పోయి పోయి పులి నోట్లో తల దూర్చటంలాంటిది. అందుకే మన బలహీనత కని పెట్టి వాడెవడో మనల్ని ఆటపట్టించడానికి అలా రాశాడు. మనం అది సీరియస్‌గా తీసుకుని ఈ కొండలు గుట్టలుపట్టి పోతున్నాం. ప్లీజ్, వెనక్కిపోదాం పద!"

"వినాయక్, నేనడిగింది, నువ్వు కొండ ఎక్కుతావా, లేక దిగివెళ్ళిపోతావా—అని! వెంటనే సమాధానం చెప్పు"

అన్నాడు రవీంద్ర నిర్మొగమాటంగా.

వినాయక్ రెండు నిమిషాలు తటపటాయించాడు. "ముందుకు వెళ్ళటం ప్రమాదకరమని నా మనస్సాక్షి హెచ్చరిస్తోంది. దయచేసి నా మాట విను. అంతకీ నీకు ఈ కొండెక్కాలని సరదాగా వుంటే మన క్లాస్‌మేట్సు ఓ పదిమందిమి కలిసి ఎక్స్‌కర్షన్‌కి మళ్ళీ వద్దాం. అప్పుడు ఈ కొండెక్కటం థ్రిల్లింగ్‌గానూ వుంటుంది, నలుగురు వుంటే ధైర్యంగానూ వుంటుంది."

"ఓ. కే! నేను కొండ ఎక్కటానికే నిర్ణయించు కున్నాను. ఇదేదో తేల్చుకు నేవరకు వెనక్కు రాను. నువ్వు యిక వెళ్ళొచ్చు!"

"రవీ. అంతేనా? నా మాట వినవా?"

"ఈ విషయంలో నేనెవరిమాటా వినదలుచుకోలేదు. నా మాట మన్నించి ఇంతదూరం వచ్చినందుకు నీకు కృతజ్ఞతలు. నువ్వు వెనక్కి పోయిం తర్వాత ఈ సంగతి ఎక్కడా చెప్పకు—ముఖ్యంగా మా ఇంట్లో! సాయంత్రం చీకటిపడేలోపల నేను తిరిగొచ్చేస్తాను."

వినాయక్ ఇబ్బందిగా చూశాడు.

రవీంద్ర అదేం పట్టించుకోకుండా చకచక కొండ యెక్కేస్తున్నాడు. వినాయక్ వున్న చోటనే నిల్చుండి చూస్తున్నాడు. రవీంద్ర యెంతో అనుభవజ్ఞుడిలా కొండ యెక్కుతున్నాడు.

వినాయక్ వెనుతిరగబోయి ఆగాడు. రవీంద్ర కొండ సగం ఎక్కాక ఆయాసం తీర్చుకోవటానికికన్నట్టు ఆగాడు. అక్కడినుంచి మరీ ఏటవాలుగా వుంది కొండ. అక్కడినుంచి జారిపోతే....? అమ్మో, ఇంకేమైనా

వుందా? కింద అన్నీ లోయలు, పెద్ద పెద్ద బండరాళ్ళు వున్నాయి. ఈ రవీంద్ర చాలా మొండివాడు. తీరి కూర్చుని ప్రమాదాన్ని కొని తెచ్చుకుంటున్నాడు.

వినాయక్ ఆ రోజు సంఘటనని గుర్తుతెచ్చుకుంటున్నాడు.

ఉదయం పోస్టులో కాలేజి అడ్రసుకి రవీంద్ర పేర ఓ గమ్మత్తయిన ఉత్తరం వచ్చింది. అందులో రవీంద్రని ఉద్దేశించి, 'నీకో అద్భుతమైన, మరపురాని అనుభవం కావాలా? వెంటనే ఊరవతలి దేగల కొండకి వెళ్ళు. కొండ శిఖరం వరకు ప్రయాణంచేసి, అవలితట్టుకు దిగు! నీ వెన్నడూ ఊహించలేని గొప్ప అనుభూతిని పొందగలుగుతావు, ధైర్యముందా?' అని రాసివుంది.

అది రవీంద్ర తనని సవాల్ చేస్తున్నట్టు భావించుకున్నాడు. దానికింద దేగల కొండకిపోయే మార్గం, ఆ కొండ గుర్తులు బాణం గుర్తులువేసి చూపించబడ్డాయి.

రవీంద్ర తన దగ్గర ఏదీ దాచడు. వెంటనే ఉత్తరాన్ని తనకు చూపించాడు. అదేదో పిచ్చి ఉత్తరంలా కనిపించింది తనకు! ఎవడు రాశాడో వివరాలేం లేవు. ఊరికినే అద్భుతం, అనుభవం—అంటూ ఏదేదో రాసి రవీంద్ర బుర్ర పాడుచేశాడు వాడెవడో! అది పట్టుకుని రవీంద్ర ఊహల్లో తేలిపోతూ అప్పుడే మనోపథంలో దేగల కొండని దర్శించేస్తున్నాడు.

"ఇదెవడో, ఉబుసుపోకకు రాసినట్టుంది! దేగల కొండకి యెవరూ సాధారణంగా వెళ్ళరు. అది మనుషులు ఎక్కువగా తిరిగే ప్రాంతం కాదు. దాని గురించి రకరకాలుగా చెప్పుకుంటారు. వీడెవడో నిన్ను ఆటపట్టించటానికి రాసి వుంటాడు!"

"అయినా వెళ్దామా?" అన్నాడు రవీంద్ర ఉత్సాహంగా.

"నీకేమైనా మతిపోయిందా? కోరి ఆపదల్లో తల దూర్చటం దేనికి? ఆ రాసినవాడి పేరు, వూరు తెలీవు. వాడి ముఖ్యమైన ముఖం ఎరగం. అలాంటి అనామకు దెవడో రాసిన ఉత్తరాన్ని పట్టుకుని కొండలు, బండలు పట్టిపోవటం తెలివైన పనికాదు!"

"వాడెవడో మనకనవసరం, ఎందుకు రాశాడో, ఏమిటో చూడటానికైనా వెళ్ళివద్దాం. ఇప్పుడు పన్నెండు కావస్తోంది. సాయంత్రానికల్లా కాలేజి మూసే టైంకి మామూలుగా ఇంటికి తిరిగొచ్చెయ్యవచ్చు. ఏమంటావ్?"

"నన్నడిగితే లేనిపోని రిస్కు తీసుకోవటమంటాను."

"రిస్కు ఏముంది? సరదాగా ఓసారి పోయి చూసి వద్దాం. అసలు దేగల కొండంటే మనవాళ్ళందరు యెందుకు భయపడతారో చూద్దాం. దాని సంగతి తెలుసుకుని నలుగురికీ చెపుదాం. అసలు అక్కడ ఏముందో యెవరికీ తెలియదుకదా! అందరూ ఊహాగానాలు అల్లి ఏవేవో కథలు చెపుతారు. అదేమిటో తెలుసుకునే అవకాశం మనకొచ్చిందిప్పుడు. పోదామా?"

"నా మాట విను రవీ, ఈ ఉత్తరం యెవడు రాశాడో, ఏమి ఆశించి రాశాడో తెలీదు. నీకే ఎందుకు రాశాడో అంతకన్నా తెలీదు. మన ఫ్రెండ్స్ సర్కిల్ లోనో, శత్రుకూటంలో వాడో ప్రాక్టికల్ జోక్ గా రాసిందాన్నిబట్టి మనం ప్రొసీడ్ కావటం తెలివైన పని కాదు."

"మనకి శత్రువు లెవరున్నారు?"

"ఏం చెప్పగలం? మొన్న స్టూడెంట్సు యూనియన్ ఎలక్షన్సులో ప్రెసిడెంటు పదవికి నీతో పోటీచేసిన రఘు నీమీద కత్తిగట్టాడు. వాడో, వాడి అనుచరులో ఇలా రాసి వుండొచ్చు! లేదా మన ఫ్రండ్స్‌లోనో యెవడో నీ తత్వం తెలిసి నిన్నో ఆట ఆడించటానికి ఇలా రాసి వుండొచ్చు. అద్భుతాలన్నా, సాహసాలన్నా నీకు అలవిమాలిన సరదా అని తెలిసిన వాడెవడైనా రాసి వుండొచ్చు."

"ఏదిఏమయినా మనం ఈ రోజు పోయి చూద్దాం."

"నీకంతగా చూడాలని వుంటే ఏ ఆదివారమో పెట్టుకుందాం. మనమిద్దరమే కాకుండా మన ఫ్రెండ్సు మరో నలుగుర్ని వెంటబెట్టుకుని వెళ్దాం. అప్పుడయితే ధైర్యంగా వుంటుంది. థ్రిల్లింగ్‌గానూ వుంటుంది. అప్పుడే అనుభవాలు, అద్భుతాలు యెదురవుతాయో చూద్దాం."

"ఆదివారం ఇంకా అయిదు రోజులుంది. నో, మనం యిప్పుడే వెళ్ళాలి."

"సరే, ఓ కండిషన్!"

"ఏమిటి?"

"కొండ యెక్కేలోపల చీకటిపడిపోతే వెనక్కి వచ్చేద్దాం. అనుమానాస్పద పరిస్థితులు యెదురైతే ముందే వెనక్కి వచ్చేద్దాం."

"సరే, పద!"

వినాయక్ ఆలోచనల్నుంచి తేరుకుని కొండ ఎక్కుతున్న రవీంద్రని గమనించాడు. రవీంద్ర కాలుజారి కిందికి తూలబోయాడు. రెండడుగులు జారి అక్కడే వున్న ఏదో పిచ్చిమొక్కని పట్టుకుని ఆపుకున్నాడు. లేకుంటే జరజర కిందివరకూ జారిపోయేవాడే!

వినాయక్ గుండె ఓ క్షణం ఆగి కొట్టుకుంది. అక్కడి నుంచి కిందపడిపోతే....? మరోసారి అనుకున్నాడు.

"రవీ, కిందికి వచ్చెయ్యి!" అని కేకవేశాడు.

రవీంద్ర వినిపించుకున్నాడో లేదో తెలీదు. వెనక్కి కూడా చూడకుండా కొండ ఎక్కుతూనే వున్నాడు.

మరోసారి ఎలుగెత్తి పిలిచాడు వినాయక్. రవీంద్ర ఎటూ తల తిప్పకుండా దీక్షగా పైకే ఎక్కుతున్నాడు. అక్కడినుంచి మరీ నిట్టనిలువుగా వుంది కొండ. మోకాళ్ళ మీద అనుకుని చేతులు కొండమీదున్న బండలని, పిచ్చి మొక్కల్ని ఊతంగా తీసుకుని అలాగే మొండిగా ఎక్కుతూనే వున్నాడు రవీంద్ర.

వినాయక్ వాచీ చూసుకున్నాడు. సాయంత్రం నాలుగు గంటలవుతోంది. మరో గంటకో గంటన్నరకో చీకటి పడిపోతుంది. రవీంద్ర శిఖరాగ్రం చేరేసరికి చీకటి పడిపోతే, మళ్ళీ కిందికి ఎలా దిగగలడు?

చివరిసారిగా, మరోసారి, వెనక్కి రమ్మని అరిచి ఫలితం లేకపోవటంతో విధిలేక వెనుతిరిగాడు వినాయక్.

## 2

"మా బావగాని కనిపించాడా?" అనడిగాడు నాగు.

నాగు రవీంద్ర బావమరిది. మేనమామ కొడుకు.

వినాయక్ ఏం చెప్పాలో కొద్ది క్షణాలు తటపటాయించాడు. టైంచూడబోతే రాత్రి పదిగంటల సమయం.

"ఇంకా ఇంటికి రాలేదు. అక్క కనుక్కుని రమ్మంది" అన్నాడు నాగు.

అతని అక్క ఉజ్వల. కాబోయే రవీంద్ర భార్య. ఉమెన్స్ కాలేజిల్లో బిఎస్సీ ఫస్టియర్ చదువుతోంది. రవి ఫైనల్ బీకాం. ఈ వేసవిలో వాళ్ళిద్దరికీ

మహాహారాలు కూడా పెట్టుకున్నారు. రవీంద్ర మేన మామగారింట్లో వుండి చదువుకుంటున్నాడు.

వినాయక్ నిజం చెప్పటానికి సంకోచించాడు. తనేం చెప్పినా అది తనకే వ్యతిరేకంగా వుంటుంది. రవీంద్ర ఇంకా తిరిగి రాకపోవటంతో, అతను, తను దేగల కొండ వెళ్ళి తనొక్కడు వెనక్కి తిరిగిరావటంతో లేనిపోని అనుమానాలకు ఆస్కారం కల్పించిన వాడవుతాడు.

"కాలేజినుంచి ఇంకా రాలేదా, ఏదయినా సినిమాకు వెళ్ళాడేమో!"

"అక్కడు తప్పకుండా చెపుతాడు సినిమాకి వెళ్తే. కాని అలాంటిదేం చెప్పలేదు. మీకు తెలుస్తుంది, అడిగి రమ్మని పంపించి అక్క."

ఉజ్వలకి తెలుసు—తను రవీంద్రకి బాగా క్లోజ్ అని! ఆమెకు తప్పుడు సమాచారం అందించనూ లేడు. నిజమూ చెప్పలేడు. తనమీద తనకే జాలేసింది వినాయక్‌కు.

"నాకూ తెలీదు బాబూ!" అని చెప్పి నాగుని పంపించేశాడేగాని అతని అంతరాత్మ వినాయక్‌ని నిలవనీయటం లేదు.

రవీంద్ర ఏమయిపోయాడు? ఏదయినా ఆపదలవల యంలో చిక్కుకున్నాడా? కొండ దిగబోతూ జారి పడిపోలేదుకదా! తను నిజంగా మిత్ర ద్రోహి! రవీంద్రని అతని ఖర్మానికి వదిలేసి స్వార్థం చూసుకుని వెనక్కి వచ్చేశాడు. మరి కాసేపు నచ్చచెపితే రవీంద్ర తన ప్రయత్నం విరమించుకునేవాడేమో!

ఉదయంవరకు రవీంద్ర రాకపోతే....? ఉదయం యెలాంటి వార్త వినాల్సివస్తుందో! రవీంద్ర మీదే అన్ని ఆశలూ పెట్టుకున్న ఉజ్వల, ఆమె తల్లిదండ్రులు, రవి

తల్లిదండ్రులు—ఏమయిపోతారు?

ఛీ, తనెంత మూర్ఖంగా ప్రవర్తించాడు! తననే నమ్మిన ప్రాణస్నేహితుడి నట్టేట్లో వదిలి వచ్చేశాడు. తనేం చేసినా పాపంలేదు!

ఆ రాత్రంతా వినాయక్ కంటిమీద కునుకులేదు. పక్కమీద అసహనంగా పొర్లుతూనే వున్నాడు. క్షణ క్షణం పక్కమీద లేచి కూచుని మళ్ళీ కొద్ది నిమిషాల తర్వాత పడుకుని, అలా తెల్లవారేవరకు గడిపేశాడు.

ఉదయం లేస్తూనే దేగల కొండ దగ్గరకు సరాసరి వెళ్ళిపోయాడు వినాయక్. గతరోజు రవీంద్ర ఎక్కిన కొండ దగ్గరికి చేరుకున్నాడు. ఓసారి కొండదిగువ బండ రాళ్ళ దగ్గర లోయలోను పరిశీలనగా చూశాడు. పొర పాటున రవీంద్ర దొర్లి పడిపోయాడేమోనని అతని అనుమానం!

తరవాత నెమ్మదిగా కొండ యెక్కటం ప్రారం భించాడు. కాళ్ళు పట్టు చిక్కక జారిపోతున్నాయి. కాళ్ళకు చెప్పులుంటే లాభంలేదని, వాటిని తీసి పారే శాడు. ఇప్పుడు పట్టు దొరుకుతూంది. కాలు జారటం లేదు. కొద్దిమేర యెక్కేసరికి ఆయాసం వచ్చింది. కొండ నిట్టనిలువుగా వున్నట్టనిపించింది. నీరసంగా వున్నట్టు తోచింది.

ఒళ్ళు తూలినట్టనిపించింది. చటుక్కున పక్కనే ఒత్తుగా పెరిగిన దుబ్బు మొక్కని పట్టుకుని నిలదొక్కు కున్నాడు. చుట్టూ దట్టంగా పెరిగిన పిచ్చిమొక్కలు చిన్నా పెద్దా రాళ్ళు, రప్పలు, ముళ్ళపొదలు కూడా వున్నాయి. ఆ పొదలకి కాళ్ళు గీసుకుని రక్తం చిమ్మింది.

రవీంద్ర ఎలా ఎక్కగలిగాడో ఆ క్షణంలో అర్థం

కాలేదు వినాయక్‌కి. అలాగే మొండిగా ఎక్కసాగాడు. శిఖరాగ్రం చేరటానికి దాదాపు గంటపైగా పట్టింది.

శిఖరంమీదకు చేరి అవతలిపక్కకు అత్రంగా తొంగి చూసిన వినాయక్ ఆశ్చర్యానికి అంతులేదు!

ఇటుపక్కకు మల్లేనే ఆ పక్క కూడా కొండ ఏటవాలుగా నేలని తాకుతోంది. పిచ్చి మొక్కలు, రాళ్ళు, రప్పలు, పొదలు అన్నీ మామూలే! నేల తాకినచోట లోయ, పెద్ద పెద్ద బండరాళ్ళు అన్నీ వున్నాయి. లోయలోకి చూడటానికి కళ్ళు తిరిగాయి వినాయక్‌కి. తూలి పడబోయిన అనుభూతి.

నేలపైన ఎక్కడా ఎలాంటి సంచారమూ లేదు—మనుషులుగాని, జంతువులుగాని యెవరూ మసలుతున్న జాడలేదు. కనుచూపు మేరలో, అన్నీ కొండలే! చాట తీరి నున్నగా, నీలంగా వున్నట్టు కనిపిస్తున్నాయి. ఎక్కడా జనావాస ప్రాంతం కనపడటంలేదు.

వినాయక్‌కి ఎటూ పాలుపోలేదు. అసలు రవీంద్ర శిఖరాగ్రంనించి యీ పక్కకు దిగాడా? దిగితే, ఎక్కడికి వెళ్ళాడు.

వినాయక్ అటు పక్కకి దిగుదామా అనుకున్నాడు మొదట్లో. కాని ఆ పక్క ఆసక్తికరమైన అంశమేదీ కనిపించటంలేదు!

కొద్దిసేపు కర్తవ్యం తోచక అలాగే నిల్చుండిపోయాడు వినాయక్. అప్పటికి సూర్యుడు ఉదయించి చాలాసేపయింది. వెచ్చటి కిరణాలు అతనికి సూదుల్లా గుచ్చుకుంటున్నాయి. చెమట్లు పోసి వుక్కగా వున్న చల్లటిగాలి హాయిగొలుపుతోంది. తను సముద్ర మట్టానికి ఎంత ఎత్తులో నించునివున్నాడో ఆలోచిస్తున్నాడు

వినాయక్.

పది నిమిషాల తర్వాత కొండ దిగసాగాడు వినాయక్. ఎక్కినంత కష్టంగాలేదు దిగటం! ఓ అరగంట లోపలే దిగిపోయాడు.

ఓ పదినిమిషాలు అక్కడక్కడే తచ్చాడాడు. రవీంద్ర యేమయ్యాడు? గత సాయంత్రం కొండ దిగి వచ్చాడా? లేక దిగలేక యేమయినా అయ్యాడా? అతనికి ఎవరైనా కనిపించారా? ఏదైనా అనుభవం కలిగిందా? అయితే అదేమిటి? ఆ ఉత్తరంలోని విషయాలు నిజమేనా?

అన్నీ ప్రశ్నలే! జవాబులేని ప్రశ్నలు! జవాబు రాని ప్రశ్నలు!!

# 3

వినాయక్ యింటికి తిరిగొచ్చేసరికి, వాళ్ళింట్లోని వాళ్ళంతా ఒకరినొకరు వినాయక్ గురించి ఎంక్వయిరీ చేసుకుని ఎవరితోను యెక్కడికి వెళ్ళిందీ చెప్పలేదని తెలుసుకుని తర్జనభర్జనల్లో వున్నారు.

అప్పటికే రవీంద్ర గురించి రెండుసార్లు నాగు వచ్చి వెళ్ళాడు. అతను గత రాత్రంతా ఏమయిపోయాడో యెవరికీ తెలియటంలేదని చెప్పి, వినాయక్ గురించి అడిగిపోయాడు.

వినాయక్ రాగానే అతని తల్లిదండ్రులు అతన్ని ప్రశ్నల్లో ముంచెత్తి వదిలారు. వాళ్ళకి ఏదో చెప్పి తప్పించుకున్నాడు.

అప్పుడే నాగుని తీసుకుని ఉజ్వల వినాయక్ వాళ్ళింటికి వచ్చింది.

"మీరు నా దగ్గరేదో దాస్తున్నారు. రవి గురించి మీకు తెలుసు. రాత్రినుంచి నాకు ఒక్కక్షణం మన

శ్శాంతిలేదు. బావకేమయిందోనని ఒకటే హడలి చస్తు న్నాను. మీకేమైనా తెలిస్తే చెప్పరా?" దీనంగా వుంది ఉజ్వల కంఠస్వరం. ఆమె రవీంద్రనెంతగా ఆరాధి స్తోందో, ప్రేమిస్తుందో ఆమె కంఠంలో ధ్వనించింది.

వినాయక్ కదిలిపోయాడు. ఉజ్వల ముఖంలోకి సూటిగా చూడలేకపోయాడు. ఇంకా పూర్తిగా పసి తనం వదల్లేదు ఆమె ముఖంలో. అప్పుడే విచ్చిన గులాబీలా స్వచ్ఛంగా, స్నిగ్ధంగా వుంటుంది ఉజ్వల. నిండా పద్దె నిమిదేళ్ళు లేవు. బావ గురించి ఆమె చేస్తున్న ఎంక్వయిరీ ఎంతో అమాయకంగా చేలగా వుంది.

వినాయక్ పెదవి విప్పాడు. "రవీంద్ర యెక్కడికి వెళ్ళాడో నాకు తెలుసు. నేను ఇప్పుడు అక్కడికే పోయి వచ్చాను. అతను లేడు!" అన్నాడు.

ఒకేసారి వర్ణించలేని భావాలు కలగాపులగంగా ఉజ్వల మొహంలో దోబూచులాడాయి.

"ఎక్కడికి వెళ్ళాడు? ఎందుకని లేడు? చెప్పండి, బావకేదయినా ప్రమాదం జరగలేదుకదా!"

"ఏంలేదమ్మా! నువ్వనవసరంగా కంగారుపడకు. రవి యెంత చెప్పినా వినకుండా పంతానికి పోయాడు...." అంటూ నిన్న జరిగిన సంఘటనలు వరసగా చెప్ప సాగాడు వినాయక్.

ఉజ్వల ఊపిరి బిగబట్టి విన్నది.

"అయితే, బావ ఏమయినట్టు? ఆ కొండ దిగటం మీరు చూడలేదా?"

"లేదు. శిఖరాగ్రం చేరేవరకు నాకు తెలుసు. నేనెంత బతిమాలినా తిరిగిరాలేదు. ఆ తర్వాత ఎటు దిగాడో, ఏమయ్యాడో తెలీదు."

"ఈ విషయం నిన్ననే మాకెందుకు చెప్పలేదు?"

"అందుకు నేను బాధపడని క్షణంలేదు. చెప్పి మీ అందరికీ మనోక్షోభ కలిగించటమేగాక, నన్ను అనుమానించే ప్రమాదం లేకపోలేదని గ్రహించాను. అందుకే చెప్పలేదు. తిరిగివచ్చేస్తాడనుకున్నాను. అందుకే తెల్లవారుండగానే, దేగల కొండకి వెళ్ళి చూశాను. అతనెక్కిన కొండ కూడా పైవరకు ఎలాగో ఎక్కిచూశాను. అతని జాడలేదు. ఒకవేళ రాత్రి మీ ఇంటికి తిరిగొచ్చాడేమో చూద్దామనుకున్నాను. కాని నేను వచ్చేసరికే నాగు రెండుసార్లు వచ్చి వెళ్ళాడని తెలిసింది. సంగతి అరమైంది."

ఉజ్వల కళ్ళు జలపాతాలయ్యాయి. చెక్కిళ్ళమీదుగా కన్నీరు అలా స్రవిస్తూనే వుంది. తుడుచుకోవాలనే ప్రయత్నం కూడా చేయలేనట్టు అలాగే ప్రమాన్పడి వుండిపోయింది.

"అయామ్ సారీ ఉజ్వల, నన్ను క్షమించమ్మా!"

"నో, నో! మీ తప్పేంలేదు. బావ తత్వం నాకు తెలుసు. అతనికి అడ్వంచర్స్ అంటే ప్రాణం! ఏదో సాధించాలనీ, ఎవరూ చేయని సాహసం చెయ్యాలని మాటల సందర్భంలో నాతో యెన్నోసార్లన్నాడు. ఎప్పుడూ నేల విడిచి సాముచేస్తుండేవి, అతని ఆలోచనలు. నేను ఎన్నోసార్లు ఎగతాళిపట్టించేదాన్ని! నువ్వేమయినా రాజకుమారుడివా లేక యుద్ధవీరుడివా అని ఆటపట్టించేదాన్ని!

'చూస్తుండు, ఏదో నాకు ఎవరూ సాధించలేనిది సాధిస్తాను. గొప్ప పేరు సంపాదిస్తాను. అప్పుడుగాని ఈ రవిబావ గొప్పతనం నీకు తెలిసిరాదు!' అంటుండేవాడు.

ఆ ఉత్తరం చూడగానే బావలో నిద్రాణమైవున్న కోరిక — అదే గొప్ప కార్యమేదైనా సాధించాలనే కోరిక — పడగ విప్పిందన్నమాట! అందుకే మీమాట కూడా లక్ష్యపెట్టక తన పట్టుదలే సాధించుకున్నాడు."

ఉజ్వల మాటలు ఆసక్తిగా విన్నాడు వినాయక్ — ఇదివరలో తన దగ్గర కూడా ఇలాగే ఏదేదో చెల్లిస్తుండే వాడు రవీంద్ర! తను నవ్వి పూరుకునేవాడు. తను నవ్వినప్పుడల్లా రవీంద్ర మొహం ఎర్రగా కందగడ్డలా అయ్యేది, అవమానంతో. 'చూస్తావుగా' అనేవాడు. కాని రవీంద్ర నరనరాన ఈ కోరిక జీర్ణించుకుని వున్నదన్నమాట. ఆ ఉత్తరం అతనిలోని కాంక్షను బాగా ప్రేరేపించింది. అందుకే ఇక రవీంద్ర ఆగలేదు.

"ఇప్పుడేం చేద్దామంటావు?" అన్నాడు వినాయక్.

"నేనో నిర్ణయానికొచ్చాను!" దృఢంగా వుంది ఉజ్వల స్వరం!"

"ఏమిటది?"

"తర్వాత చెపుతాను."

ఆ తర్వాత కొద్ది నిమిషాలకి ఆమె తమ్ముడితో కలిసి వెళ్ళిపోయింది.

వినాయక్ ఆ రోజు కాలేజికి పోలేదు. రవీంద్ర అంతర్ధానం విచిత్రంగా జరిగిపోయింది. అతని మెదడునిండా రవీంద్రని గురించిన ఆలోచనలే.

## 4

చటుక్కున మెలకువవచ్చింది రవీంద్రకి — జరిగినదంతా ఒకటొకటే గుర్తుకొస్తున్నాయి.

తను శిఖరం చివరికి చేరాడు. కిందినుంచి వినాయక్ పిలుస్తున్నాడు వచ్చెయ్యమని! తను వినిపించుకోనట్టు

కొండ ఎక్కుతునే వున్నాడు. విసిగిపోయి వినాయక్ వెళ్ళిపోయాడు. తను కొండ అవతలిపక్కకు తిరిగాడు. అది కూడా ఏటవాలుగా భూమ్మీదవరకు సాగిపోయి వుంది.

తన గుండె వేగంగా కొట్టుకుంటోంది. వుత్తరంలో రాసిన అంత అనుభవం — అద్భుతం — ఏ రూపంలో ఎదురవుతుందో అర్థంకావటంలేదు. టెన్షన్ టెన్షన్ ఒకటే టెన్షన్!....తల సుత్తితో మోదినట్టు భారంగా వుంది.

తన కుడిపక్క అలికిడి అయితే చటుక్కున చూశాడు. కెవ్వున అరవబోయి విరమించుకున్నాడు. మనిషో, మృగమో తెలియని ఆకారం! ఒంటినిండా నల్లని రోమాలు! డ్రాయరు తప్ప ఒంటిమీద మరే ఆచ్ఛాదన లేదు. నల్లగా, పోతపోసిన కంచువిగ్రహంలా వున్నాడు! ఆరడుగుల ఆజానుబాహుడు! కనుగుడ్లు ఎర్రగా కాగిన వాడి కళ్ళలా వున్నాయి. రక్తిమ చిందిస్తున్నాయి. పెద్ద పెద్ద మీసాలు బలిష్టమైన కండరాలు. చిన్నసైజు రాక్షసుడిలా వున్నాడు.

"గుడ్! నువు చాలా ధైర్యవంతుడివి!" అన్నాడతను. తను కళ్ళు అప్పగించి అతనివంకే చూస్తున్నాడు.

అతను నవ్వాడు. నవ్వాడని తను అనుకున్నాడు. నవ్వు కూడా అంత భయంకరంగా వుంటుందని తనకి తెలీదు.

"నువ్వు ధైర్యవంతుడివని ఎందుకన్నానో తెలుసా? ఇదివరకు నీలాగే ఇద్దరు కుర్రాళ్ళు ఎంతో ధైర్యవంతుళ్ళలా కొండెక్కివచ్చారు. నన్ను చూసీ చూడగానే తారెత్తిపోయి గుండె ఆగి చచ్చిపోయారు. పాపం చాలా

లేత వయసు" మృగం సానుభూతి చూపిస్తోంది.

అప్పటికీ తను మాట్లాడలేదు.

"నీకేదో అద్భుతం చూపిస్తానని రాశాను కదూ వుత్తరంలో! చూస్తావా?" అన్నాడతను.

తను మౌనంగా తలూపాడు.

అతను చెయ్యి ముందుకు చాపాడు. అరచేతిలో కోడి గుడ్డుంది. గుప్పిట మూసి తెరిచాడు. ఈసారి అరచేతిలో అప్పుడే పొదగబడ్డ కోడిపిల్ల వుంది.

తను కళ్ళప్పగించి చూస్తున్నాడు.

అతను నవ్వి "అద్భుతంగా లేదూ?" అన్నాడు.

ఆ తర్వాత గాల్లో చేతినూపాడు. అరచేతిలో ఎర్రటి సింధూరం కనిపించింది. మళ్ళా గాల్లో ఊపి అరచేయి తెరిచాడు. చేతినిండా బంగారు కాసులున్నాయి.

తను ఆశే చూస్తున్నాడు.

"ఇది మేజిక్‌లా వుంది కదూ! ఇలాంటి చిన్న చిన్న ట్రిక్కులు మీ స్కూల్లోను, కాలేజిల్లోను మెజిషియన్స్ ప్రదర్శించి వుంటారు. అవునా?" అన్నాడతను.

అవునన్నట్టు తలూపాడు.

"మాట్లాడు. అలా తలూపితే ఏం తెలుస్తుంది? నేను నిన్నేం చెయ్యను. నీలాంటి తెలివైన ధైర్యవంతులైన కుర్రాళ్ళంటే నాకు చాలా సరదా, ఇష్టం! నేనేం రాక్షసుడ్ని కాదు, భయపడకు. కొద్దిగా భారీ శరీరం, అంతే!" అన్నాడు.

తనకు బెరుకుపోయి ఆ స్థానంలో ధైర్యం చోటు చేసుకుంటోంది.

"నీకిప్పుడో కొత్తరకం విద్య చూపిస్తాను. ఇలా నా కళ్ళలోకి చూడు!" అన్నాడతను.

తను చూశాడు. ఆ ఎర్రటి రక్తజీరలున్న కళ్ళలో ఏదో అలౌకిక శక్తి కనిపించింది తనకి. కళ్ళల్లో కళ్ళు పెట్టి చూడటానికే భయంవేసింది. ఆ కళ్ళలో ఏదో మంత్రశక్తి తన సర్వశక్తుల్నీ లాగేసుకుంటున్నట్టు అనిపించింది.

కళ్ళు తిరిగాయి. ఒళ్ళు తూలింది.

అంతే తనకి గుర్తు! నేలమీద పడిపోబోతున్నట్టు ఎవరో పట్టుకుని ఆపినట్టు చివరిసారిగా గుర్తుంది.

ఇప్పుడు ఈ గదిలో తెలివొచ్చింది.

రవీంద్ర చుట్టూ పరీక్షగా చూశాడు. అదేదో గమ్మత్తయిన గది! యెక్కడినుంచో లోపలికి వెల్తురు పడుతున్నట్టుందిగాని, దారి కనిపించటంలేదు.

తనున్న ప్రదేశం యెక్కడుంది? తనని తీసుకొచ్చిన ఆ భయంకర వ్యక్తి ఎవరు? అతనేమయ్యాడు? తనని అతనే ఇక్కడికి తీసుకువచ్చాడా? అతని ఆకారం భయంకరంగా వున్నా మనిషి సౌమ్యుడిలానే వున్నాడు, తనతో ఆదరంగానే మాట్లాడాడు!

తనని ఎందుకు తీసుకొచ్చాడో తెలీదు. అసలు ఆ ఊతరం ఎందుకు రాశాడు? తనునుంచి అతనికేం కావాలి?

"హల్లో యంగ్ మాన్, రాత్రి బాగా నిద్రపట్టిందా?" ఎక్కడినుంచో మాటలు వినిపించాయి. అవి అతని మాటలే! అయితే మనిషి కనిపించడే! ఆ మాటలు ఎక్కడినుంచి వినిపిస్తున్నాయో జాగ్రత్తగా గమనించాలి.

"బాగానే పట్టింది. అయితే యిప్పుడు పగలా, రాత్రా?" అడిగాడు రవీంద్ర.

"గుడ్, అలా ధైర్యంగా మాట్లాడాలి! ఇది పగలే. గత సాయంత్రం నువు నాతో మాట్లాడుతునే మూర్ఛ

పోయావు. నా విడిదికి తీసుకొచ్చాను నిన్ను. రాత్రి మగతగా నేను పెట్టిన అన్నం తిని నిద్రపోయావు. బహుశా అన్నంతిన్న సంగతి కూడా నీకు గుర్తుండి వుండదు. అవునా?"

రవీంద్రకి నిజంగా నే గుర్తులేదు.

"ఇక్కడ నువ్వు చాలా ఫ్రీగా మసలవచ్చు. నీకు ఏం కావలసి వచ్చినా అడుగు. తిను, తిరుగు అంతేగాని పారిపోవాలని ప్రయత్నించకు."

"ఇంతకీ నన్నెందుకు తీసుకొచ్చావో చెప్పలేదు. నా గురించి మా వాళ్ళంతా కంగారుపడుతుంటారు. నేనేమై పోయానోనని బాధపడతారు. అయినా నన్నెందుకు బంధించావు? నేనేం అపకారం చేశాను నీకు?"

అతను నవ్వాడు. "నువ్వు నాకేమీ అపకారం చెయ్య లేదు. నేను కూడా నీకేమీ అపకారం చెయ్యను. నా వలన నీకు నీ వలన నాకు ఉపకారం జరగాల్సి వుంది. అంతా లోకకళ్యాణం కోసం! పరిస్థితులు త్వరలో నే నీకరమవుతాయి.

నీ కుడిపక్కన బాత్ రూం వుంది. కాలకృత్యాలు తీర్చుకో! స్నానంచేసి వచ్చేసరికి చక్కటి ఫలహారం సిద్ధంగా వుంటుంది. టిఫిన్ తిన్నాక నిన్ను బయటికి తీసుకువెళ్తాను. భైదిభై, ఇది నీకు బందిఖానా కాదు. రెండు రోజుల్లో అంతా నీకే అర్థమవుతుంది. ఓ.కే!?" అన్నాడు.

రవీంద్ర అనాసక్తంగానే లేచి బాత్ రూంవైపు వెళ్ళాడు. ఓ పావుగంట తర్వాత అతను స్నానంచేసి వచ్చేసరికి గదిలో టీపాయ్ మీద వేడిపొగలు విరజిమ్ముతూ కమ్మని వాసనలు వెదజల్లుతున్న జీడిపప్పు, ఉప్మా, ఎగ్

ఆమ్లెట్సు వున్నాయి.

వాటిని చూడగానే ఆకలి విజృంభించింది. అను మానాల్ని, ఆశ్చర్యాన్ని పక్కకి నెట్టి టిఫిన్ మీద విజృంభించాడు రవీంద్ర.

టిక్ మన్న చప్పుడు. వెను తిరిగి చూశాడు. ఓ గాజు గ్లాసునిండా పొగలు విరజిమ్ముతూ ఓవల్టిన్!

అవి తీసుకున్నాక రవీంద్రలో కొత్త ఉత్సాహం వచ్చింది. వెయ్యి ఏనుగుల బలంవచ్చినట్టనిపించింది.

"ఇంకో రెండు ఆమ్లెట్సు తింటావా?"

"వద్దు వద్దు. ఓవల్టిన్ కూడా తాగేశాను థాంక్స్."

"చూశావా, అప్పుడే నాకు కృతజ్ఞతలు కూడా చెప్పుతున్నావు. అంటే నామీద శత్రుత్వ భావంలేదన్న మాటేగా!"

"అలాంటిదేం లేదుగాని, నన్నిలా మోసంచేసి తీసు కొచ్చినందుకే కోపంగా వుంది."

"అన్యాయంగా మాట్లాడకు! నేను నిన్ను మోసం చేశానా? నువ్వే ఆసక్తితో బయలుదేరి వచ్చావు. నా మాటమీద వచ్చినందుకు నీకు సకల సౌకర్యాలు అమర్చు తున్నాను."

"అవుననుకో! కారణం చెప్పటంలేదుగా!"

"చెపుతాను. రెండు క్షణాలు కళ్ళుమూసుకో!"

"ఎందుకు?"

"నీకు బయటి ప్రపంచం చూపించబోతున్నాను."

"కళ్ళు మూసుకోకపోతే....?"

"డోన్ట్ బి సిల్లీ అండ్ చైల్డిష్! కళ్ళు పోతాయి."

రవీంద్ర చటుక్కున కళ్ళు మూసుకున్నాడు. మూసిన

ఆతని కళ్ళముందు మెరుపులు మెరిసినట్టనిపించింది.

"ఇప్పుడు కళ్ళు తెరవొచ్చు!"

రవీంద్ర కళ్ళు తెరిచి ముందుకు చూసి ఉలిక్కి పడ్డాడు.

# 5

ఆ రాత్రి యెలాగో కలత నిద్దురలో కాలక్షేపం చేసింది ఉజ్వల. ఆమె కళ్ళముందు చిరునవ్వుతో రవీంద్ర నిలబడివున్నాడు. రాత్రంతా ఆమె ఆలోచనలతో నే గడిపేసింది. తెల్లవారింది.

ఆ క్రితం రోజు వినాయక్ నుంచి వివరాలు సేకరించింది. దేగలకొండ వివరాలు, దాని నైసర్గిక స్వరూపం పరిసర ప్రాంతాల గురించిన సమాచారం మాటల సందర్భంగా తెలుసుకుంది.

ఉజ్వల లేచింది. చకచక తన కార్యక్రమాన్ని అమలులో పెట్టింది. నాగుని లేపి రహస్యంగా ఏదో చెప్పింది. నాగు భయం భయంగా చూశాడు అక్కవంక. వద్దంటూ తల అడ్డంగా తిప్పాడు. ఉజ్వల బతిమాలుకునే ధోరణిలో ఏదో నచ్చచెప్పాక ఒప్పుకున్నాడు.

పంజాబీ డ్రెస్సు వేసుకుంది. కాళ్ళకు బెల్టు జోళ్ళు వేసుకుంది. అప్పటికి ఇంట్లో ఇంకా ఎవరూ మేలుకో లేదు. నాగు తనూ వస్తానని మరాం చేశాడు. ఓ క్షణం ఆలోచించి ఒప్పుకుంది ఉజ్వల.

ఇద్దరూ దేగల కొండ చేరుకునేసరికి బాగా తెల్లవారిపోయింది. సూర్యుడు పొడుచుకొచ్చాడు. ఉదయ భానుడి కిరణాలు దేగల కొండమీద బంగారు వర్ణంలో ప్రతిఫలిస్తున్నాయి. కాని ఆ ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించే స్థితిలో లేదు!

దేగల కొండ చుట్టుపక్కల నిర్మానుష్యంగా వుంది. కొండకి పాతిక గజాల దూరంలో ఓ సన్నటి తారు రోడ్డు వుంది. పల్లెటూళ్ళకి బస్ సౌకర్యం కల్పించటానికి కొత్తగా ఆ రోడ్డు నిర్మించారు. దేగల కొండ చుట్టుపట్ల వున్న గ్రామాల్ని కలుపుతూ పోతుందా రోడ్డు. పేరుకి రెండు బస్సులున్నా ఒకటే కండిషన్లో వుంటుంది. అదే వచ్చి వెళ్తుంటుంది—దానిష్టమైనప్పుడల్లా.

దేగల కొండవైపు పరికించి చూసిన ఉజ్వలకు గుండె ఝల్లుమంది! సగంవరకు ఏటవాలుగా వున్న ఆ కొండ పైకి వెళ్ళేకొద్దీ నిట్టనిటారుగా వుంది — ఈ కొండ ఎక్కటం తనవల్ల అయ్యే పనేనా?

"అక్కా, ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"నాగూ, నువ్వు యింటికి వెళ్ళిపో!"

"అదేమిటి? నువ్వొక్కతివీ ఏం చేస్తావు?"

"బావ జాడ తెలుసుకుని వస్తాను."

"నేనుండటంవల్ల నీకొచ్చిన నష్టమేముంది? నేనూ నీతో పాటే వుంటాను."

"వద్దు చిన్నా! మనిద్దరమూ ఒకేసారి బయటికి వచ్చేస్తే అమ్మవాళ్ళు కంగారు పడిపోతారు. నువ్వు వాళ్ళకి ఏదయినా నచ్చచెప్పి సంగతి బయటికి రాకుండా చూడు!"

"అక్కా! నేను అబద్ధం చెప్పలేను. చెప్పినా మన వాళ్ళు నమ్మరు. అందుకని నీతో బాటే వుండి బావ జాడ కనుక్కుంటాను."

"సరే, అయితే నువ్వు కిందనే వుండు. నేను కొండ ఎక్కుతాను. నువ్వు ఎక్కలేవు" అన్నది ఉజ్వల బెల్టు జోళ్ళు సరిచేసుకుని కొండ యెక్కటానికి సంసిద్ధ

మవుతూ.

నాగు కింద నే వుండిపోయాడు.

ఉజ్వల కొండ ఎక్కటం ప్రారంభించింది. చెప్పులు జారిపోతున్నాయి. బెల్టు వుండటం మూలాన కాలికి అంటి పెట్టుకుని మొత్తం కాలే జారిపోతోంది. అలాగే పళ్ళు బిగువున ఓపిక తెచ్చుకుని కొండెక్కుతోంది.

నాగు అక్కడకే దృష్టిసారించి చూస్తున్నాడు.

## 6

రవీంద్ర కళ్ళెదుట కనిపిస్తున్న దృశ్యాన్నే కళ్ళప్పగించి చూస్తున్నాడు.

అందరూ తన వయసువాళ్ళే — దాదాపు పాతిక ముప్పయిమంది కుర్రాళ్లు వరసగా కూచునివున్నారు. అందరిలోను ఏదో వెలితి కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

వీళ్ళందరు ఇక్కడ ఎందుకున్నట్టు? వీళ్ళకు కూడా తనలాగే వుత్తరాలు రాసి రప్పించాడా ఈ మనిషి? వీళ్ళందర్నీ ఏం చెయ్యబోతున్నాడు?

అక్కడ విశాలమైన హాలు—కాన్ఫరెన్స్ హాలులా వుంది. దానిచుట్టూ రోజ్‌వుడ్‌తో చేసిన ఖరీదైన కుర్చీలు. మధ్యలో డెకోలామ్ రౌండ్ టేబిలు, ప్రతిబింబం కనిపించేటంత స్మూత్ సర్ఫేస్‌తో ఆ హాలుకి నిండు చేకూరుస్తోంది.

కుర్చీల్లో యువకులంతా కూచుని వున్నారు. వాళ్ళ వెనుకగా గోడకి ఆనుకుని అక్కడొకడు అక్కడొకడు ఆ మనిషి తాలూకు మనుషులు చాలా ఎలర్టుగా కాపలి కాస్తున్నారు. పైకి చూడటానికి చాలా స్వేచ్ఛగా వదిలేసినట్టు కనిపిస్తున్న ఆ కనబడని 'బందిఖానా' తెల్సుకుంటే నవ్వు వచ్చింది రవీంద్రకు.

చుట్టూ పరీక్షగా చూశాడు రవీంద్ర. కాన్ఫరెన్స్ హాలుకి కుడిపక్కన కొన్ని గదులున్నాయి. అన్నీ తాళాలు పెట్టి వున్నాయి. ఆ లోపల యేముందో?

అంతమంది మనుషులున్న జాడే లేదక్కడ! ఎక్కడి నుంచో చక్కటి వాద్యసంగీతం వినిపిస్తోంది—గోడల్లో అమర్చిన మైక్రోఫోన్లనుంచి, గాబోలు! హాలుకి ఎడమ పక్క విశాలమైన లాన్స్‌లో ఫ్రేముకుర్చీలు అర్ధచంద్రాకారంగా వేసివున్నాయి.

రవీంద్ర అక్కడ కూచున్న యువకుల ముఖాల్లోకి చూశాడు. ఇదివరకెన్నడూ చూసిన ముఖాలు కాదు! ఎవరో వీళ్ళు? వాళ్ళ మోపుల్లో చూపులు కలపాలని చూశాడు. కాని యెవరూ అతనివంకే చూడటం లేదు. యేవో ఊహా లోకంలో విహరిస్తున్నట్టున్నారు. అర్ధ నిమీలిత నేత్రాలతో యే వస్తువుమీదా కేంద్రీకరించని చూపులతో చాలా గమ్మత్తుగా కనిపిస్తున్నారు.

రవీంద్రకి వాళ్ళని చూస్తుంటే ప్రాణంతో వున్న మనుషులా, బొమ్మలా అన్న అనుమానం కలిగింది.

ఇంతలో తనకు పరిచయమైన ఆ రాక్షసాకృతిగల మనిషి అక్కడికి హుందాగా నడుచుకుంటూ వచ్చాడు. ఇప్పుడు అతన్ని చూస్తుంటే భయం వెయ్యటంలేదు. బహుశా అలవాటయిపోవటంవల్ల కావచ్చు. అయితే ఇప్పుడు ఫుల్ సూట్‌లో వున్నాడు. ఎలుగుబంటికి బట్టలు కట్టబెట్టినట్టు వికృతంగా వున్నా చాలా సౌమ్యంగా కనిపిస్తున్నాడు.

అతను కాన్ఫరెన్స్ గదిలోకి అడుగుపెడుతూనే "గుడ్ మార్నింగ్ మైడియర్ యంగ్ మెన్!" అంటూ అందరినీ వుద్దేశించి విష్ చేశాడు. అందరూ లేచి నిల్చు

న్నారు.

గదిలో వున్న ముప్పయిమందీ ఒకేసారి ముక్త కంఠాలు "గుడ్ మార్నింగ్ సర్!" అన్నారు మర్యాద వుట్టిపడుతుండగా.

అతను కూచుని అందర్నీ కూచోమని సైగ చేశాడు. అంతా కూచున్నాక "సురేష్!" అని పిలిచాడు అతను.

సన్నగా రివటలా వున్న ఓ యువకుడు లేచి అతని వైపు మంత్రముగ్ధుడిలా అడుగులు వేస్తూ వెళ్ళి ఒద్దికగా పక్కన నించున్నాడు.

"నీకు అప్పగించిన పని పూర్తికావచ్చిందనుకుంటాను" అన్నాడతను.

"అవును సార్! ఒక్క వారంరోజుల్లో పూర్తవు తుంది."

"గుడ్! వెళ్ళి నీ పని చూసుకో" అన్నాడతను.

సురేష్ వెళ్ళిపోయాడక్కడినుంచి.

"జైన్!" అని పిలిచాడతను.

లావుగా ఎర్రగా పొడవుగా చేయెత్తు యువకుడు ముందుకొచ్చాడు. సరాసరి అతని పక్కకువచ్చి నించు న్నాడు.

"ఐ హోప్ యు ఆర్ ఇన్ ప్రోగ్రెస్!" అన్నా డతను.

"ఎస్సార్! ఐ విల్ బి సక్సీడెడ్ షార్టలీ!"

"వెరీగుడ్, కేరీ ఆన్!" అతని భుజం తట్టాడు అతను. జైన్ ఇంకా లావయిపోయేడు ఆ ప్రశంసతో.

"బార్జి" అంటూ మరొకతన్ని "సలీం!" అంటూ యింకో యువకుడ్ని పేరు పేరునా పిలిచి వాళ్ళ పని గురించి కనుక్కొని సంతృప్తిగా తలాడించాడతను.

గదంతా ఖాళీ అయిపోయింది.

గదిలోని తక్కిన ఎస్కార్టు మనుషులు కూడా వెళ్ళిపోయారు.

రవీంద్ర, అతను—యిద్దరే మిగిలారు.

"కమాన్ మై డియర్ యంగ్‌మాన్! కమ్‌నియర్!" అన్నాడతను చల్లగా నవ్వుతూ.

అతని కంఠంలో యెక్కడలేని మార్దవమూ వచ్చింది. కమాండ్ వుంది. యేదో తెలీని ఆకర్షణ శక్తి వుంది.

రవీంద్ర అతనికి దగ్గరగా వెళ్ళాడు.

"నువ్వెవరో నాకు తెలుసు. నేనెవరో నీకు తెలీదు కదూ! నా పేరు ఆటం! వింతగా వుందికదూ. ఆటం అంటే అణువుకన్న సూక్ష్మాతిసూక్ష్మమైన అణువు. నేను అలాంటి సూక్ష్మాతిసూక్ష్మమైన వ్యక్తినన్నమాట! అయితే ఆ అణువే బాంబ్‌గా చెప్పుకుంటే నేను ఆటంబాంబ్‌ని. అవసరాన్నిబట్టి రూపాంతరం చెందుతుంటాన్నేను!" అతని వదనంలో అదే చిరునవ్వు. సమ్మోహనాస్త్రం లాంటి నవ్వు.

రవీంద్ర మౌనంగా అతన్నే చూస్తున్నాడు.

"వీళ్ళందరికీ నేను చిన్నచిన్న పనులు అప్పచెప్పాను. వీళ్ళందరూ చాలా తెలివైనవాళ్ళు! మేధావులన్నమాట! ఈ మేధావి వర్గంలో ఇప్పుడు నిన్ను చేర్చుకుంటున్నాను. అంటే నువు కూడా మేధావివే నన్నమాట! నీమీద కూడా విశ్వకల్యాణం కోసమై చిన్న కార్య భారం మోపుతున్నానన్నమాట! అది నువ్వు విజయవంతంగా పూర్తిచేస్తావనే నమ్మకం నాకుంది" ఆగాడు ఆటం.

రవీంద్ర అతని మాటలకు నాగస్వరంముందు తాచులా తలూపుతున్నాడు.

"నేను ఫ్రీకే పని చేయించుకోను. అందుకు ప్రతిఫలం చాలా భారీగానే ముట్టచెప్తాను. అంతే కాదు, నాకు వ్యతిరేకంగా పని చేసినా ప్రతిఫలం భారీగానే వుంటుంది. నువ్వంటూ ఈ భూమ్మీద మిగిలివుండవు" నవ్వుతున్నాడు ఆటం.

"ఇంతకీ నేను చెయ్యాల్సిన పనేమిటి?"

"చెప్తాను. ఇక్కడున్నంతకాలం నీ గురించి నీవాళ్ళ గురించీ అంతా మర్చిపోవాలి! నువ్వే ఆటంగా, ఆటమే నువ్వులా మారిపోవాలి. అదెలాగూ జరిగే దేననుకో, ఊరికే హెచ్చరిస్తున్నానంతే!"

రవీంద్ర ఆలోచిస్తున్నాడు.

"ఇలా నా కళ్ళలోకి చూడు!" ఆటం పిలిచాడు.

రవీంద్ర అతని కళ్ళలోకి చూశాడు. కొద్దిక్షణాలు మాత్రమే! ఆ కళ్ళలో ఏదో ఆకర్షణశక్తి! తన సర్వశక్తులూ లాగేసుకుంటున్న అనుభూతి!

"నువ్వు నేను చెప్పినట్టు వింటావు....వింటున్నావు" అన్నాడు ఆటం ఆగి ఆగి.

రవీంద్ర తలూపాడు.

"నీ పేరేమిటి?" ఆటం నెమ్మదిగా అడిగాడు. అతని స్వరంలో ఏదో రకమైన మెలోడి.

"ఏమో, నాకు తెలీదు...."

"నీకు పేరులేదు, అవునా?"

"అవును, లేదు!"

"నీ పేరు రవీంద్ర....కదూ!"

"అవును, నా పేరు రవీంద్ర!"

"గుడ్! ఇప్పుడు విను జాగ్రత్తగా! నువ్వు చెయ్యా

ల్సిన పనేమిటంటే...."

రవీంద్ర జాగ్రత్తగా వింటున్నాడు.

# 7

నాలుగైదుసార్లు జారి పోబోయి యెలాగో పట్టు చిక్కించుకుని, తుప్పలు పొదలు ఆధారంగా పట్టుకుని రేగల కొండ శిఖరాగ్రం చేరుకున్నది ఉజ్వల. పైనుంచి ఓసారి కిందికి చూసింది. కళ్ళు తిరిగాయి.

కింద నాగు చిన్న బొమ్మరాయిలా కనపడుతున్నాడు. ముఖంలోని భావాలేం కనబడటంలేదుగాని ఉజ్వల వూహించుకుంది—తమ్ముడు చాలా ఆత్రుతగా, టెన్షన్‌తో చూస్తున్నాడని ఆమెకు తెలుసు.

కొండమీదినుంచి అవతలిపక్కకు చూసింది.

దిగువున ఎక్కడో పాతాళంలో వున్నట్టున్న లోయ, పెద్ద పెద్ద బండరాళ్ళు—చాలా భయంకరమైన దృశ్యం! ఏమాత్రం కాలుజారినా రూపురేఖలు కనిపించకుండా పచ్చడికావలసిందే! ఒక్క క్షణం తొట్రుపడింది ఉజ్వల.

వినాయక్ చెప్పినట్టే వుందా కొండ! అవతలపక్కగాని, చుట్టుపక్కలగాని ఎక్కడా అనుమానించదగ్గ అంశమేదీ కనిపించటంలేదు. బావ మరి ఏమయిపోయినట్టు? యెలా మాయమయ్యాడు?

ఇంతవరకు రావటం వినాయక్ చూశాడు? కిందికి దిగటంగాని ఎవర్నయినా కలవటంగాని అతను చూడలేదు. తను అవతలి పక్కకు దిగిచూస్తే....? ఏమయినా కనిపిస్తుందేమో!

ఉజ్వలకి ధైర్యం సరిపోవటంలేదు. అంతదాకా సాహసించి రావటమే తన తలకు మించిన పని! ఇక్కడ తనేమైనా ప్రమాదంలో చిక్కితే....? నాగు చిన్న

పిల్లాడు. వాడు తనకి సాయం చెయ్యలేదు. వెంట వస్తే తీసుకొచ్చిందే గాని తనకి బాడీగార్డుగా కాదు.

నాగు వైపు చూసింది. వచ్చెయ్యమని చేయి వూపుతున్నాడు. భయపడిపోయినట్టుంది, ఇక వుండబట్టలేక పిలుస్తున్నాడు.

కాని ఉజ్వలకి కిందికి వెళ్ళాలనిపించలేదు. అవతలి పక్కకు దిగిచూడాలి! బావ ఎలా అంతర్థానమయ్యాడో తెల్సుకోవాలి. అంతవరకు తను వెనుతిరిగి వెళ్ళేదిలేదు.

దృఢనిశ్చయంతో కొండ అవతలివైపుకు దిగసాగింది. తమ్ముడివైపు చూడలేదు. మళ్ళీ తన నిర్ణయం మారిపోవచ్చు! అప్పుడు తనొచ్చిన పని సఫలం కాకుండానే ఇంటికి వెళ్ళాల్సి వుంటుంది. అది తనకిష్టంలేదు.

కొండ అవతలివైపుకు దిగటానికి సులువుగానే వుంది. మెట్లు మెట్లుగా కొండ యెవరో చెక్కినట్టుంది. జారిపోకుండా దిగటానికి అనువుగా చేశారెవరో!

కొండ దిగుతూనే ఆమె నివ్వెరపడిపోయింది. గుండె వేగం హెచ్చింది. చేష్టలుడిగి నిల్చుండిపోయింది.

అక్కడ చిన్న చిన్న గోతులు తవ్వి వున్నాయి. అందులో అంతసేపు ఒదిగి దాక్కున్న నలుగురు వ్యక్తులు ఉజ్వలని చూడగానే చటుక్కున లేచి నిలుచున్నారు.

వాళ్లు బావ వయసువాళ్ళే! చదువుకునే కుర్రాళ్ళలాగే వున్నారు.

వాళ్ళు తనవంక నవ్వుతూ చూస్తున్నారు. మేకపిల్ల మీదికి ఉరకటానికి సిద్ధంగావున్న తోడేళ్ళలా వున్నాయి వాళ్ళ చూపులు.

ఆ నలుగురు కదిలి ముందుకు వస్తున్నారు.

అందులో ఒకడు చటుక్కున ఉజ్వల చెయ్యిపట్టు

కున్నాడు. ఆమె భయంతో అరిచింది.

నలుగురు కిసుక్కున నవ్వారు.

చెయ్యి పట్టుకున్న కుర్రాడు పకపక నవ్వాడు.

"ఎందుకు నవ్వుతారు? నా చెయ్యి వదులుముందు." జారిపోతున్న ధైర్యాన్ని కూడగట్టుకుంటూ దబాయించింది ఉజ్వల. చేయి విడిపించుకోబోయింది. పట్టు ఇంకా బిగిసిందే గాని సడలలేదు.

స్వతహాగా ఉజ్వల ధైర్యవంతురాలు. తెలివైనదీ. అయినా నలుగురు మగవాళ్ళని అలాంటి నిర్జన ప్రదేశంలో చూడగానే ఆమె ధైర్యం సడలిపోయింది. అయినా బింకంగా వుండటానికి ప్రయత్నిస్తోంది.

"ఎవరు మీరు? ఏమిటీ దౌర్జన్యం?" అరిచింది ఉజ్వల. అప్పటికి నలుగురు ఆమెను చుట్టుముట్టేశారు.

"మీరు దూరంగా వుండండి!" మొదటి కుర్రాడు తక్కిన వాళ్ళని చూసి మెల్లగా అన్నాడు. "మేమెవరమో చెప్పాలా? నన్నింకా గుర్తుపట్టలేదా? నీ బావ రవీంద్రతో కలిసి మీ యింటికి రెండుమూడుసార్లు వచ్చాను."

ఉజ్వలకి గుర్తొచ్చింది. అవును! వీడిని ఇదివరకు బావతో చూసింది. అయితే తర్వాత యెలక్షన్‌లలో వీళ్ళిద్దరు ప్రత్యర్థులుగా నిల్చున్నారు. ఆ తర్వాత బావ గెలిచాడు. వీడు బావతో కజ్జా పెట్టుకున్నాడు. గొడవలు జరిగాయి. బావ వీడి గురించి అప్పుడప్పుడు చెప్తుంటాడు.

ఉజ్వలకి అంతా వరసగా గుర్తొచ్చింది.

"హో, గుర్తొచ్చానని నీ ముఖమే చెపుతోంది. నీ బావ నాతో స్నేహంగా వుంటూ నామీదే దెబ్బతీశాడు. దెబ్బకుదెబ్బ తీయటానికి అవకాశంకోసం చూస్తున్నాను.

నీ బావతో వచ్చినపుడు నిన్ను చాలాసార్లు చూశాను. నీ అందానికి మూర్ఛపోయాను. నిన్నెలాగైనా నా వశం చేసుకోవాలని ఆనాడే నిర్ణయించుకున్నాను. అనుకోకుండా ఆశించని విధంగా ఈ రోజు చాలా అకస్మాత్తుగా అవకాశం దొరికింది.

మేం నలుగురం రోజూ ఉదయమే ఈ కొండవరకు రన్నింగ్ చేస్తుంటాం. ఈ రోజూ అలాగే రన్ చేస్తున్నాం. నువ్వు మీ తమ్ముడితో వస్తూ కనిపించావు. ఇంత ఉదయాన్నే ఇంతదూరం ఎందుకొస్తున్నావో తెలీదుగాని, మాకు చక్కటి అవకాశం కల్పించావు. నీకంటే ముందుగా ఇక్కడికి చేరుకున్నాం. నువ్వు కొండ దిగి రాకపోతే మేమే పైకి ఎక్కివచ్చి నిన్ను కిందికి దింపేవాళ్ళం! మాకు శ్రమివ్వకుండా నువ్వే దిగొచ్చావు- దివినుంచి భువికి దిగివచ్చిన గంధర్వ కన్యలాగా!" అన్నాడతను.

ఉజ్వల కళ్ళు పెద్దవిచేసుకుని విన్నది అతను చెప్పిందంతా. వచ్చి వచ్చి ఈ వేటకుక్కలపాల బడిపోయానే అని విచారిస్తోంది. ఎలా తప్పించుకోవాలా అని మార్గాన్ని అన్వేషిస్తోంది.

ఆ కుర్రాడు వికృతంగా నవ్వుతూనే ఆమెని చటుక్కున కౌగలించుకున్నాడు. ఉజ్వల చటుక్కున తప్పించుకుని కిందికి జారిపోయింది. పరుగందుకుంది.

ఆ కుర్రాడు వుక్రోషంతో ఆమెని పట్టుకోవటానికి చేతిని విసిరాడు. ఆమె వల్లెవాటుగా వేసుకున్న కండువా చేతికి చిక్కింది. ఆమె మాత్రం చిక్కకుండా పరుగెడుతునే వుంది.

నాలుగు వేటకుక్కలు ఆమెని తరుముతున్నాయి.

# 8

"నువ్వు కుడిచేతిని ముందుకు చాపుతున్నావు.... ఆ రివాల్వర్ చేతికి తీసుకుంటున్నావు.... ఎదురుగా వున్న బోర్డుకి గురిచూస్తున్నావు...." ఆటం మెల్లమెల్లగా చెపుతున్నాడు.

రవీంద్ర మారు మాట్లాడకుండా అతను చెప్పినట్లల్లా చేస్తున్నాడు. కుడిచేతి లోనికి అక్కడి టేబిల్ మీదున్న రివాల్వర్ తీసుకున్నాడు. దూరంగా మైదానంలో నిల బెట్టివున్న చెక్కబోర్డుకి గురి చూశాడు.

"ట్రిగర్ నొక్కుతున్నావు...." అన్నాడు ఆటం.

రవీంద్ర కుడిచేతి చూపుడువేలు సేఫ్టీకేచ్‌ని తప్పించి ట్రిగ్గర్ మీద సుతారంగా నొక్కింది. తన ప్రమేయం లేకుండానే అంతా జరిగిపోతోంది. ఇదివరలో తను రివాల్వర్ యెన్నడూ ముట్టలేదు. షూట్ చెయ్యలేదు. గన్ షూటింగ్ మాత్రం తెలుసు. ఎన్. సి. సి.లో నేర్చారు.

అసంకల్పితంగా తనిలా ప్రవర్తిస్తున్న విషయంకూడా అతని మనసుకి తాకటంలేదు. అతని చేతులు మెదడు యిచ్చే ఆజ్ఞల ప్రకారం పనిచేస్తున్నాయి. ఆ మెదడును పనిచేయిస్తున్న వ్యక్తి వేరే. అతను ఆటం.

బుల్లెట్ సరాసరిపోయి టార్గెట్‌ని తాకింది. సర్ మంటూ గాలిని కోసిన చప్పుడు! బుల్లెట్ రివాల్వర్ నించి వెలువడినప్పుడు వచ్చిన అదురుకు కొంచెం జంకాడు రవీంద్ర! అయినా అది తాత్కాలికం! మళ్ళీ అతని మెదడు ఆటం స్వరానికి అనుగుణంగా పనిచేస్తూనేవుంది.

గుండు టార్గెట్‌ని తాకగానే చప్పట్లు కొట్టాడు ఆటం.

"గుడ్, వెరీ గుడ్! నువ్వు నాకు నచ్చావు. ఇది ఈ రోజు మొదటి పాఠం. రెండో పాఠం రేపు చెపుతాను. నువ్వు హాయిగా రెస్టు తీసుకో! మధ్యాహ్నం భోజనం గదిలో సిద్ధంగా వుంటుంది. భోంచేసి సుఖంగా నిద్రపో!" అన్నాడు ఆటం.

ఆటం స్వరంలో చెప్పుకోదగ్గ మార్పు కనబడుతోంది రవీంద్రకు. ఇంత సేపు ఆజ్ఞలు జారీచేసిన కంఠానికి యీ కంఠానికి బేధం కన్పిస్తోంది. ఇంతవరకు అతని స్వరంలో ఆదోరకమైన అధికారయుతమైన కమాండ్ వుంది. ఫ్రీక్వెన్సీ వుంది. ఇప్పుడు అతిమామూలుగా మార్దవంతో నిండి, అభిమానంతో తొణికిసలాడుతోంది.

రవీంద్ర అరనిమీలిత నేత్రాలు మామూలుగా విచ్చుకున్నాయి. అంతక్రితం తనేం చేసిందీ ఎంత ప్రయత్నించినా గుర్తురావటం లేదు.

ఆటం చెప్పినట్టే అతను చూపించిన దిశకు నడిచి గదిలో ప్రవేశించాడు. ఇప్పుడు గదికి తలుపులున్నాయి. పైన గోడలో అమర్చిన వెంటిలేటర్సున్నాయి. వాటిలోంచి సూర్యకిరణాలు సూటిగా గదిలో పడుతున్నాయి.

మధ్యాహ్న మార్తాండుడు నిప్పులు చెరుగుతున్నాడు.

## 9

ఉజ్వల ఆయాసంతో రొప్పుతూంది. అయినా పరుగెత్తటం మానలేదు.

ఒక దశలో ఆమె వాళ్ళకు దొరికిపోయేదే! కానీ, ఆమెని ఒడిసి పట్టుకోబోయిన కుర్రాడు ఓ బండరాయికి కాలు కొట్టుకుని అమాంతం ముందుకు విరుచుకు పడిపోయాడు. వాడిని పరామర్శించటానికి తక్కిన ముగ్గురు ఆగారు.

ఆ కొద్దిక్షణాలని ప్రాణ మాన రక్షణకు చాలా చురుగ్గా ఉపయోగించుకుంది ఉజ్వల. కొండకి ఓ పక్కగా మరుగ్గా వున్న ప్రదేశంలో తలదాచుకుంది. అక్కడినుంచి చూస్తే మైదానంలో కొండ పరిసరాల ప్రాంతమంతా కనిపిస్తోంది. బయటివాళ్ళకు మాత్రం తను కనపడే అవకాశం లేదు. అక్కడే నిలబడి బండకు చేరగిలబడి అలుపు తీర్చుకో సాగింది.

గుండె దడ కొంచెం తగ్గింది. అక్కడినుంచి వేట కుక్కల్ని తొంగిచూసింది. కిందపడ్డవాడికి చాలా పెద్ద దెబ్బ తగిలింది. లేవలేకపోతున్నాడు. వాడికి తక్కిన వాళ్ళు సాయంపట్టి పక్కగా కూచోబెడుతున్నారు.

ఇంకాసేపటికి వాళ్ళంతా ఆ కొండ ప్రాంతమంతా ప్రతి సెంటిమీటరూ వెతికి తన అంతు చూసేస్తారు. అది చెప్పుకోదగ్గ సురక్షిత స్థలం కాదు! కాసేపటికో! గడియకో వాళ్ళచేతిలో చిక్కక తప్పదు.

ఉజ్వల మెదడు చాలా వేగంగా పని చేస్తోంది.

వాళ్ళు దెబ్బతిన్న కుర్రాడ్ని వదిలి పైకి లేచారు. డేగ చూపులు చుట్టూ సారిస్తున్నారు. ఇంకాసేపట్లో తన ఉనికి తెలుసుకుంటారు. తనని సర్వనాశనం చేసేస్తారు. ఈలోపలే తను ప్రాణం తీసుకోవాలి. అంతకన్న గత్యంతరం లేదు!

ఆమెకు చటుక్కున అనుమానం వచ్చింది — తన బావని వీళ్ళే ఏమైనా చేశారేమో! రవీంద్ర బలహీనత వీళ్ళకు తెలుసు. వుత్తరం వీళ్ళే రాసి అతన్ని యీ కొండ దగ్గరకు వచ్చేలా ఏర్పాటుచేసి, చాటున దాక్కుని బావ రాగానే ఈ లోయల్లోకి నెట్టేసివుంటారు!

ఈ ఆలోచన రాగానే ఆమె గుండె ఓ క్షణం ఆగి,

మళ్ళీ విపరీతంగా కొట్టుకోసాగింది! అదే జరిగుంటుంది. తనకోసం వాళ్ళు గోతుల్లో గుంటనక్కల్లా నక్కి-దాక్కున్న సంఘటన గుర్తుకు తెచ్చుకుంది.

బాధ లేకపోయాక తను బతికినా చచ్చినా ఒకటే! ఈ దుర్మార్గుల చేతుల్లో అవమానంపొంది చచ్చేకంటే ముందుగానే ఆత్మహత్య చేసుకు చావటం మేలు!

ఉజ్వల అటు ఇటు చూసింది. వాళ్ళు ఇటే వస్తున్నారు! పక్కగా లోయలు, బండరాళ్ళు. ఒక్క గంతు వేస్తే చాలు, ఈ జీవితంనించి శాశ్వతంగా పరిష్కారం లభిస్తుంది!

ఉజ్వల బండపక్కనుంచి లోయలవైపు నడిచింది. ఆమె చేయి అనుకోకుండా బండమీద ఓ స్థలంమీద తగిలింది. అప్పుడో అద్భుతం జరిగిపోయింది.

అంతవరకు తను చేరబడివున్న బండ, బండమాత్రమే కాదని, అదో రహస్య సొరంగానికి తలుపులా వుపయోగపడిందనీ, దానికో స్విచ్ లాంటి మీట అమర్చబడివుందనీ, తను అనుకోకుండా దాన్ని నొక్కాననీ ఆమె గ్రహించే లోపలే ఆమె ద్వారం లోపల్నుంచి తూలి పడిపోవటం, బండనున్న రహస్య ద్వారం తిరిగి మూసుకుపోవటం చాలా వేగంగా జరిగిపోయింది.

## 10

సాయంత్రం కావటం, చీకటిపడటం, రాత్రి భోజనం అకస్మాత్తుగా గదిలోని టేబిల్ మీద ప్రత్యక్షంకావటం అన్నీ ఓ క్రమ పద్ధతిలో జరిగిపోతూనే వున్నాయి.

రవీంద్ర ఆటం గురించే ఆలోచిస్తూ భోంచేస్తున్నాడు. ఆటం తనని ఇక్కడికి తీసుకొచ్చిన కారణం తనకి ఇప్పటికీ అర్థంకాలేదు—అయితే అతనికి తనతో ఏదో ముఖ్యమైన

పనే వుంది. తనలాంటి తక్కిన ముప్పయిమందితోను అలాంటి పనులే ఏవో వున్నాయి. అయితే ఏమిటా పని?

ఆటం అతిథి మర్యాదల్లో చాలా భారీగానే ఏర్పాట్లు చేస్తున్నాడు—చక్కటి విందు భోజనాలు, పానీయాలు, మాంసాహార భక్ష్యాలు — చాలా ఘనంగానే పంపిస్తున్నాడు.

అవి సుష్టుగా తిని తనకు మత్తుగా నిద్రపట్టేస్తోంది. కాలం యెలా గడుస్తోందో కూడా తెలియటంలేదు. తను ఇక్కడికొచ్చి చాలా రోజులయిపోయినట్టుంది. కాని నిజానికి నిన్న మధ్యాహ్నమే తను దేగలకొండ వినాయక్‌తో వచ్చాడు. ఇక్కడ ఓ రాత్రి, మరో పగలు గడిచిపోయాయి. ఇది రెండో రాత్రి.

రవీంద్ర మనసు కాసేపు మామయ్య వాళ్ళింట్లోని మనుషుల గురించి, ముఖ్యంగా ఉజ్వల గురించి ఆలోచిస్తోంది. తన అంతర్ధానం గురించి వాళ్ళంతా ఏం ఆందోళన పడుతున్నారో....? ముఖ్యంగా తనిని చూడకుండా కొన్ని గంటలు కాలేజీలో గడపటానికే మహా యిబ్బంది పడిపోయే ఉజ్వల దాదాపు రెండు రోజులు ఎలా గడిపిందో? తనేమయిపోయాడనుకుంటున్నారో?"

వినాయక్ ఉజ్వలతో నిజం చెప్పి వుంటాడా? బహుశా చెప్పడు! తనతో వాడున్నట్టు అందరికీ తెలిసే అందరూ వినాయక్ తనని యేమో చేశాడని అనుమానించే ప్రమాదముంది. అందుకే చెప్పడు.

అతను చెప్పకపోతే ఉజ్వలకుగాని, మామయ్య వాళ్ళకుగాని తన ఉనికి తెలియదు. తనని ఇక్కడినుంచి తప్పించేవాళ్ళెవరూ వుండరు. ఆటం దయతలచి తనని

వదిలిపెట్టేవరకు తనని రక్షించే దిక్కు లేదు! ఈ ఆటం తనని అంత సులువుగా వదిలిపెడతాడా? ఏమో, చెప్పటం కష్టం!

ఆలోచనల్లోనే భోజనం పూర్తయింది.

రవీంద్ర పక్కమీద నడుం వాల్చాడు.

"మైడియర్ యంగ్ మాన్!" ఆటం కంఠం ఎక్కడి నుంచో వినిపించింది. ఉలిక్కిపడి లేచికూచున్నాడు రవీంద్ర—

"యస్సార్!" అన్నాడు యాంత్రికంగా.

"సుఖంగా నిద్రపో! రేపు ఉదయం రెండో పాఠం మొదలు పెడతానన్నానుకదా! అందుకు నీకు ఇప్పటినుంచీ పూర్తి విశ్రాంతి అవసరం.... గుడ్ నైట్!" అని వినిపించింది ఆటం కంఠస్వరం.

రవీంద్ర కొద్ది నిమిషాల్లోనే గాఢంగా నిద్రపోయాడు.

తెల్లవారింది. మళ్ళీ ఏర్పాట్లన్నీ మామూలే!

అతను టిఫిన్ కార్యక్రమం ముగించుకునేసరికి ఆటోమాటిక్‌గా తలుపులు తెరుచుకున్నాయి. రవీంద్ర లేచి బయటికి వచ్చాడు.

ఎదురుగా కాన్ఫరెన్స్ హాలు. అప్పటికే ఒకరొకరు అక్కడికి చేరి కూచుంటున్నారు టేబిల్ దగ్గర కుర్చీల్లో.

ఆటం రావటం ఒకరొకర్ని వాళ్ళకి అప్పగించిన పనుల గురించి వివరణ అడగటం, వాళ్ళు ఉచితరీతిన సమాధానం చెప్పి వెళ్ళిపోవటం, తనొక్కడే గదిలోమిగలటం అన్నీ నిన్నటిమాదిరిగానే జరిగిపోయాయి.

రవీంద్ర ప్రేక్షకుడిలా చూస్తూ ఉండిపోయాడు. అసలు వాళ్ళకి అప్పగించబడ్డ పనులేమిటో, వాళ్ళు ఏం సాధించామని చెపుతున్నారో ఏమీ అర్థంకాలేదు.

బహుశా వాళ్ళలో రెండోవాడి కూడా తక్కిన వాడు యేం పని చేస్తున్నాడో తెలీదేమో! అలాగేవుంది వాళ్ళ ప్రవర్తన! ఒకరితో ఒకరు మాట్లాడుకోవటంగాని, పలకరించుకోవటం గాని యేమీ లేదు. కీ యిస్తే వచ్చి పనులు చేసి పోయే మర బొమ్మల్లా పని చేస్తున్నారు వాళ్ళు.

ఆటం రవీంద్ర ఆలోచనల్ని కనిపెట్టినట్టు నవ్వాడు.

"నువ్వేం ఆలోచిస్తున్నావో నాకు తెలుసు. వీళ్ళు యేం పనులు చేస్తున్నారని కదూ నీ అనుమానం! త్వరలోనే అన్ని సంగతులూ నీకు అర్థమవుతాయి. ఈ లోపల నీ పాఠాలు పూర్తికావాలి కదా! ఇవాళ రెండో పాఠం చెపుతానన్నాను కదూ, సిద్ధంగా వున్నావా?" అన్నాడు ఆటం.

"ఎస్సర్!" అన్నాడు రవీంద్ర. అతని గొంతు అతనికే వింతగా ధ్వనిస్తున్నట్టనిపించింది.

"అయితే శ్రద్ధగా విను...." అన్నాడు ఆటం.

రవీంద్ర వింటున్నాడు.

## 11

చాలాసేపటివరకు తానెక్కడుందో గుర్తు తెలీలేదు ఉజ్వలకు. కళ్ళు చీకటికి అలవాటు పడ్డాక కొద్ది కొద్దిగా కనిపించసాగింది, లోపల యేదో సొరంగంలాగా వుంది. ఎక్కడినుంచో సన్నటి వెల్తురు పడుతోంది.

ఉజ్వల లేచి నిల్చుంది.

ఓ ప్రమాదంలోంచి మరో ప్రమాదంలో యిరుక్కున్నట్టనిపించింది.

ఉజ్వల నెమ్మదిగా వెలుగు వస్తున్నవైపు అడుగులు వేస్తోంది. గుండె దిటవుపరచుకొంది. తాత్కాలికంగా ఆ

దుర్మార్గుల బారి నుండి తప్పినందుకు రిలీఫ్‌గా వుంది. ఇక్కడి పరిసితులు తనకు వ్యతిరేకంగా పరిణమి స్తే ఆత్మ త్యాగం చేసుకోవటానికి తను సిద్ధంగానే వుంది!

ఉజ్వలకు ఎక్కడలేని మొండిధైర్యం వచ్చేసింది. అడుగులు మరుగ్గా ముందుకు పడ్డాయి.

ఒక యిరుకు గది. అది గదికాదు. పొడవైన నడవా. వరండాలా వున్న ఆ నడవాలో గుడ్డి వెలుతురు పడు తోంది. ఆ వెలుతురులో ఉజ్వల తెలిగ్గానే నడవగలుగు తోంది.

ఆ నడవాలో గదుల వెనుక భాగాలు కనిపిస్తు న్నాయి. వెనుకపక్కన గాలి రావటానికి పెట్టిన వెంటి లేటర్లు బయటకి కనిపిస్తున్నాయి. ఆమె తలకి సమాంత రంగా వున్న వెంటిలేటర్స్ నుంచి లోపలికి తొంగి చూసింది. సరిగా కనిపించలేదు. కాళ్ళపై నిక్కి చూసింది. లోపలి దృశ్యం ఆమెకి యేమీ అర్థంకాలేదు. ఎవడో పిచ్చివాడు చేస్తున్న చేష్టల్లా కనిపించా యామెకు.

లోపల ఓ యిరవయ్యేళ్ళ లోపు యువకుడు గదిలో అటు యిటు పచార్లు చేస్తున్నాడు. కాసేపు ముందుకి కాసేపు పక్కకి, మరోసారి వెనకకి నడుస్తున్నాడు. చేతుల్లో గాల్లో ఏదో విసురుతున్నాడు.

చేతుల్లో యేమీ లేదు. ఏదో అస్పష్టంగా ఉచ్ఛరిస్తు న్నాడు.

ఎక్కడినుంచో గదిలోకి మాటలు వినిపిస్తున్నాయి. ఆ మాటల్ని ఆ కుర్రాడి చేష్టలకి అన్వయించుకుంది. అప్పుడు ఆ కుర్రాడి చేష్టలు అర్థవంతంగా కనిపించాయి. ఆ మాటల్నిబట్టే ఆ కుర్రాడు ప్రవర్తిస్తున్నాడు. అయితే

ఆ మాటలు యెక్కడి నుంచి వస్తున్నాయి. ఆమెకి ఎంత ఆలోచించినా అంతుబట్టలేదు.

ఆ తర్వాత మరి కాస్త ముందుకి సాగింది. మరో గది లోంచి యేవో కేకలు వినిపిస్తున్నాయి. ఆసక్తిగా తొంగి చూసింది. లోపల ఓ యువకుడు మరబొమ్మలా గుండ్రంగా తిరుగుతున్నాడు. అతని చేతిలో యేదో ఆయుధం వుంది. దానితో తన యెదురుగా వున్న గడ్డిబొమ్మను ఎన్నిసార్లో పొడుస్తున్నాడు ఆదేపనిగా.

ఇక్కడ కూడా గోడ లోపల్నుంచి ఏవో మాటలు వినిపిస్తున్నాయి. ఆగమంటే ఆగుతున్నాడు. పొడవ మంటే పొడుస్తున్నాడు. ఆ మాటలకి అనుగుణంగానే ప్రవర్తిస్తున్నాడు.

ఉజ్వలకు కొంచెం అర్థమయింది విషయం. ఎవరో వ్యక్తి వీళ్ళకు ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు. ఆ ఆజ్ఞలని ఈ వర్రాళ్ళు అక్షరాలా అమలుజరుపుతున్నారు. చూడగా యీ రెండు గదుల్లోనూ వినిపించిన స్వరం ఒకేలాగా వుంది. ఒకే వ్యక్తి ఏకకాలంలో యిద్దరికీ ఆజ్ఞలు జారీ చేస్తున్నాడా?

ఉజ్వల సాలోచనగా అడుగులు ముందుకు వేసింది. ఈ అడవిలో భూగృహం, భూగృహంలో వ్యక్తులు వింతగా తోచింది ఆమెకు.

ఆ నడవా చాలా పొడువుగా వుంది. బయిటికి చాలా వెంటిలేటర్సు కనిపిస్తున్నాయి. అంటే అన్ని గదులు నడవాపొడువుకీ వున్నాయా....? యేమో, చూడాలి— అనుకుంది.

మూడో గది వెంటిలేటరు నించి లోపలికి తొంగి చూసింది. తక్కిన రెండింటి కన్న యిది కొంత భిన్నంగా

కనిపించిందా మెకు.

గదిలో ఓ యువకుడు ఓ టేబిల్ ముందు కూచుని వున్నాడు. అతని చేతిలో కొన్ని వైర్లు, పనిముట్లు వున్నాయి. వాటితో టేబిల్ మీదున్న ఓ మరబొమ్మకు ఏదో రిపేరు చేస్తున్నాడు. మరబొమ్మ తల భాగంలో ఆ వైర్లు కలిపి, వైర్లని కరెంటు ప్లగ్ పిన్నుకి కనెక్టునిస్తున్నాడు. టేబిల్ మీదున్న ఓ పరికరంలో సన్నటి మెరుపులు ఎగుడు దిగుడుగా పయనిస్తూ సన్నటి ధ్వని తరంగాన్ని ప్రసారం చేస్తున్నాయి. ఈ గదిలో కూడా మాటలు వినిపిస్తున్నాయి — తక్కిన గదుల్లో లాగానే. ఆ మాటల్ని ఫక్తు అనుసరిస్తూ పని చేసుకుపోతున్నాడా యువకుడు.

ఆ తర్వాతి గదుల్లో కూడా ఆమెకు యెన్నో వింత దృశ్యాలు కనిపించాయి. ఓ యువకుడు రివాల్వర్ ని గురి చూసి కాలుస్తున్నాడు. రివాల్వర్ నుండి గుళ్ళు రావటం లేదు. సన్నటి నిప్పురవ్వలు వస్తున్నాయి. అలాగే మరో గదిలో యింకో యువకుడు పెద్ద పెద్ద బౌండు పుస్తకాల్ని ముందేసుకుని వాటిలో నుండి యేవో విషయాలు వేరే పుస్తకంమీద కాపీ చేస్తున్నాడు.

ఇంకో యువకుడు కాళ్ళు పైకెత్తి తలమీద శీర్షాసనం వేసినట్టు ఆసనం వేసి తలతో నడుస్తున్నాడు. మరో యువకుడు కాన్వాసుమీద రంగులు పులిమి వింత వింత బొమ్మలు సృష్టిస్తున్నాడు. ఆ తర్వాత గది ఖాళీగా వుంది.

ఉజ్వల కిదంతా చూస్తూంటే ఏదో పిచ్చివాళ్ళ లోకంలో తిరుగుతున్నట్టనిపించింది. అయితే ఆమె గమనించిన విషయమేమంటే, ప్రతిగదిలోను ఒక్కో యువకు

డున్నాడు. అందరూ దాదాపు పద్దెనిమిదీ-యిరవయి ఏళ్ళ మధ్య యువకులే! అందరూ గోడలలోపల్నుంచి విని పిస్తున్న ఆజ్ఞల ప్రకారం పని చేస్తున్నారు.

అయితే అన్ని గదుల్లోనూ ఒకేసారి ఆ మాటలు ఎలా వినిపిస్తున్నాయి? ఆ మాటల తాలూకు మనిషి ఒక్కడే! ఒకే వ్యక్తి ఏక కాలంలో యింతమందికి ఆజ్ఞలు యెలా జారీ చేస్తున్నాడు? ఒక నిర్ణీతమయిన స్థలంలో మైక్రో ఫోన్ల ద్వారా ఆజ్ఞలు పంపటానికి కవకాశముంది. కాని, అవన్నీ ఏకకాలంలో వినిపించటం కష్టం! ఒకర తర్వాత ఒకరికి ఆజ్ఞలు పంపవచ్చు. కానీ ఒకేసారి అందరికీ....

ఉజ్వలకి సమస్య విడిపోయింది. ఈ ఆజ్ఞలు జారీ చేస్తున్న వ్యక్తి ఒకడే. సందేహం లేదు. అయితే ఏక కాలంలో ఆజ్ఞలు పంపడంలేదు. ఒకేసారి రికార్డు చేసి, ఆ రికార్డుని ప్రతి గదిలోను మైక్రోఫోన్లో వినిపించటానికి యేర్పాటు చేసివుంటాడు.

ఉజ్వల తన విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానికి తనని తను మెచ్చు కుంది. అదే అయివుంటుంది. ఆ ఆజ్ఞలు బహుశా టేప్ చేసి అన్ని గదులకి అన్ని టేప్ రికార్డర్ల మీద ప్లే చేస్తు న్నాడు. ఆ ఆజ్ఞలకి బద్ధులై ఆ యువకులు ప్రవర్తిస్తు న్నారు.

అంటే, తన స్వరానికి వాళ్ళు కట్టుబడేటట్టు చేస్తు న్నాడు. అంటే వాళ్ళ మెదడుని తన కంఠస్వరంలోని ఫ్రీక్వెన్సీ అనువుగా మార్చుకుంటున్నాడన్నమాట.

అదెలా సాధ్యం?

ఉజ్వల మెదడు చాలా చురుకుగా పనిచేస్తోంది. వారంరోజుల క్రితం తను చూసిన ఓ ప్రొఫెసర్ గారి హిప్నాటిజం ప్రదర్శన గుర్తొచ్చింది. అందులో ఆ ప్రొఫె

సర్ కొంతమందిని హిప్నటైజ్ చేసి, వాళ్ళను తనకు అనుకూలంగా మార్చుకుని, తను చెప్పినట్లు వాళ్లు అనుసరించేలా చేశాడు. అదీ కొద్ది నిమిషాలే! చాలా వినోదాత్మకమైన ప్రదర్శన! ఎంతో విజ్ఞానదాయకంగా గడిచింది.

హిప్నాటిజం ద్వారా ఎన్నో మంచిపనులు సాధించవచ్చునని, కొన్ని దీర్ఘవ్యాధుల్ని నయం చేయవచ్చుననీ చెప్పి ప్రొఫెసర్ తన షో ముగించాడు.

అయితే, ఈ యువకులందర్నీ యెవరో హిప్నటైజ్ చేస్తున్నారన్నమాట! ఏమాశించి చేస్తున్నట్టు? ఎవరో లోక వినాశానికి ఈ యువకుల్ని తర్ఫీదిచ్చి నియోగించబోవటంలేదుకదా—అనిపించిందామెకు. తను చూసిన వాళ్ళంతా చాలా భయంకరమైన పనులు చేస్తున్నారు. నిస్సందేహంగా ఇదేదో వినాశకరమైన శక్తుల పనే అయుండాలి!

ఆమె అనుమానం మరికొద్ది క్షణాల్లోనే నివృత్తి అయిపోయింది. ఆమె చివరిగా చూసిన గది చాలా పెద్దది. ఎన్నో వెంటిలేటర్స్ అమర్చబడివున్న పెద్ద హాలు. హాల్లోకి తొంగిచూసిన ఉజ్వల కళ్ళు చెదిరిపోయాయి. గుండె వేగం హెచ్చింది.

లోపల చాలామంది సైంటిస్టులున్నారు. లెక్కపెట్టలేనన్ని టేబిల్సు. వాటిమీద రకరకాల ఏసిడ్సు, బీకర్లు, గంటజాడీలు, పరీక్షనాళికలు, రసాయనాలు వున్నాయి. వాటిముందు కూచుని ప్రయోగాలు చేస్తున్నారు ఆ సైంటిస్టులు.

అయితే లోపల చాలా ప్రశాంతంగా వుంది. సూది కిందపడితే వినిపించేటంత నిశ్శబ్దంగా వుంది. ఎవరిముటుక

వాళ్ళు తమ ప్రయోగాలు మానంగా యాంత్రికంగా చేసుకుంటూ పోతున్నారు. వారి పనులు చూడటానికి సిద్ధంగా కొంతమంది పక్కన నిల్చుని వున్నారు.

ఓ పక్కగా గోడలకు పేర్చిన ఏవో పెట్టెలు లాగా వున్నాయి. వాటిమీద 'ఎక్స్‌ప్లోజివ్స్' అని ఇంగ్లీషులో రాయబడివుంది. అంటే అవన్నీ ప్రేలుడు పదార్థాలో అయితే ఆ ప్రయోగశాలలో తయారవుతున్నవన్నీ ప్రేలుడు పదార్థాలా, అంటే బాంబులా?

ఆ విషయం తెల్చుకోగానే ఉజ్వల గుండె లయ తప్పింది. ఎంత ఘోరం! ఊరి చివరగా కొండల్లో వున్న ఈ రహస్య స్థావరంలో పెద్ద ఎత్తున మందుగుండు సామాను రహస్యంగా తయారవుతోంది. ఓ పక్క అన్నెం పున్నెం ఎరగని యువకులు హిప్నటైజ్ చేయబడి భయంకర పనులు కోసం తర్ఫీదివ్వబడుతున్నారు.

ఇదంతా చేయిస్తున్న దెవరు? స్వదేశీయులా, విదేశీయులా?

ఉజ్వల రక్తం సలసల మరిగింది. ఆమె నరనరాన మాతృదేశంమీది భక్తి మమకారం పొంగి పొరలింది. ఈ నరరూప రాక్షసుల ఆట కట్టించాలి! వెంటనే వెనక్కి పోయి ఈ సంగతి పోలీసులకి ప్రభుత్వానికి తెలియచెయ్యాలి! ఈ రాక్షసుల ప్రయత్నాల్ని భంగం చెయ్యాలి!

ఉజ్వలకి ఆ క్షణంలో తన బావ విషయంగాని, తన క్కడికి ఎలా వచ్చిందన్న విషయంగాని, ఆ విష వలయంలో నుంచి యెలా తప్పించుకోగలనని గాని—ఇవేవీ మనసుకి తోచలేదు. దేశ సమస్యముందు తన స్వంత సమస్య ఏ పాటిది—అనిపించిందామెకు.

అయితే ఆమె అనుకున్నట్టు జరగలేదు. ఆమె వెంటి లేటరునించి తొంగిచూడటం ఓ కావలివాడు కనిపెట్టే కాడు. యెందుకో తలపైకెత్తిన వాడిచూపులకి ఉజ్వల విశాల నేత్రాలు కన్పించాయి.

"ఎవరది?" అని అరిచాడు.

ఒక్కసారిగా ఆ నిశ్శబ్ద వాతావరణంలో చిన్న కల కలం చెలరేగి పెద్దదయింది.

ఉజ్వల యేమాత్రం ఆలస్యం చెయ్యకుండా వచ్చిన తోవనే నడవలో వెనక్కి పరుగెడుతూ వాళ్ళకి కని పించకుండా తప్పించుకోవాలని ప్రయత్నించింది. కాని నడవా చాలా పొడవుగా వుంది. ఆమె ప్రయత్నం ఫలించేలోపలే వెనకనుంచి యెందరో వ్యక్తులు పరు గెడుతూ వచ్చి ఆమెని పట్టుకున్నారు.

## 12

"ఇలా నా కళ్ళల్లోకి చూడు యేం కనిపిస్తుంది?" అడిగాడు ఆటం.

"ఏమీ కనిపించటంలేదు" అన్నాడు రవీంద్ర.

"ఇంకా దీక్షగా చూడు. తెల్లగుడ్డు కన్పించటం లేదూ?"

"లేదు!"

"నల్ల పాప!"

"లేదు."

"ఎర్ర జీర?"

"ఉహూ!"

"వెరీగుడ్! ఇంకా దీక్షగా చూడు."

"ఏవో పర్వతాలు, లోతైన సముద్రాలు కనిపి స్తున్నాయి. యేదో హోరు విన్పిస్తోంది."

"సక్సెస్! నిన్న...." అని ఆటం ఏదో అనేలోపల నలుగురు వ్యక్తులు ఉజ్వలని పెడరెక్కలు విరిచి తెచ్చి అతని ముందుంచారు.

ఆటం నివ్వెరపోయి చూశాడు.

రవీంద్ర చూపులు నిశ్చలంగా వున్నాయి. ఎటో చూస్తున్నాయి. అక్కడ ఆటం, తను తప్ప మరెవరూ అతని దృష్టికి అందటంలేదు.

"ఎవరీ పిల్ల? ఇక్కడికెలా రాగలిగింది?" హుంకరించాడు.

"ఏమో! బాస్! మన ప్రయోగశాల దగ్గర లోపలికి తొంగిచూస్తుంటే పట్టుకుని తెచ్చాం."

"ఏయ్, ఎవరు నువ్వు?" ఆటం ఉజ్వలకి అతి సమీపంగా వచ్చి గుడ్లురిమాడు.

అప్పుడు చూసింది ఉజ్వల రవీంద్రను.

"బావా!" అని అరిచింది పిచ్చి ఆనందంతో.

రవీంద్ర ఉలకలేదు, ప ల క లే దు. మరబొమ్మలా నిల్చుండి శూన్యంలోకి చూస్తున్నాడు.

ఆటంకి కొంత అర్థమయింది, కొంత అర్థంకాలేదు.

"బావా! బావా!" మళ్ళీ మళ్ళీ పిలుస్తూ రవీంద్రని కుదుపుతోంది ఉజ్వల.

రవీంద్రలో చలనంలేదు.

ఆటంకి అనుమానం రేకెత్తింది. ఈ పిల్ల రవీంద్ర అనబడే ఈ కుర్రాడి మరదలా? ఇక్కడికెలా వచ్చింది?

రవీంద్ర దగ్గరగా వచ్చాడు.

"చూడు, నా కళ్ళలోకి మరోసారి చూడు. నల్ల పాప కనిపిస్తోంది. అవునా?" అన్నాడు ఆటం.

రవీంద్ర తలూపి, "అవును, కనిపిస్తోంది."

"తెల్ల పాప?"

"ఊఁ! అది కూడా."

"ఎర్ర జీరలు?"

"కనిపిస్తున్నాయి."

"నీ పేరు?"

"రవీంద్ర!"

"గుడ్! ఈ పిల్ల యెవరో చూడు!"

రవీంద్ర అప్పుడే ఈ లోకంలోకి వచ్చినట్టు చుట్టూ చూసి, "ఆఁ! ఉజ్వలా? నువ్వా? ఇక్కడికెలా వచ్చావు?" అన్నాడు.

ఉజ్వల ఏదో చెప్పేలోపల ఆటం అందుకుని, "ఎలా వస్తుంది? నువ్వే ఇక్కడికొస్తూ నీ మరదలతో చెప్పి వుంటావు. నువ్వు వెంటనే తిరిగిరాకపోతే నీ మరదల్ని వచ్చి ఈ ప్రాంతాల వెతకమని చెప్పివుంటావు. నువ్వు రాకపోవటంతో వెతుక్కుంటూ వచ్చింది. బహుశా నీతోనే తెచ్చి దూరంగా వుంచావు. మా స్థావరం చూసి వెనక్కి వెళ్ళిపోయింది. ఈ రోజు వచ్చింది" అన్నాడు.

రవీంద్ర పిచ్చిగా అరిచాడు! "నో, నేనెవరికీ చెప్ప లేదు. ఓ స్నేహితుడితో కలిసి వచ్చాను. కాని వాడు, నేను దేగలకొండ యెక్కేముందే వెనక్కి వెళ్ళి పోయాడు. ఈ స్థావరం చూసే అవకాశం అతనికిలేదు."

"అయితే యీ రివాల్వర్ తో ఈమెని కాల్చి చంపెయ్యి!" అన్నాడు ఆటం రివాల్వర్ రవీంద్ర చేతికిచ్చి.

రవీంద్ర నివ్వెరపోయి చూశాడు. కావాలంటే అతనే చంపెయ్యవచ్చుకదా, రివాల్వర్ తనకెందుకిస్తున్నట్టు?

"నువ్వు నిజంగా ఆమెకు ఏ విషయమూ చెప్పివుండక

పోతే నిస్సంకోచంగా ఆమెని కాల్చెయ్యి!" ఆటం మళ్ళీ చెప్పాడు.

రవీంద్ర నిస్సహాయంగా చూస్తోన్నాడు. ఉజ్వల బాబతంకే కళ్ళార్పకుండా చూస్తోంది.

ఆటం రవీంద్ర దగ్గరగా వచ్చాడు. అతని కళ్ళలోకి సూటిగా చూశాడు. "రివాల్వర్ అందుకో!" అన్నాడు.

రవీంద్ర రివాల్వర్ అందుకున్నాడు.

"గురిపెట్టు!"

రవీంద్ర అతను చెప్పినట్టే చేస్తున్నాడు. సేఫ్టీ కాచ్ తప్పించి ట్రిగ్గర్ మీద వేలు పెట్టాడు.

ఉజ్వల చాలా చురుగ్గా పనిచేసింది. ఒక్కసారిగా బోర్లా నేలమీద పడిపోయింది. రివాల్వర్ గుండు వెనక నించున్న ఓ అనుచరుడి భుజంలో నించి దూసుకుపోయింది.

ఉజ్వల అనుచరుడి చేతిలోనించి రివాల్వర్ అందుకుని ఆటంకి గురిపెట్టింది—

"హాండ్సప్! ముందు బాబని నీ హిప్నటిజంనించి విడుదల చెయ్యి" ఆజ్ఞాపించింది ఉజ్వల.

తక్కిన అనుచరులు కదలబోతే "నిరాక్షిణ్యంగా మీ బాస్‌ని కాల్చేస్తాను. ఎవరూ కదలొద్దు" అన్నది ఉజ్వల.

ఆటం చేతులు పైకెత్తి రవీంద్ర ముందుకొచ్చి అతన్ని హిప్నటిజంనించి రిలీజ్ చేశాడు.

రవీంద్ర తన చేతిలోని రివాల్వర్ గట్టిగా పట్టుకున్నాడు. అతని చెయ్యి వొణుకుతోంది. హిప్నటైజ్ చెయ్యబడ్డప్పుడున్న ధైర్యం ఇప్పుడు లేదు. అయినా ఉజ్వలని చూసిన ఆనందంలో అతనికి వెయ్యి ఏనుగుల

బలం వచ్చింది.

ఈలోపల మరి కొంతమంది అనుచరులు అక్కడికి వచ్చి కలిశారు. వాళ్ళ చేతుల్లో గన్స్ వున్నాయి.

అయితే పరిస్థితి గమనించిన ఉజ్వల, రవీంద్ర ఆటంని కవర్ చేసేశా రప్పటికే! తన స్వశక్తి మీద, తన ఆటం బాంబులమీద, హిప్నటిజంమీద విపరీతమైన నమ్మకమున్న ఆటం, ఆయుధం చేతలేకుండా నిర్లక్ష్యంగా నిలబడిపోయి నందుకు తననితాను చాలాసార్లు నిందించుకున్నాడు ఆ దురదృష్ట క్షణంలో.

"ఎవరైనా పిచ్చివేషాలు వేస్తే నిర్దాక్షిణ్యంగా మీ బాస్‌ని కాల్చేస్తాం" అన్నాడు రవీంద్ర ఆటం అనుచరుల్ని ఉద్దేశించి.

"ఆటం! వాళ్ళందర్నీ ఆయుధాలు కింద పెట్టమను. ఎక్కడికీ కదలొద్దని చెప్పు. నీ స్థావరమంతా మాటల మయం. నీ మనుషులు మాటల జోలికిపోతే నీ గుండె రెండుగా చీల్చిపారేస్తాం. మాకెటూ ప్రాణాలమీద ఆశలేదు" అన్నాడు రవీంద్ర.

ఆటం ఆదేశాల ప్రకారం అనుచరులంతా నేలమీద ఆయుధాలు పారేసి చేతులు పైకెత్తేశారు.

ఆటం ఏ మాత్రం అవకాశం దొరికినా రవీంద్రని, ఉజ్వలని హిప్నటైజ్ చేద్దామని ప్రయత్నించాడుగాని వాళ్ళిద్దరు పొరపాటున కూడా అతని కళ్ళలో కళ్ళు కలపలేదు.

"బావా! నువ్వు ఇక్కడే ఈ మహానుభావుడ్ని కవర్ చెయ్యి. రెండు నిమిషాల్లో వస్తాను!" అన్నది ఉజ్వల.

ఆ మాటలు చెపుతూనే ఆమె తనుచూసిన యువకుల గదుల దగ్గరకు పరుగులు పెట్టి తలుపులు తట్టింది. లోపల

టేప్ వినిపించటంలేదు.

టకటక తలుపులు తెరుచుకున్నాయి. యువకులంతా బయటికొచ్చి వింతగా చూస్తున్నారు. ఇప్పుడు వాళ్ళ మీద ఆటం హిప్నటిజం పనిచెయ్యటంలేదని గ్రహించింది ఉజ్వల.

"అందరూ తప్పించుకుని పారిపోండి. అదిగో ఆదారి వెంట!" అని వాళ్ళకు దారి చూపించి, లాబరేటరీవైపు పరుగెత్తింది ఉజ్వల.

యువకులు హాల్లోకి పరుగెత్తుకుని వెళ్ళారు.

ఉజ్వల ప్రయోగశాలలోని సైంటిస్టుల్నికూడా ఆటం మాయంచేసి తెచ్చాడని గ్రహించింది. ప్రయోగశాలలోని సైంటిస్టులందర్నీ హెచ్చరించింది. బయటికి పారిపొమ్మంది. వాళ్ళందరూ లేచి పరుగులు పెట్టారు.

ఉజ్వల ప్రయోగశాలలోని 'ఎక్స్ప్లోజివ్స్'అని వున్న పార్సిల్సుని గురిచూసి కాల్చబోయి, అంతలోనే నాలిక్కరుచుకుని, ఓ పొడవాటి తాడుని భాస్వరంలోముంచి దాని చివరని ఆ పార్సిల్సుకి కలిపింది. అటు యిటు చూసింది. వెలుగుతున్న ఓ స్పిరిటు లాంపు కనిపించింది. దాంతో తాడు ఈ చివర అంటించింది.

భాస్వరంలో తడిసిన తాడు చిరచిరమంటూ కాల్తూపోసాగింది. ఓ అయిదు నిమిషాల్లో అది మందుగుండు సామానుకి తాకుతుందని ఆమెకు తెలుసు!

ఉజ్వల తిరిగి హాల్లోకి వచ్చేసరికి, అప్పటికే యువకులు, శాస్త్రజ్ఞులు అక్కడ గుంపుగా చేరారు. తలోకరూ తలో ఆయుధమూ చేతచిక్కించుకున్నారు.

"బయటికి దారి చూపించు!" అన్నాడు రవీంద్ర ఆటం నుద్దేశించి.

ఆటం మౌనంగా ముందుకు నడిచాడు. అతనికి అతి చేరువలోనే రహస్యమీటలున్నాయి. కాని అతని వెన్నుని నొక్కి వున్న రవీంద్ర రివాల్వర్ అతనికి హెచ్చరిక లాగా వెన్ను తట్టుతోంది. గత్యంతరంలేక గోడలో వున్న ఓ మీటను చూపించాడు.

ఉజ్వల ఆటంని మీట నొక్కనీకుండా ఆపి, "ఆ విషయం మేం చూసుకుంటాం. నువ్వు అలాగే నిల్చో!" అన్నది.

ఆటం ఆగిపోయాడు.

ఉజ్వలమీట పక్కనున్న యిండికేటర్ చూసింది. పైన ఏవైనా బోను తాలూకు చిహ్నాలున్నాయేమో పరిశీలించి, సంతృప్తిచెందాక మీట నొక్కింది.

ఆటం మోసం చెయ్యలేదు. నిజం మీటనే చూపించాడు.

"హుర్రియవ్!" అన్నది ఉజ్వల.

అందరు బిలబిలమంటూ ఆ ద్వారం లోపల్నించి బయటికి పరుగెత్తారు. అది దేగలకొండకి చేర్చి వున్న రహస్య బిలం తాలూకు బండరాయి.

చివరగా రవీంద్ర, ఉజ్వల బయటికి అడుగుపెట్టుండగానే లోపల్నుంచి పెద్ద విస్ఫోటం! చాలా పెద్ద పేలుడు ఒకేసారి సంభవించగానే దేగల కొండప్రాంతమంతా అదిరిపోయింది. బండలు గులకరాళ్ళలా లేచిపోయాయి. కొద్దిక్షణాల్లోనే రహస్య స్థావరమంతా బూగ్గయిపోయింది.

—:అయిపోయింది:—

# చిత్రమైనది విధి నడక

టెంపోరావ్

నాగేష్ ఎమ్మే పాసయ్యాడు. గత రెండేళ్ళుగా ఉద్యోగం కోసం అప్లైచేస్తూ మూడువందల ఇంటర్వ్యూలకు వెళ్ళాడు. కాని ఉద్యోగం రాలేదు.

ఇల్లు నడవడానికి తల్లి ఒంటిమీద వున్న నగలన్నీ కరిగిపోయాయి. వారం రోజులనుంచి తల్లి పదేపదే చెప్తోంది, "ఒరేయి, అమ్మడానికి ఇంక ఏమీ లేదురా! కూలి పనైనా చేసి నువ్వు ఇటుపైన ఇల్లు నడపాలి!"

"నువ్వు బెంగ పెట్టుకోకమ్మా! మనం చచ్చిపోం, ఏదో చేసి బతుకుతాం" అన్నాడతను ధైర్యంగా.

ఏం చేయాలా అని ఆలోచిస్తూ ఆనాటి సాయంత్రం నాగేష్ బజారువైపు వెళ్ళాడు.

మనియన్ స్టోర్సు ముందు అతను నిలబడ్డాడు. ఏదీ కొనాలనే వుద్దేశం లేదతనికి. జేబులో చిల్లర మాత్రం వుంది.

ఒకతను వేగంగా షాపు ముందుకవచ్చి యజమానికేసి చూశాడు. చేతిలో వున్న కాయితాన్ని యజమాని కిచ్చాడు.

"ఈ వస్తువులన్నీ మా ఇంటికి వెంటనే పంపండి. మొత్తం నాలుగొందలు లోపున వుంటుంది. మొదటి వారంలో డబ్బు మీ మనిషికిచ్చేస్తాను" అన్నాడతను.

"అలాగే సార్" అన్నాడు మనియన్ నవ్వుతూ.

నాగేష్ వాళ్ళ మాటలు విన్నాడు. ఏదో అతడి మెదడులో మెరిసింది. ఆలోచిస్తూ అతడు గోడ్డమ్మట నడవసాగాడు.

కొంతదూరం వెళ్ళేసరికి పద్మరాజు యెదురయ్యాడు. అతడు కూడా తనున్న సితిలోనే వున్నాడు. బి.ఎ. పాసయి నాలుగేళ్ళయింది. వుద్యోగంలేదు. తండ్రికి పిన్షను వస్తోంది. దానితో సంసారం సాగిపోతోంది.

"రాజా, యెందాకా?" అడిగాడు నాగేష్.

"నువ్వు కనిపించాక ఆ ప్రశ్న అనవసరం. అలాపోదాం పద!"

ఇద్దరూ రైలు పట్టాలవైపు నడిచారు. పద్మరాజు చేతిలో నల్లటి ప్లాస్టిక్ బాగ్ వుంది. పట్టాలకు దూరంగా గడ్డినేలమీద ఇద్దరూ కూర్చున్నారు.

పట్టాలకు ఇటూ, అటూ దూరంలో ఇళ్ళు వున్నాయి. నాగేష్ చూపు నలువైపులా వెళ్ళింది. జోలార్ పేట ఎక్స్ప్రెస్ వాళ్ళ పక్కనుంచి దూసుకుపోయింది.

"టైము ఆరు కావస్తోంది" అన్నాడు నాగేష్.

ప్రతిరోజూ అదే టైముకు ఆ ఎక్స్ప్రెస్ వెళ్తూ వుంటుంది.

"రమ్ తెచ్చాను. డోస్ వేద్దామా?" అడిగాడు

పద్మరాజు.

"ఎంత? యెలా సంపాదించావు?"

పద్మరాజు నవ్వాడు.

"పారిజాతం వైన్ షాపు వుందిగా! ఆ షాపులో వుండే సుబ్బు నా ఫ్రెండ్. పొద్దుట ఒకతను విస్కీ కొని వందరూపాయల నోటు ఇచ్చాడు. షాపులో చిల్లరలేక నన్ను కాపలా వుంచి సుబ్బు పక్క షాపుకు పరుగెత్తాడు. ఆ క్షణంలో హాఫ్ బాటిల్ రమ్‌తీసి పాంటుజేబులో దాచేశాను."

"విస్కీ కొట్టేయవలసింది!"

"సమీపంలో రమ్ వుంది. దానితో తృప్తిపడ్డాను" అన్నాడు పద్మరాజు.

"రమ్ బెటర్ దెన్ నతింగ్!" అన్నాడు నాగేష్.

పద్మరాజు బాగ్ జిప్పర్ లాగి తెర్చాడు. హాఫ్ బాటిల్ హెర్క్యులస్ రమ్ తీసి కిందపెట్టాడు. రెండు గ్లాసులను పైకితీశాడు. నీళ్ళతో నిండిన ఒక బాటిల్ను బయట వుంచాడు.

"రాజా, నువ్వు అన్నీ సలక్షణంగా తెస్తావు! సిగరట్లో?"

"అవి మర్చిపోతానా?" అంటూ పాంటు జేబులోంచి ఛార్మినార్ ఫిల్టర్ పాకెట్, అగ్గిపెట్టె తీసి బయట పడేశాడు.

"యూ ఆర్ జీనియస్!" అర్చాడు నాగేష్.

బాగ్‌లోంచి మరో పాకెట్ తీసి పద్మరాజు బయట పెట్టాడు. లోపలున్న పకోడీలు బయటకు కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి.

"మెజీషియన్‌లా అన్నీ బయటకు లాగుతున్నావు. నీ

బాగ్ అక్షయపాత్రలా వుంది!" అన్నాడు నాగేష్.

రెండు గ్లాసుల్లో నాగేష్ రమ్ పోసి, బాటిల్ లోని నీళ్ళుపోశాడు. సూర్యుడు అస్తమించాడు. గడ్డి నేలమీద గ్లాసులు మెరుస్తున్నాయి.

"ఛీయర్స్!" అని ఇద్దరూ తాగటం ప్రారంభించారు.

ఇద్దరూ సిగరెట్లు వెలిగించారు. అప్పుడే గూడ్స్ ట్రెయిన్ పట్టాలమ్మట కదిలిపోతోంది.

చీకటిపడింది. ఇద్దరూ నిషాలో వున్నారు.

"రాజూ, డబ్బు గడించడానికి ఒక గొప్ప పద్ధతిని నేను కనుక్కున్నాను. నువ్వు నాతో చేర్తావా?" అడిగాడు నాగేష్.

"తప్పక చేర్తాను."

"అయితే, కమాన్ లెటస్ జాయిన్ హేండ్స్!" ఇద్దరూ చేతులు కలిపారు.

"మనం ఏం చెయ్యాలి?"

"నా ప్లాను మెదడులో వుంది. త్వరలో నీకు దాన్ని గురించి వివరంగా చెప్తాను. ప్రస్తుతం ఒకటి మాత్రం చెప్పగలను. ధైర్యంచేస్తేగాని డబ్బురాదు. మనం తెగించాలి."

"అది నాకు చెప్పాలా? నేను తెగించే ఈ రమ్ బాటిల్ కొట్టుకొచ్చాను."

గ్లాసులోని రమ్ తాగేసి అతడు బాటిల్ వంక చూశాడు. మరో బడా పెగ్ ఇద్దర్కీ వస్తుంది. నాగేష్ రెండు గ్లాసుల్లోనూ రమ్ పోశాడు. నీళ్ళు పోశాడు.

"రాజూ, అనుకోకుండా ఇవాళ హేపీగా సాగిపోతోంది. గుడ్ రమ్, సిగరెట్లు" అన్నాడు నాగేష్.

"మనం యెప్పుడూ ఇలాగే సుఖంగా బతకాలి!"

అన్నాడు పద్మరాజు.

చుట్టూ చీకటిగా వుంది. నాగేష్, పద్మరాజు వుషారుగా సిగరెట్లు వెలిగించారు.

"రాజూ, ఇవాళ పేదరికానికి గుడ్ బై చెప్పేస్తున్నాను. ఇటుపైన అది మన దగ్గరకు రాకూడదు!" అన్నాడు నాగేష్.

"గుడ్ బై" అన్నాడు పద్మరాజు.

గ్లాసులనూ, ఖాళీ బుడ్డీలనూ పద్మరాజు బాగ్ లో పెట్టి జిప్పర్ మూశాడు. ఇద్దరూ తూల్తూ లేచారు.

## 2

పద్మరాజు సైకిల్ని వేగంగా పోనిస్తున్నాడు. వెనుక కూర్చున్నాడు నాగేష్.

కొంచెం దూరంలో ముందుగా వెళ్తున్నాడు మనియన్ స్టోర్సు మనిషి రాజన్.

పద్మరాజు వేగంగా వెళ్ళి ముందు వెళ్తూన్న రాజన్ సైకిల్ని బలంగా ఢీకొట్టాడు. సైకిల్ రోడ్డువారకు మళ్ళి పక్కకు పడింది. రాజన్ సైకిల్ కింద వున్నాడు.

నాగేష్, పద్మరాజు చటుక్కున కిందకు దిగి అతడి వైపు వెళ్ళారు. సైకిల్ ని తీసి రాజన్ ని లేవదీశారు.

ఏదో రాయి తగిలి రాజన్ మోకాలు నుంచి రక్తం కారోంది.

"చూడకుండా సైకిల్ తొక్కుతున్నారు!" అర్చాడు రాజన్.

"లారీ మామీదకు వస్తుందేమో అని భయపడి పక్కకు తిప్పాను. నీ సైకిల్ అడ్డొచ్చింది" అన్నాడు పద్మరాజు.

"అయిందేదో అయింది. వెంటనే డాక్టర్ దగ్గరకెళ్ళి

బాండేజి వేయించుకో!" సలహా ఇచ్చాడు నాగేష్.

తన జేబులో వున్న కాయితాన్ని నాగేష్ రహస్యంగా తీయడం రాజన్ గమనించలేదు!

డాక్టర్ దగ్గరకు వెళ్ళడమా, వద్దా అని రాజన్ ఆలోచిస్తున్నాడు.

"అశ్రద్ధ చేయకు! డాక్టర్ దగ్గరకు వెళ్ళడం మంచిది" అన్నాడు నాగేష్.

సైకిల్ రాడ్ తగిలి రక్తం వచ్చి వుంటుంది. యాంటీ టిటానస్ ఇంజక్షన్ తీసుకోవడం మంచిది" అన్నాడు పద్మరాజు.

సైకిల్ని వెనక్కు తిప్పి రాజన్ వెళ్ళిపోయాడు.

తన చేతిలో వున్న కాయితాన్ని నాగేష్ పరీక్షగా చూశాడు. అనేకమంది పేర్లు, అడ్రెసులూ వున్నాయి. ప్రతి పేరుకూ కుడివైపున ఇవ్వవలసిన మొత్తం రాయబడివుంది.

"రాజూ, మనకు ఎక్కువ టైములేదు. వాడు తిరిగొచ్చేలోపల మనం పనిముగించాలి" అన్నాడు నాగేష్.

పద్మరాజు సైకిల్ యెక్కాడు. నాగేష్ వెనక కూర్చున్నాడు.

"మొదట రాజానగర్, రెండో వీధికి పద!" అర్చాడు నాగేష్ వెనుకనుంచి.

కాస్సేపట్లో ఒక యింటిముందు సైకిల్ ఆగింది. నాగేష్ దిగి ముందు గుమ్మంవైపు వెళ్ళి తలుపును తట్టాడు.

మధ్య వయస్సులో వున్న ఒక స్త్రీ తలుపు తెర్చింది.

"మనియన్ స్టోర్స్ అమ్మా! రామనాథంగారు వున్నారా?" అడిగాడు నాగేష్.

"మిమ్మల్ని ఆ స్టోర్స్‌లో నేను చూడలేదే!"

అందామె.

"నన్ను మీరు చూడకపోయినా మీరు నాకు బాగా గుర్తున్నారమ్మా."

"ఎంతివ్వాలి?"

"ఇదిగో చూడండి! 780-20" అన్నాడతను.

ఆమె లిస్టువైపు చూసింది. పైన మనియన్ స్టోర్ రబ్బర్ స్టాంపు ముద్రవుంది. ఆమె లోపలకు వెళ్ళింది. డబ్బును అతడికిచ్చింది.

"చూడండి, మేం లిస్టులో రాసిన డెట్ వాషింగ్ సోపులు యివ్వలేదు" అందామె.

"అవునమ్మా! పాకెట్ షాపులో వుంది. ఇటుపక్క వచ్చినపుడు తెచ్చి మీకిస్తాను" అని నాగేష్ పరుగెత్తు కెళ్ళి సైకిల్ వెనుక కూర్చున్నాడు.

పద్మరాజు సైకిల్ని తొక్కుకుపోయాడు.

"నాల్గో రోడ్డుకు పద!" అన్నాడు నాగేష్.

సైకిల్ ఒక ఇంటిముందు ఆగింది. నాగేష్ గుమ్మం వైపు వెళ్ళాడు. ఇంటి యజమాని ధర్మరాజు అతడికెదురయ్యాడు.

"సార్, మనియన్ స్టోర్స్!" అని పూరుకున్నాడు నాగేష్.

ధర్మరాజు అతడివంక పరీక్షగా చూశాడు.

"నిన్ను నేను ఇంతకుముందు చూడలేదే!" అన్నాడు ధర్మరాజు.

నాగేష్ తీయగా నవ్వాడు.

"నేను షాపులోపల వుంటాను, సార్. మిమ్మల్ని నేను చూశాను. మీ ఇంటికొచ్చే అతను పూరికి వెళ్ళాడు. అతడి తల్లికి అనారోగ్యంగా వుంది. అందుకని నేను

వచ్చాను. ఈ లిస్టు చూస్తే ఎంతివ్వాలో మీకు తెలుస్తుంది” అన్నాడు నాగేష్.

అతడు లిస్టు చూసి లోపలకు వెళ్ళాడు. 650-75 పైసలు తెచ్చి నాగేష్‌కిచ్చాడు. అతడికి థాంక్స్ చెప్పి నాగేష్ వెళ్ళి సైకిల్ వెనక కూర్చున్నాడు.

పద్మరాజు సైకిల్ని పోనిచ్చాడు.

“మరో పెద్ద బిల్లు! పదో రోడ్డుకు పద!”

ఇంటిముందు సైకిల్ ఆగింది. నాగేష్ దిగి తలుపు తట్టాడు. పదహారేళ్ళ యువతి అతడివైపు నవ్వుతూ చూసింది.

“ఇంట్లో యెవ్వరూ లేరు, నేను తప్ప. నాన్న, అమ్మ ఆఫీసులకు వెళ్ళిపోయారు. సాయంత్రం వస్తారు” అందామె.

“మనియన్ స్టోర్స్ అమ్మా!” అన్నాడు నాగేష్.

“నాన్న డబ్బిచ్చాడు మీకిమ్మని” అని ఆమె లోపలకు పరుగెత్తింది.

పట్టుకొచ్చి అతడికి 550 రూపాయలు యిచ్చింది.

“నాన్న 40 కిలోలు బియ్యం, పది కిలోలు గోధుమలు ఆర్డరిచ్చారు. పొరపాటున మీరు మాకు 40 కిలోల గోధుమలు, 10 కిలోలు బియ్యం ఇచ్చారు. నాన్న ఆ విషయం మీతో చెప్పమన్నారు” అందామె.

“దానికేముందమ్మా! అరగంటలో మరో 30 కిలోల బియ్యం తెచ్చి మీకిస్తాను. యెక్కువగా ఇచ్చిన గోధుమలు తీసుకుపోతాను” అన్నాడు నాగేష్.

ఆమె నవ్వుతూ థాంక్స్ చెప్పింది. నాగేష్ సైకిల్ వైపు పరుగెత్తాడు.

రాజన్ డాక్టర్కి గాయం చూపించాడు. “మరేం

ఫరవాలేదు. బాండేయిడ్ వేస్తే చాలు" అని డాక్టర్ బాండేయిడ్ వేశాడు.

డాక్టర్ గదిలోంచి బయటకొచ్చి రాజన్ తన జేబులోని కాయితంకోసం చూశాడు. కాయితం లేదు! ఎక్కడో పడిపోయి వుంటుంది.

అతడు గాభరాగా మనియన్ స్టోర్స్‌కు సైకిల్ మీద దూసుకు వెళ్ళాడు. ప్రొప్రయిటర్ మనియన్ ముందుకు నడిచాడు.

"సార్, యాక్సిడెంట్ అయింది" అని తన మోకాలు వైపు చూపించాడు.

"ఏమైందిరా? ఏలారీయేనా నీ సైకిల్ని కొట్టిందా?" ప్రశ్నించాడు మనియన్.

"మరో సైకిల్ నా సైకిల్ని కొట్టింది సార్. కింద పడ్డాను. డాక్టర్ దగ్గరకెళ్ళి ఇక్కడికొచ్చాను."

"అంతేనా!"

"సార్, మీరు ఇచ్చిన లిస్టు ఎక్కడో పడిపోయింది" అన్నాడు రాజన్.

"మరో లిస్టు రాసి ఇమ్మని మూర్తితో చెప్పు" అన్నాడు మనియన్.

వెనక వుండే మూర్తివైపు రాజన్ వేగంగా వెళ్లాడు.

పన్నెండు దాటింది. లిస్టులోని ఆఖరి అడ్రెసుకు పద్మరాజు సైకిల్ని పోనిచ్చాడు.

ఒక యింటిముందు సైకిల్ ఆగింది. నాగేష్ వెళ్ళి తలుపు తట్టాడు.

ఇరవై ఏళ్ళ స్త్రీ తలుపు తెర్చింది. నాగేష్‌వైపు విచిత్రంగా చూసింది.

"మనియన్ స్టోర్స్" అన్నాడతను.

"ఆయనకు జీతం 7 తారీఖున వస్తుంది. యెప్పుడూ మేం 8 తారీఖున ఇస్తున్నాం. ఇవాళ వచ్చేరేమిటి?" అందామె.

"అది మాకు తెలుసమ్మా. మా ప్రొప్రయిటర్ ఇంట్లో యెల్లుండి పెళ్ళుంది. ఇవ్వగలిగింది పట్రామన్నారు" అన్నాడు నాగేష్.

"ఎంతివ్వాలి?" అందామె.

"450" అన్నాడతను.

"పెళ్ళి వుందని చెప్పడంవలన నా డబ్బులోంచి మీకిచ్చేస్తాను" అందామె.

మా ప్రొప్రయిటర్ చాలా ఆనందిస్తారు."

ఆమె లోపలకు వెళ్ళి డబ్బు తెచ్చి యిచ్చింది.

"మీకు చాలా థాంక్సమ్మా. మీరు పెళ్ళికి తప్పక రావాలి. ఇవాళే మీకు ఇన్విటేషన్ పోస్టుచేశాం. సాయంత్రం లోపల మీకు అందుతుంది" అన్నాడు నాగేష్.

"నేనూ, ఆయన తప్పక వస్తాం" అందామె.

నాగేష్ సైకిల్ వెనక కూర్చున్నాడు. పద్మరాజు సైకిల్ని పోనిస్తున్నాడు.

"ఎక్కడికి పోదాం?" పద్మరాజు అడిగాడు.

"ఈ అద్దె సైకిల్ ఇచ్చేసి బెంగుళూరు పోదాం. కొన్ని రోజులపాటు ఈ ప్రాంతంలో మనం ఎవ్వరికీ కనబడకూడదు" అన్నాడు నాగేష్.

"గుడ్ ఐడియా!" అన్నాడు పద్మరాజు.

"డబ్బు బరువుతో నేను చస్తున్నాను. తొందరగా పద!" అన్నాడు నాగేష్.

# 3

బెంగుళూరు!

హోటలు గదిలోని ఫ్లోరసెంట్ లైటు ప్రకాశ వంతంగా వెలుగుతోంది.

నాగేష్ సోఫాలో కూర్చున్నాడు. రెండు గ్లాసుల్లో పీటర్ స్కాట్ విస్కీ పోసి, ఐస్ క్యూబ్స్ పడేసి, కొద్దిగా కూల్ వాటర్ పోశాడు పద్మరాజు.

ఇద్దరూ గ్లాసులను అందుకున్నారు. నాగేష్ నవ్వుతూ పద్మరాజువైపు చూశాడు.

"రాజా, మన జీవితం మారిపోయింది! మనం ధన వంతులం" అన్నాడు నాగేష్.

"ఫైన్" అన్నాడు పద్మరాజు.

"రాజా, నాలుగ్గంటలు తిరిగి మనియన్ స్టోర్స్ తరఫున మనం ఇరవై ఐదువేలు కలెక్టు చేశాం. బ్రహ్మాండ మైన మొత్తం. అందులోంచి నీకు 2,500 ఇస్తాను. నేను 2,500 తీసుకుంటాను. ఇరవై వేలు మన కార్యక్రమాలకు కాపిటల్‌గా వుంచుకుందాం" అన్నాడు నాగేష్.

"నువ్వు చెప్పిందే నాకు వేదం" అన్నాడు పద్మ రాజు.

"మనం చేసింది చాలా చిన్నది. ఇంకా పెద్ద పెట్టున మనం డబ్బు సంపాదించాలి. మన కాపిటల్ ఇరవై వేలు అందుకోసం మనకు చాలా వుపయోగపడుతుంది."

"నాగేష్, యూ ఆర్ జీనియస్! ఇంతవరకూ చిన్న దొంగతనాలతో నేను తృప్తిపడేవాడిని. నీతో చెయ్యి కలిపాక పెద్ద పెట్టున యెలా చెయ్యాలో నేను నేర్చు కున్నాను."

గ్లాసులోని విస్కీని నాగేష్ గడగడ తాగేశాడు.

"రాజా, త్వరలో లక్షలు, కాదు కోట్లు, మన చేతిలోకొస్తాయి!"

"నీ మాటల్లో నాకు నమ్మకముంది."

గ్లాసులు ఖాళీ అయ్యాయి. మళ్ళా గ్లాసుల్లో పద్మ రాజు విస్కీ పోశాడు. ఐస్ క్యూబ్స్ వేశాడు. నీళ్ళు కలిపాడు.

"మై డియర్ రాజూ, మనం యెంతైనా తాగొచ్చు. ఎంతైనా ఖర్చుపెట్టొచ్చు!"

ఎవరో తలుపును తట్టారు. పద్మరాజు వులిక్కిపడ్డాడు.

"భయపడకు! వెళ్ళి, తలుపు తెర్చిచూడు!"

పద్మరాజు తలుపు తెర్చాడు. బయట హోటల్ బేరర్ నిలబడి వున్నాడు.

"డిన్నర్, సార్" అన్నాడు బేరర్.

పద్మరాజు వెనక్కి తిరిగి నాగేష్ వైపు చూశాడు.

"గదికి పట్రమను" అన్నాడు నాగేష్.

బేరర్ వెళ్ళిపోయాడు. తలుపు మూసి పద్మరాజు తన గ్లాసును అందుకున్నాడు వుషారుగా.

నాగేష్ టైమ్ చూశాడు. పది దాటింది.

"నాగేష్, మనియన్ స్టోర్స్ యజమాని వూరుకుంటాడా? ఈపాటికి పోలీసు రిపోర్టు ఇచ్చి వుంటాడు" అన్నాడు పద్మరాజు.

"పోలీసులు ఏం చేస్తారు? డబ్బిచ్చినవాళ్ళు నా రూపం గురించి చిత్రిస్తారు. పోలీసులు నాకోసం వెతుకుతారు. మనం బెంగుళూరులో వున్నాం. ఎంత వెతికినా మద్రాసులో మనం దొరకం. కొంతకాలమయ్యాక పోలీసులు మన్ని గురించి మర్చిపోతారు."

"మనియన్ స్టోర్స్ యజమాని అంత నష్టం భరించ

గలదా?"

"భరించవలసిందే. డబ్బిచ్చినవాళ్ళను మళ్ళా డబ్బు ఇవ్వమనలేదు. కంపెనీ రబ్బరు స్టాంపున్న లిస్టుచూసి డబ్బిచ్చామని వాళ్ళంటారు. ఆ స్టోర్సు చాలా పెద్దది. దాని ప్రొప్రయిటర్ లక్షలు గడించాడు. ఇరవై ఐదువేలు అతడికి నథింగ్!" అన్నాడు నాగేష్.

"సైకిల్ యాక్సిడెంట్‌నుబట్టి వాళ్ళు మన్ని అనుమానిస్తారేమో!" అన్నాడు పద్మరాజు.

నాగేష్ గంభీరంగా నవ్వాడు.

"రాజూ, మనం ఎవరో ఎవరికీ తెలియదు. మన్ని అనేకమంది చూశారు. మన్ని వర్ణిస్తారు. కాని అది అంతగా వుపయోగపడదు. ఒక నెలపాటు మనం ఇక్కడే వుందాం. ఎవ్వరూ మన్ని కనుక్కోలేరు" అన్నాడు నాగేష్.

"నాగేష్, సహజంగా నాకు భయం ఎక్కువ. కాని నీ పక్కనుంటే నాకు ధైర్యంగా వుంది" అన్నాడు పద్మరాజు.

## 4

మర్నాడు రాజన్ లిస్టులో రాసిన ఇళ్ళకు వెళ్ళి బోడి చేతులతో తిరిగి వచ్చాడు.

ప్రొప్రయిటర్ అతడివైపు కోపంగా చూశాడు.

"ఏమిట్రా నువ్వనేది? నేను ఎవ్వర్నీ పంపలేదు!" అర్చాడు మనియన్.

"ఎవరో వెళ్ళి డబ్బు వసూలు చేశారు సార్" అన్నాడు రాజన్.

ప్రొప్రయిటర్ మనియన్ గుండె దడదడ కొట్టుకుంది. లిస్టు ప్రకారం 25 వేలు తనకు రావాలి. అదంతా ఎవరో

"ఎవరో ఇంటికొచ్చి మనియన్ స్టోర్స్ పేరు చెప్ప గానే డబ్బివ్వడం మూర్ఖత్వం. ఆ నష్టం వాళ్ళే భరిం చాలి" అన్నాడు మనియన్.

"సార్, రబ్బర్ స్టాంపు ముద్రవేసిన లిస్టు చూసి వాళ్ళు డబ్బు చెల్లించారు" అన్నాడు రాజన్.

"ఎలా వచ్చింది లిస్టు వాళ్ళకు?"

"నిన్న సైకిల్ మీదనుంచి పడిపోయానుగా, అప్పుడు నా జేబులో వున్న కాగితం ఎక్కడో జారిపోయిందని మీతో చెప్పాను. ఆ లిస్టు ఎవరికో దొరికివుంటుంది!"

ఇప్పుడు మనియన్ గాభరాపడసాగాడు. ఖాతా దార్లను మళ్ళా డబ్బీయమని తను అడగలేదు. అడిగితే ఇటుపైన ఎవ్వరూ తన దగ్గర కొనరు. స్టోర్స్ మూసేయ వలసి వస్తుంది.

మనియన్ కుర్చీలోంచి లేచాడు. "నాతో రా" అన్నాడు రాజన్‌తో.

మనియన్ బయటకొచ్చి స్కూటర్ని స్టార్టు చేసి సీటు మీద కూర్చున్నాడు. స్కూటర్ స్పీడుగా వెళ్ళిపో యింది.

ఇన్‌స్పెక్టర్ రామన్‌కి అంతా వివరంగా చెప్పి, రిపోర్టు రాసిచ్చాడు మనియన్.

"మేం దర్యాప్తు చేస్తాం. వాళ్ళు ఇక్కడి వాళ్ళే అయివుండాలి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

అదే సమయంలో నాగేష్, పద్మరాజు చల్లటి బీర్ తాగుతున్నారు.

నాగేష్ బీర్ తాగుతూ ఏదో ఇంగ్లీషు పత్రికను చదువుతున్నాడు. రెండుమూడుసార్లు పత్రికను చదివి

అతడు పద్మరాజువైపు చూశాడు.

"రాజూ, ఈసారి మనం చేయబోయేది మన్ని కోటీశ్వరులుగా మారుస్తుంది!" అన్నాడు నాగేష్.

పద్మరాజు ఆశ్చర్యంగా నాగేష్‌వైపు చూశాడు. పత్రికలో ముద్రించిన ఫోటోను నాగేష్ తన మిత్రుడికి చూపించాడు.

"ఎవరామె?" అడిగాడు పద్మరాజు.

"ఈమె పేరు కమల. ఈమె తండ్రి కోటీశ్వరుడు రుద్రప్ప. బెంగుళూరులో పేరుపొందిన బిజినెస్‌మన్, పారిశ్రామికవేత్త. ఆయన యిల్లు రాజభవనంలా వుంటుంది."

"నాగేష్ ఏమిటి నీ ప్లాన్? ఆయనకు అల్లుడవ్వాలని ఆశపడుతున్నావా?"

"అది ప్రస్తుతం సాధ్యంకాదు. ఆమె మరణించి 18 ఏళ్ళు అయింది."

"పూర్ గర్ల్, కన్యగానే మరణించిందన్నమాట!" అర్చాడు పద్మరాజు, గ్లాసులో బీర్ పోసుకుంటూ.

కొంతసేపు హోటల్ గదిలో నిశ్శబ్దంగా వుంది. గ్లాసులోని బీరు తాగి, నాగేష్ సిగరెట్ వెలిగించాడు. ఎదురుగా కూర్చున్న పద్మరాజువంక అతడు సూటిగా చూశాడు.

"మనకు పధ్ధెనిమిదేళ్ళ యువతి కావాలి!"

"ఎందుకు?" అడిగాడు పద్మరాజు.

"ఆమె అచ్చంగా కమలలా వుండాలి!" అన్నాడు నాగేష్.

"నువ్వు ఏం చేయదల్చావో తెలియడంలేదు" అన్నాడు పద్మరాజు.

"రాజూ, రుద్రప్పకి తన కూతురంటే చాలా ప్రేమ. ప్లేను యాక్సిడెంట్‌లో మరణించిన కూతుర్ని గురించి ఆలోచిస్తూ అతడు జీవిస్తున్నాడు. అతడి ఆస్తికి వారసులు లేరు."

"ఇంతకీ నీ ప్లాను ఏమిటో చెప్పు!"

"రుద్రప్ప ఆస్తిలో కొంతభాగమైనా మన చేతుల్లోకి రావాలి!" అన్నాడు నాగేష్.

"అందుకోసం మనం ఏం చేద్దాం?"

"అదింకా నేను ఆలోచించాలి. ఈ పత్రిక చదివాక నాకేదో ఐడియా వచ్చింది. బాగా ఆలోచించి, మరి కొన్ని విషయాలు తెలుసుకుని, మనం రంగంలోకి దిగాలి" అన్నాడు నాగేష్.

# 5

ఇందిరా అనాధాశ్రమంలోంచి బయటకు వచ్చి ఆమె రోడ్డమ్మట నడుస్తోంది.

సమీపంలో నిలబడిన నాగేష్ గట్టిగా పక్కనున్న పద్మరాజు చెయ్యి పట్టుకున్నాడు.

"రాజూ, పదిరోజులనుంచి ఆమెను గమనిస్తున్నాను. జాగ్రత్తగా చూడు! ఆమె యెలా వుందో చెప్పు!" అన్నాడు నాగేష్.

ఆమెను పరీక్షగా చూశాడు పద్మరాజు. ఆమె అందంగా వుంది. మామూలు కాటన్ చీర, జాకెట్ ధరించింది. కాని ముఖంలో బ్రహ్మాండమైన కళ వుంది.

"మనం పత్రికలో చూసిన కమలలాగే వుంది" అన్నాడు పద్మరాజు.

నాగేష్ మిత్రుని చెయ్యి వదిలేశాడు. "నువ్వు వెనక దూరంగా రా. నేను వెళ్ళి ఆమెతో మాట్లాడతాను"

అన్నాడు నాగేష్.

నాగేష్ గబగబా ఆమెవైపు వెళ్ళాడు. పక్కనే నడుస్తూ ఆమెవైపు ఓరగా చూశాడు.

"మిస్, నీతో మాట్లాడాలి" అన్నాడతను.

ఆమె అతడివంక తిరిగి నవ్వుతూ చూసింది.

"నాతోనా? ఎవరు మీరు?" అందామె తీయటి కంఠంతో.

"పేరు నాగేష్" అన్నాడతను.

"నా పేరు కమల" అందామె.

అతడు తృప్తిపడ్డాడు. రుద్రప్ప కూతురు పేరు కమలే!

"మిస్, మనం ఎక్కడో కూర్చుని కాసేపు మాట్లాడాలి."

ఆమె నవ్వింది.

"ఇలా నడుస్తూ మాట్లాడలేరా?" అడిగిందామె.

"మాట్లాడొచ్చు."

"అయితే చెప్పండి!"

"ఒక పని నేను నీకు కల్పిస్తాను. అది చేస్తే నీకు ఐదువేలు ఇస్తాను."

ఆమె ఆశ్చర్యంగా అతడివైపు చూసింది.

"ఏమిటా పని?"

"అది తర్వాత చెప్తాను. నాతో పనిచేయడానికి నువ్వు అంగీకరించాలి."

ఆమె జవాబివ్వలేదు. పక్కపక్కనే ఇద్దరూ నడుస్తున్నారు.

"నువ్వు అనాథాశ్రమంలో వుంటున్నావా?"

"అక్కడ వుండడానికి ప్రయత్నిస్తున్నాను. కాని

ఇంకా ఆ అదృష్టం లేదు నాకు."
"నీ కెవ్వరూ లేరా?"
"లేరు. ఒంటరిదాన్ని. దయతలచి ఒక యువతి నన్ను తన హాస్టల్ గదిలో వుండనిస్తోంది. కాని ఎక్కువకాలం అక్కడ వుండలేను. ఎక్కడకేనా మారాలి" అందామె.
"నీ పరిస్థితిలో ఈ ఐదువేలూ చాలా ఉపయోగ పడ్తాయి" అన్నాడతను.
"డబ్బు ఎప్పుడూ వుపయోగపడుతుంది" అందామె.
ఇద్దరూ ముందుకు నడిచారు. నాగేష్ ఆగాడు.
"ఇవాళ సాయంత్రం, నా హోటల్ గదికి రా— అక్కడంతా చెప్తాను" అని హోటల్ పేరు, గది నంబరు చెప్పాడతను.
ఆమె అతడివైపు సూటిగా చూసింది.
"గదికొచ్చాక పిచ్చి చేష్టలు చేస్తే నేనూరుకోను" అందామె.
"అటువంటి వుద్దేశం నాకు లేదు."
"అయితే వస్తాను" అని ఆమె వెళ్ళిపోయింది.
నాగేష్ నిలబడి ఆమెవైపే చూస్తున్నాడు.
ఆమె నడుస్తూ తన జీవితాన్ని గురించి ఆలోచించ సాగింది. ఆమె తండ్రి మళ్ళా పెళ్ళిచేసుకున్నాడు. ఇంట్లో సవితల్లి పెట్టేబాధలు భరించలేక ఆమె బెంగుళూరు వచ్చేసింది. ట్రెయిన్‌లో ఆమెకు సుభతో పరిచయమైంది. సుభతో కాలేజి హాస్టల్లో ఆమె తాత్కాలికంగా వుంటోంది. కాని రెండుమూడు రోజుల్లో ఆమె ఎక్కడో నివాసం చూసుకోవాలి!
పద్మరాజా మెల్లిగా నాగేష్ దగ్గరకు వచ్చాడు.
"నాగేష్, ఏమైంది?"

"సాయంత్రం మన గదికి వస్తుంది. వచ్చాక వివరంగా మాట్లాడాలి" అన్నాడు నాగేష్.

# 6

తలుపు తట్టగానే నాగేష్ గబగబా వెళ్ళి తెరిచాడు. ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"కమిన్!" అన్నాడతను.

ఆమె లోపలకొచ్చింది. తలుపు మూసి నాగేష్ ఆమె వైపు చూశాడు.

"మిస్ కమలా, కూర్చో!"

ఆమె కుర్చీలో కూర్చుంది. పక్క కుర్చీలో కూర్చున్న పద్మరాజువైపు చూసింది.

"అతడు నా పార్ట్నర్. పేరు పద్మరాజు" అన్నాడు నాగేష్.

"ఐయామ్ కమల" అందామె.

"మిస్ కమలా, కాఫీ తీసుకుంటావా?"

"స్ట్రాంగ్ కాఫీ అంటే నాకిష్టం" అందామె.

నాగేష్ పద్మరాజుకు సౌజ్ఞ చేశాడు. ఫ్లాస్కులోని కాఫీని కప్పులో పోసి ఆమెముందు టీపాయిమీద పెట్టాడు పద్మరాజు.

"మీకో?" అందామె, ఇద్దరివైపు చూస్తూ.

"మాకు కాఫీ చాలదు! విస్కీ కావాలి" అన్నాడు నాగేష్ నవ్వుతూ.

మెల్లిగా ఆమె కాఫీ తాగింది.

"మిస్ కమలా, ఈ పట్నంలో రుద్రప్ప పేరుపొందిన బిజినెస్‌మన్. పద్దెనిమిదేళ్ళ క్రితం ఆయన కూతురు కమల ప్లేన్ ప్రమాదంలో మరణించింది. నువ్వు ఆయన కూతురవ్వాలి!" అన్నాడు నాగేష్.

ఆమె పరిహాసంగా నవ్వింది.

"అదెలా అవుతుంది?"

"నా ప్లాను ప్రకారం అవుతుంది. నిన్ను ఆయన కూతురుగా స్వీకరించగానే నీకు ఐదువేలు యిస్తాను. అటుపైన మరికొంత పని నువ్వు చెయ్యాలి. దానికి వేరే డబ్బిస్తాం."

ఆమె ఇద్దరివైపూ చూసింది.

"మీ వుద్దేశం ఏమిటి? ఆయన్ని మోసగించి డబ్బును గుంజాలని ఆశిస్తున్నారా?" అడిగిందామె.

"మాకు కావలసిన మొదటి పని గురించి చెప్పాను. తర్వాత విషయాలు అటుపైన నీకు తెలుస్తాయి" అన్నాడు నాగేష్.

ఆమె మాట్లాడలేదు. ఆలోచిస్తూ వుండిపోయింది.

"నువ్వు ఒప్పుకుంటే మేం పని ప్రారంభిస్తాం. నీకు మంచి చీరలు, నగలు కొనాలి. నీ రూపం కొద్దిగా మార్చాలి."

"ఎవర్నీ మోసగించవలసిన పని నాకు ఉండదని హామీ ఇస్తే సరే అంటాను."

"నువ్వు మోసగించవు!" అన్నాడు నాగేష్.

"అయితే మీరు చెప్పింది చేస్తాను" అందామె.

"గుడ్" అని నాగేష్ సిగరెట్ వెలిగించాడు.

పొగ వదుల్తూ నాగేష్ ఆమెవంక చూశాడు.

"మిస్ కమలా, ఇదే హోటల్లో నీ పేర ఒక గది మేం తీసుకుంటాం. నువ్వు ఆ గదిలో వుండొచ్చు. ప్రస్తుతం నువ్వుండే హాస్టల్ గదిలో నీ సామానులు ఏమైనా వున్నాయా?"

"ఒక ఏర్ బాగ్ మాత్రం వుంది."

"నువ్వు వెంటనే ఆటోరిక్షాలో వెళ్ళి అది తెచ్చుకో. నువ్వు తిరిగి వచ్చేసరికి గది రెడీగా వుంటుంది" అన్నాడు నాగేష్.

ఆమె కుర్చీలోంచి లేచింది. నాగేష్ ఐదువందలు ఇచ్చాడు. మరో యాభై రూపాయలు వేరే ఇచ్చాడు.

"500 నీకు అడ్వాన్స్‌గా ఇచ్చాను. ఆ యాభై ఆటో, టాక్సీల్లో వెళ్ళడానికి వుంచుకో" అన్నాడు నాగేష్.

ఆమె చిన్న పర్స్‌ను జాకెట్ లోంచి పైకితీసి డబ్బును అందులో దాచుకుంది.

"వెళ్ళి వస్తాను" అందామె.

ఆమెవైపు నాగేష్ నవ్వుతూ చూశాడు.

"తొందరగా వచ్చేయి. మనం చేయవలసిన పని చాలా వుంది" అన్నాడతను.

"రాజా, లెటస్ డ్రింక్ విస్కీ ఫర్ సక్సస్!" అన్నాడు నాగేష్ వుషారుగా.

## 7

కారులోంచి దిగి పక్కనున్న సిమెంట్ సోఫాలో కూర్చున్నాడు రామచంద్రమూర్తి.

అతడి వయస్సు అరవై పైన వుంటుంది. రామచంద్రమూర్తి ప్రఖ్యాత పారిశ్రామికవేత్త, రుద్రప్పకు పెర్సనల్ సెక్రటరీ. అతడిది పెద్ద కుటుంబం. ముగ్గురు కూతుళ్ళకు పెళ్ళయిపోయింది. ముగ్గురు కొడుకులు విదేశాల్లో వుద్యోగాలు చేస్తున్నారు. ఇంట్లో భార్య కీళ్ళ నొప్పులతో మంచం పట్టింది.

అతడి ముందునుంచి ఒక యువతి వయ్యారంగా నడిచి వెళ్తోంది. ఆమెవైపు చూసి అతడు తృళ్ళిపడ్డాడు.

ఆమె చేతి రుమాలు కిందపడింది. వంగి ఆమె దాన్ని తీసుకుంటూంటే రామచంద్రమూర్తి ఆమె ముఖంకేసి పరీక్షగా చూశాడు.

అతడి గుండె వేగంగా కొట్టుకుంటోంది. ఆమె తోటలో నడుస్తూ వెళ్ళిపోయింది.

నాగేష్, పద్మరాజు మొక్కల వెనుక నుంచి రామచంద్రమూర్తిని గమనిస్తున్నారు.

అతడి చూపు ఆమె మీదే వుంది. లాల్‌బాగ్ గార్డెన్స్‌లో కొంతదూరం వెళ్ళి ఆమె వెనక్కు తిరిగింది.

మళ్ళా అతడి ముందునుంచి వెళ్తోంది.

ఈసారి అతడు ఆగలేకపోయాడు. సోఫాలోంచి చటుక్కున లేచి ఆమెవైపు నడిచాడు.

"అమ్మాయి!" పిల్చాడు.

వెనుదిరిగి అతడివైపు చూసిందామె.

"ఎవరు నన్ను పిల్చారు?" అందామె.

"నే నేనమ్మా."

ఆమె తీయగా నవ్వింది.

"నీ పేరు?"

"కమల" అందామె.

క్షణకాలం అతడు మౌనంగా వుండిపోయాడు. అదే పేరు! రుద్రప్ప కూతురు కమలకూ, ఈమెకూ యెంత పోలిక!

రుద్రప్ప కూతురు కమల అతడికి బాగా జ్ఞాపకముంది. పదెనిమిదేళ్ళు గడిచిపోయినా కమలను అతడు మరువలేదు.

"ఏమిటలా చూస్తున్నారు?" అడిగిందామె.

"నువ్వు ఈ గార్డెన్స్‌కు రోజూ వస్తూ వుంటావా?"

"సాయంత్రం వస్తూ వుంటాను."

"అమ్మాయి, నీది ఏ వూరు?"

"వైజాగ్" అందామె క్లుప్తంగా.

"ఇన్ని ప్రశ్నలు వేసినందుకు నన్ను క్షమించు తల్లీ."

"ఫరవాలేదులెండి" అని ఆమె వెళ్ళిపోయింది.

రామచంద్రమూర్తి ఆలోచిస్తూ కార్లో కూర్చున్నాడు. పైపు వెలిగించాడు.

గతంలోంచి ఒక దృశ్యం అతడికి గుర్తొచ్చింది.

పదేనిమిదేళ్ళ క్రితం! కమల బొంబాయినుంచి ప్లేనులో వస్తోంది. తను కారులో ఏరోడ్రోముకు వెళ్ళాడు. ఎంతకీ ప్లేను రాలేదు. ఆ ప్లేన్ నేల కూలిపోయిందనే విషాద వార్త అతడికి అందింది.

అనేక శవాలను మరో ప్లేనులో మద్రాస్‌కు తీసుకొచ్చారు. కమల శవాన్ని అతనే కారులో యింటికి తీసుకెళ్ళాడు.

భయంకరంగా వున్న కూతురు శవాన్ని చూసి రుద్రప్ప స్పృహతప్పి పడిపోయాడు.

చలనం లేకుండా కారులో కూర్చుని వున్న అతడి వైపు నాగేష్, పద్మరాజు చూశారు.

కాసేపట్లో కారు కదిలింది. నాగేష్ వుషారుగా పద్మరాజు చెయ్యి పట్టుకున్నాడు.

"బంతి ఇప్పుడు వాళ్ళ కోర్టులో వుంది. ఏం జరుగుతుందో చూద్దాం" అన్నాడు నాగేష్.

వాళ్ళిద్దరూ యెక్కాక ట్యాక్సీ కదిలింది.

# 8

రుద్రప్ప పెద్ద సోఫాలో కూర్చున్నాడు. నుదురుమీద విభూది. అతడు ధరించిన పంచ, జుబ్బా తెల్లగా మెరు

స్తున్నాయి.

65 ఏళ్ళ వయస్సులో రుద్రప్ప దారుఢ్యంగానే వున్నాడు. ఒకప్పుడు పేరుకు తగ్గట్లు అతడికి కోపం ఎక్కువ. కాని భార్య మరణం, తర్వాత కూతురి చావు అతడి కోపాన్ని హరించేశాయి.

రామచంద్రమూర్తి వినయంగా అతడిముందుకు నడిచి నమస్కరించాడు.

"రామూ, ఎలా వున్నావు?"

"అరవై ఏళ్ళ తర్వాత జీవితం ఓవర్ డ్రాఫ్ట్ మీద బ్రతకడం లాంటిది" అన్నాడు రామచంద్రమూర్తి నవ్వుతూ.

"యూ ఆర్ రైట్! 60 ఏళ్ళు బ్రతికితేగాని ఓవర్ డ్రాఫ్ట్ అడిగే అర్హత మనిషికి రాదు!" అన్నాడు రుద్రప్ప.

కొంతసేపు ఇద్దరూ మౌనంగా వున్నారు.

"నిన్న సాయంత్రం విచిత్రమైన సంఘటన జరిగింది. మీతో చెప్పాలి."

రుద్రప్ప అతడివైపు సూటిగా చూశాడు.

"ప్రతిరోజూ నేను లాల్ బాగ్ గార్డెన్స్‌కు వెళ్ళి కాస్సేపు కూర్చుంటాను. అది మీకు తెలిసిందే."

రుద్రప్ప తలాడించాడు.

"ఒక యువతిని చూశాను, ఆమె వైజాగ్ నుంచి వచ్చింది. గార్డెన్స్‌లో తిరుగుతూంటే ఆమెను చూశాను. ఎంత పోలిక! ఆమెను చూస్తూంటే మన కమల తిరిగి వచ్చిందేమో అనిపించింది. ఆమె పేరు కూడా కమలే!

"ఆమెను నాకు చూపించలేదు!"

"చూపించాలనే వుద్దేశంతో ఇదంతా చెప్తున్నాను

ఇవాళ సాయంత్రం మీరూ రండి. ఆమె అక్కడ నడుస్తూ వుంటుంది."

రుద్రప్ప వెనక్కి తిరిగాడు. గోడమీదున్న కమల ఫోటోవైపు ఆప్యాయంగా చూశాడు. కొంత సేపయ్యాక సెక్రటరీవైపు తిరిగాడు.

"ఆమెను చూడ్డానికి నేను రావాలా? ఆమెతో మాట్లాడు. నా పేరు చెప్పు. నా పేరు ఆమె వినే వుంటుంది. ఇవాళ రాత్రి ఆమెను ఇక్కడకు డిన్నర్‌కు రమ్మను. ఆమె అడ్రెసు తెలుసుకుని కారులో వెళ్ళి ఆమెను తీసుకురా."

"అలాగే చేస్తాను, సార్."

"రామూ, ఆత్మకు చావులేదు. అనేక రకాల అనుభవాలకోసం ఆత్మ మళ్ళా ఈ భూమ్మీద జన్మిస్తూనే వుంటుంది. నువ్వు చెప్పింది విన్నాక నా మనస్సు ఆమె మీదే వుంది. కమలను చూడాలి!" అన్నాడు రుద్రప్ప.

అద్దంముందు నిలబడి సాయంత్రం ఆమె ముఖానికి వానిషింగ్ క్రీమ్ రాసుకుంటోంది.

పద్మరాజు సోఫాలో కూర్చుని ఆమెవైపే చూస్తున్నాడు.

"కమలా, ఈ డ్రెస్‌లో నువ్వు చాలా అందంగా వున్నావు!" అన్నాడతను.

"మీ పార్ట్నర్‌లా మీ చూపు కూడా బిజినెస్ మీదే కేంద్రీకృతమై వుంటుందని పొరబడ్డాను. ఒక యువతి అందచందాలు చూసే ఆసక్తి మీకున్నందుకు సంతోషం". అందామె.

ముస్తాబయి ఆమె వచ్చి అతడి పక్కనే కుర్చీలో కూర్చుంది. పద్మరాజు ఆమె కళ్ళలోకి ఆప్యాయంగా

చూశాడు.

"విధి మనిద్దర్నీ బెంగుళూరు చేర్చి కలిపింది. ఎందుకోకి?" అన్నాడతను.

"విధి మానవ జీవితాల్లో ఆడుకుంటుంది" అందామె.

తలుపు తోసుకుని నాగేష్ లోపలకొచ్చాడు.

"మిస్ కమలా, ఇవాళ గార్డెన్స్‌లో ఆ ముసలాడు ఒంటరిగా వుంటాడు. మరో ముసలాడు రుద్రప్ప వాడి పక్కనుంటాడు. రుద్రప్ప నిన్ను చూసి పిచ్చివాడవ్వాలి. అమ్మా, కమలా అని నిన్ను పిలవాలి" అన్నాడు నాగేష్.

"నా ప్రయత్నంలో లోపముండదు" అందామె నవ్వుతూ.

# 9

కారు పక్కనే నిలబడి వున్నాడు రామచంద్రమూర్తి. అరగంట గడిచినా ఆమె రాలేదు. ఇవాళ రాదేమో!

దూరంలో ఆమె రూపం కనిపించింది. ఆమె మెల్లిగా నడుస్తోంది.

చెట్టు పక్కనుంచి నాగేష్, పద్మరాజు కారుపక్కనున్న రామచంద్రమూర్తివైపు చూశారు.

"నా ప్లాన్ మిస్‌ఫైర్ అయినట్లుంది. రుద్రప్ప ఎక్కడా పత్తాలేదు!" అన్నాడు నాగేష్.

కారు పక్కనుంచి వెళ్తూ ఆమె ఆగింది.

"నీకోసమే చూస్తున్నానమ్మా" అన్నాడతను.

"నాకోసం చాలాసేపు వేచివుంటే క్షమించండి" అందామె.

"చాలా సంస్కారం వున్న యువతి అనుకున్నాడు

రామచంద్రమూర్తి.

"నీతో నేనూ నడుస్తాను. నడుస్తూ మాట్లాడుదాం."

ఇద్దరూ పక్కపక్కనే నడవసాగారు.

"అమ్మాయి, నా మిత్రుడొకడు వున్నాడు. అతడి కొక్కతే కూతురు. ఆమె మరణించింది. ఆమెను గురించి ఆలోచిస్తూ, అతడు కృశించిపోతున్నాడు. అతడి కూతురు అచ్చంగా నీలాగే వుంటుంది. నిన్ను ఒకసారి చూస్తే అతడి బాధ కొంత తగ్గుతుందని నా నమ్మకం" అన్నాడతను.

అటువంటి వ్యక్తిని ఆనందపర్చడానికి నేను ఏదైనా చేస్తాను" అందామె.

"బాగా అన్నావు అమ్మాయి. రుద్రప్పగారి పేరు విన్నావా?"

"ఎవరాయన?"

రుద్రప్ప పేరు ఆమె వినలేదని రామచంద్రమూర్తి అనుకున్నాడు. రుద్రప్ప పేరు విననట్లు నటించమని నాగేష్ ఆమెకు చెప్పాడు.

"ఆయన కోటీశ్వరులు. ఆయనకు ఎన్నో ఫాక్టరీలు వున్నాయి. నిజం చెప్పాలంటే నే నాయన సెక్రటరీని. ఆయన కూతురే మరణించింది. అది జరిగి చాలా కాలమైంది. ఇవాళ రాత్రి ఆయన నిన్ను డిన్నర్‌కి రమ్మన్నారు. నేను కారులో వచ్చి నిన్ను తీసుకెళ్తాను."

"తప్పక వస్తాను" అందామె.

"నేనొచ్చి తీసుకెళ్తాను."

"నేను ఎక్కడకు రావాలి?"

"హోటల్ ఇగ్లూ, రూమ్ నెంబర్ 50" అందామె.

ఇద్దరూ మరికొంత దూరం నడిచి వెనక్కు తిరిగారు.

"అమ్మాయి, ఆయన నాకంటె పెద్దవారు. ప్రేమ మూర్తి. ఆయన నిన్ను చూసి చాలా ఆనందిస్తారు."

"రాత్రి ఎనిమిదింటికి రండి" అందామె.

అతడు తన కారు దగ్గర ఆగిపోయాడు. ఆమె మెల్లిగా వెళ్ళిపోయింది.

టాక్సీకి కొంత దూరంలో నాగేష్, పద్మరాజు ఆమెను కలుసుకున్నారు.

"నేను నీకు చెప్పినట్లు కాలేదు" అన్నాడు నాగేష్.

ఆమె తీయగా నవ్వింది.

"రుద్రప్పగారు రాకపోయినా మీ ప్లాన్ ప్రకారం అంతా సాగుతోంది. ఇవాళ రాత్రి ఎనిమిదింటికి రామచంద్రమూర్తి హోటల్‌కి వచ్చి నన్ను తీసుకెళ్తారు. రుద్రప్పగారి ఇంట్లో నాకు డిన్నర్!" అందామె.

నాగేష్ సంతోషంగా సిగరెట్ వెలిగించాడు.

"ఇక్కడికొస్తే అందరూ చూస్తారని భయపడి రుద్రప్ప ఇంట్లోనే వుండివుంటాడు. ఏది ఏమైనా మనం నెగ్గుతున్నాం" అన్నాడు నాగేష్.

ముగ్గురూ టాక్సీవైపు నడిచారు. లోపల కూర్చుని తలుపులు మూశారు. టాక్సీ కదిలింది.

హోటల్ ఇగ్లూ కాంపౌండులో టాక్సీ ఆగింది. కమల దిగి తన గదికి వెళ్ళిపోయింది. నాగేష్, పద్మరాజు వాళ్ళ గదికి వెళ్ళారు.

"నాగేష్ టైము చూశాడు. ఏడు ఇంకా కాలేదు.

"రాజూ, విస్కీ!"

రెండు గ్లాసుల్లో పద్మరాజు విస్కీ పోసి, ఐస్ క్యూబ్స్ పడేసి కొద్దిగా నీళ్ళు పోశాడు.

"మన ప్లాను ఫలిస్తోంది, చియర్స్!" అన్నాడు నాగేష్.

# 10

పోర్టికోలో మెర్సిడిస్ కారు ఆగింది. డ్రయివర్ దిగి తలుపు తెర్చాడు. రామచంద్రమూర్తి, కమల కిందకు దిగారు.

"వెల్‌కమ్!" అన్నాడు రామచంద్రమూర్తి.

అతడి వెనకనే ఆమె వెళ్ళింది. పెద్ద హాలు. హాలులో పది సోఫాలు. ఒక సోఫాలో రుద్రప్ప కూర్చునివున్నాడు.

వెనకనే గోడమీద అమర్చబడి వుంది కమల లైఫ్ సైజు పెయింటింగ్. హాల్లోని లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి.

కమల నవ్వుతూ రుద్రప్ప ముందుకు వెళ్ళింది. అతడామెవైపు చూస్తున్నాడు. కళ్ళు, చేతులు, కాళ్ళు, ఆమెకు రూపాన్నిచ్చే అన్ని అవయవాలనూ అతడు గమనిస్తున్నాడు.

ఆమె తీయగా నవ్వుతోంది. కనురెప్పలు చిట్లిస్తోంది. గతం తెరలు చించుకుని కమల తనముందు కొచ్చినట్లు అనిపిస్తోంది రుద్రప్పకు.

ఆప్యాయంగా ఆమె చెయ్యి పట్టుకున్నాడు. అతడి చెయ్యి వణుకుతోంది ఆవేశంలో.

"కమలా!" అన్నాడతను.

అది మామూలు పిలుపు కాదు. హృదయ లోతుల్లోంచి వెలువడిన అనురాగ స్వరం.

ఆమె అతడివైపే చూస్తోంది.

అమాంతంగా అతడు లేచాడు. వణికే చేతుల్తో ఆమెను కౌగలించుకున్నాడు.

"నా కమల నువ్వే! నా ప్రార్థనలకు కరిగిపోయి దైవం నిన్ను నా దగ్గరకు పంపాడమ్మా" అన్నాడతను ఉద్రేకంతో.

"నాన్నగారూ, మీరు కూర్చోండి. ఎక్కువగా ఆవేశ పడొద్దు" అందామె.

రుద్రప్ప కూర్చున్నాడు. పక్కనే ఆమె కూర్చుంది. అతడు ఆమెవైపు చూస్తూ వుండిపోయాడు.

"అమ్మా, నువ్వు యెప్పుడు పుట్టావు?"

"మార్చి 7, 1965."

అతను తృప్తిపడుతూ ఎదురుగా కూర్చున్న రామచంద్ర మూర్తివైపు చూశాడు.

"అదే సమయంలో మన కమల మరణించింది" అన్నాడు రామచంద్రమూర్తి.

పుట్టిన తారీఖు విషయంలో నాగేష్ ఆమెకు బాగా కోచింగ్ ఇచ్చాడు. అతడు చెప్పమన్నట్లే ఆమె చెప్పింది.

యూనిఫామ్‌లో వున్న బట్లర్ ట్రే పట్టుకుని అక్కడికొచ్చాడు. ట్రేను టీపాయిమీద పెట్టి గ్లాసులను వాళ్ళకు అందించాడు.

పైనాపిల్ జూస్!

"తాగు కమలా" అన్నాడు రుద్రప్ప.

"మీరూ తాగండి" అందామె.

"తండ్రీ కూతుళ్ళు నన్ను మర్చిపోతున్నారు!" అన్నాడు రామచంద్రమూర్తి.

"మమ్మల్ని కలిపిన మహానుభావుడవు నీవేనయ్యా!" అన్నాడు రుద్రప్ప.

తొమ్మిదింటికి ముగ్గురూ డైనింగ్ గదిలోకి వెళ్ళారు.

రుద్రప్పకిరువైపులా కమల, రామచంద్రమూర్తి కూర్చు న్నారు.

యూనిఫామ్‌లో వున్న బట్లర్ పదార్థాలతో కంచాలను వాళ్ళముందు పెట్టాడు.

పెద్ద కంచాల్లో వున్న పదార్థాలను చూసి ఆమె ఆశ్చర్యపోయింది.

"కమలా, నీ తల్లిదండ్రులు వున్నారా?"

"లేరండి."

"అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు...."

"లేరు."

"నాలాగే ఒంటరిదానివి."

ఆమె తలాడించింది.

"నువ్వు నా కళ్ళముందుంటే అమ్మాయి వున్నట్టే అనిపిస్తుంది. హోటల్ వదిలి నువ్వు ఇక్కడే వుండాలి" అన్నాడు రుద్రప్ప.

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది.

"మీ ప్రేమ చూస్తూంటే మిమ్మల్ని విడిచిపోవాలని అనిపించడంలేదు నాకు" అందామె.

"అయితే ఇక్కడే వుంటావా?"

"నన్ను ఆకర్షిస్తున్నది మీ ఆప్యాయత. ఆలోచించి త్వరలో చెప్తాను."

"కమలా, వైజాగ్ నుంచి నువ్వు బెంగుళూరు ఎందు కొచ్చావు?"

"ఉద్యోగం కోసం."

"నీకు ఉద్యోగం ఎందుకమ్మా? నాతో ఆఫీసుకొచ్చి మన కంపెనీలను నువ్వు మేనేజ్ చేయొచ్చు."

"అదంతా చేయడానికి అనుభవం కావాలి"

అందామె.

"చేస్తూ వుంటే అనుభవం వస్తుంది" అన్నాడు రుద్రప్ప.

మాట్లాడుకుంటూ వాళ్ళు భోజనాలు చేస్తున్నారు.

అదే సమయంలో నాగేష్, పద్మరాజు హోటల్ గదిలో చాలా వుషారుగా వున్నారు — ఇద్దరూ పీటర్ స్కాట్ విస్కీ సేవిస్తున్నారు.

నాగేష్ టైము చూశాడు. పది దాటింది.

"ఆమె వచ్చిందేమో చూడు!" అన్నాడు నాగేష్.

పద్మరాజు బయటకు వెళ్ళి కాస్సేపట్లో తిరిగొచ్చాడు.

"ఇంకా రాలేదు" అన్నాడతను.

"రుద్రప్ప ఆమెను తొందరగా వెనక్కి పంపేస్తే నా ప్లాన్ సాగదు. ఆమె ఆలస్యంగా తిరిగి రావాలి" అన్నాడు నాగేష్.

"నాగేష్, ఆమెను అక్కడికి పంపాం. ఇటుపైన నీ ప్లాన్ ఏమిటి?" అడిగాడు పద్మరాజు.

"ఆమెను రుద్రప్ప అక్కడే వుండమంటాడు. ఆమె రుద్రప్పకు కూతురవుతుంది. కొన్ని రోజులు పోయాక ఒక యువకుడిని ప్రేమించానని ఆమె అతడితో చెప్తుంది. నన్ను తీసుకెళ్ళి తన ప్రియుడిగా రుద్రప్పకు పరిచయం చేస్తుంది. మా పెళ్ళి అవుతుంది. బిజినెస్ మేరేజి! నేనూ ఆ ఇంటికి మారిపోతాను. ముసలాడు రుద్రప్ప యెక్కువ కాలం బతకడు. ఆ ఆస్తి అంతా నాదవుతుంది. బాగుందా?"

"ప్రొసీడ్!"

"రుద్రప్ప పోగానే కమలకు డబ్బిచ్చి పంపేస్తాను. ఆ ఆస్థిని మనిద్దరం అనుభవించవచ్చు. మనం ఇటుపైన ఏ

సేరాలూ చెయ్యనక్కర లేదు. ఎలా వుంది?"

"అంతా బాగుంది కాని కమలను నేను ప్రేమిస్తు న్నాను. ఆమెను నేను పెళ్ళాడతాను" అన్నాడు పద్మరాజు.

నాగేష్ గ్లాసులోని విస్కీని తాగి గంభీరంగా నవ్వాడు.

"రాజూ, ఆమెను నేను పెళ్ళాడ్డం బిజినెస్ కోసం. తర్వాత మన పని పూర్తయ్యాక ఆమె నీదే!"

"నీకు బదులు నన్ను ఆమె తన ప్రియుడిగా రుద్రప్పకు పరిచయం చేయొచ్చుగా?"

"రాజూ, నేనక్కడికి చేరుకుంటే రుద్రప్ప తొందరగా స్వర్గానికి వెళ్తాడు! నా అంత వేగంగా నువ్వు రుద్రప్పకు విముక్తి నియ్యలేవు" అన్నాడు నాగేష్ నవ్వుతూ.

పద్మరాజు విస్కీ తాగి నాగేష్ వైపు చూశాడు. ఆ క్షణంలో ఎందువలనో నాగేష్‌ని చూస్తూంటే అతడికి భయం వేసింది.

# 11

నెలరోజులనుంచి కమల రుద్రప్ప ఇంట్లోనే వుంటోంది. కమలంటే రుద్రప్పకు ప్రాణం.

ఒకనాడు అతడు ఆమె పెళ్ళి గురించి మాట్లాడాడు.

"అమ్మాయి, నేనుండగానే నీ పెళ్ళి అవ్వాలి" అన్నాడతను.

"నాన్నా, నేనొక యువకుడిని ప్రేమించాను. అతడినే పెళ్ళాడతాను" అందామె.

"అది నాకు చెప్పలేదే? వెంటనే అతడిని ఇక్కడకు రమ్మను. నేను అతడితో మాట్లాడి అంతా చేస్తాను" అన్నాడతను.

ఆమె అతడివైపు చూసింది.

"నాన్నా, పెళ్ళయినా మిమ్మల్ని వదిలి నేను యెక్కడికీ పోను. నన్ను పెళ్ళాడే వ్యక్తి యిక్కడే నాతో వుండాలి" అందామె.

"అదంతా నేను చూస్తానమ్మాయి" అన్నాడు రుద్రప్ప.

"అతడిని ఎప్పుడు రమ్మనను?"

"ఇవాళ రాత్రి ఏడింటికి రమ్మను" అన్నాడు రుద్రప్ప.

నాగేష్, పద్మరాజు బీరు సేవిస్తున్నారు. గదిలోని టెలిఫోన్ మ్రోగింది.

"ఎవరై వుంటారు?" అన్నాడు పద్మరాజు.

"ఇంకెవరు, నీ కమల" అన్నాడు నాగేష్.

నాగేష్ రిసీవర్ ఎత్తాడు.

"హలో!" అన్నాడు.

"కమలని."

"నాగేష్."

"నాన్నతో అంతా చెప్పాను. ఇవాళ రాత్రి మిమ్మల్ని ఏడింటికి రమ్మన్నారు."

"కమలా, కంగ్రాట్స్! రాత్రి వస్తాను. దీనితో నా ప్లాను మూడొంతులు ఫలించినట్లే" అన్నాడు నాగేష్.

"మీ ప్లాను ఏమిటో నాకు అర్థం కావడంలేదు."

"డోంట్ వర్రీ! నీకు తెలియకపోవడం మంచిది. అన్నీ నేను చూస్తాను."

అతడు రిసీవర్ పెట్టేశాడు.

సాయంత్రం ఆరింటికల్లా నాగేష్ రెడీగా వున్నాడు.

"విస్కీ తీసుకుంటావా?" పద్మరాజు అడిగాడు.

"నువ్వు తాగు. నాకు ఒక్క బడా పెగ్ చాలు. మంచివాడిలా రుద్రప్పకు కనిపించాలి" అన్నాడు నాగేష్.

రెండు గ్లాసుల్లో పద్మరాజు విస్కీ పోశాడు. ఇద్దరూ తాగడం ప్రారంభించారు. నిమిషాలు గడుస్తున్నాయి.

"నాగేష్ ఎలా వెళ్తావు?"

"టాక్సీలో."

"నేనూ రానా?"

"నన్ను అక్కడ దింపేసి వెనక్కి నువ్వు వచ్చేయి. రుద్రప్ప నన్ను అతడి కారులో పంపుతాడు" అన్నాడు నాగేష్.

సరిగ్గా 6.45కి ఇద్దరూ బయటకు నడిచారు. టాక్సీలో కూర్చున్నారు. టాక్సీ కదిలింది. నాగేష్ పక్కనున్న పద్మరాజు చెయ్యి పట్టుకున్నాడు.

"రాజా, నా ప్లాన్ ఫలించడంకోసం కమలను పాన్‌గా నేను వాడుతున్నాను. ఆమె ఎప్పుడూ నీదే! మీ ఇద్దర్నీ ఎవ్వరూ విడదీయలేరు" అన్నాడు నాగేష్.

టాక్సీ స్పీడుగా వెళ్తోంది. వెనుకనుంచి లారీ వస్తోంది. నాగేష్ ఏదో చెప్తున్నాడు.

అమాంతంగా భయంకరమైన చప్పుడు అయింది. లారీ వెనుకనుంచి టాక్సీని బలంగా కొట్టింది.

టాక్సీ తలుపు తెర్చుకుంది. పద్మరాజు కిందపడ్డాడు.

టాక్సీ తలక్రిందులైంది.

షాక్‌తో క్షణకాలం పద్మరాజు లేవలేకపోయాడు. మెల్లిగా బలం పుంజుకుని లేచాడు. విచిత్రంగా అతడు గాయపడలేదు.

టాక్సీ దగ్గరకు వెళ్ళాడతను. స్టీరింగ్ రాడ్ డ్రయివర్ గుండెలో గుచ్చుకుపోయింది. నాగేష్ బుర్ర పగిలి రక్తం కారోంది. "వాళ్ళను హాస్పిటల్‌కు వెంటనే తీసుకు వెళ్ళండి" అన్నారెవరో.

మరో టాక్సీలో డ్రయివర్ని, నాగేష్‌నీ హాస్పిటల్‌కు చేర్చారు. అదే టాక్సీలో వెళ్ళాడు పద్మరాజు.

డాక్టర్ ఇద్దర్నీ పరీక్షించాడు.

పద్మరాజు ఆత్రంగా డాక్టర్‌వైపు చూశాడు.

"లాభంలేదు. ఇద్దరూ మరణించారు" అన్నాడు డాక్టర్.

"డాక్టర్, నా మిత్రుడు. శవాన్ని నేను తీసుకు వెళ్ళవచ్చా?"

"ఇది ఫేటల్ యాక్సిడెంట్. పోలీసులు వస్తారు. వాళ్ళకు మేము రిపోర్టివ్వాలి. రేపు ప్రొద్దుట మీకు శవాన్ని ఇస్తాం" అన్నాడు డాక్టర్.

పద్మరాజు బయటకు నడిచాడు. విధి నాగేష్ ప్లాన్‌కు అడ్డుపడింది. ఇప్పుడు ఏమవుతుంది?

హాస్పిటల్ బయటనున్న టాక్సీలో కూర్చుని పద్మరాజు శరవేగంగా రుద్రప్ప యింటికి చేరుకున్నాడు.

విచారవదనంతో ముందు హాల్లోకి వెళ్ళాడు. కమల అతడికి ఎదురైంది. అతడివైపు ఆశ్చర్యంగా చూసింది.

"నాగేష్ రాలేదా?" అందామె.

"అతడు రాలేకపోయాడు."

"ఏమైంది?"

"విధి అతడి ప్లానుకు అడ్డుపడింది. టాక్సీ యాక్సిడెంట్‌లో అతడు మరణించాడు."

ఆమె తృళ్ళిపడింది. అతడివైపు ఆమె సూటిగా చూసింది.

"విధి అడ్డుపడలేదు. విధి నాగేష్ ప్లాన్ను మర్చింది" అందామె.

పద్మరాజు ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు.

"లక్కీ, నేను నాన్నతో నా ప్రియుడి పేరు చెప్ప లేదు. వీరే నా ప్రియుడని నాన్నకి పరిచయం చేస్తాను" అందామె.

అప్పుడే రుద్రప్ప కిందకొచ్చాడు. ఆమె అతడిని పరిచయం చేసింది. అతడివైపు రుద్రప్ప పరీక్షగా చూశాడు. అతడి చూపు కమలవైపు తిరిగింది.

"అమ్మాయి, త్వరలో మీ పెళ్ళి వైభవంగా చేయిస్తాను. గాడ్ బ్లెస్ యు!" అన్నాడు రుద్రప్ప.

"నామీద మీ కింత నమ్మకం ఏర్పడినందుకు ఆనంది స్తున్నాను" అన్నాడు పద్మరాజు.

రుద్రప్ప కుర్చీలోంచి లేచాడు.

"అమ్మాయి, అతను డిన్నర్‌కి ఇక్కడే వుంటాడు. నువ్వు అతడితో మాట్లాడుతూ వుండు. నేను స్నానం చేసి వస్తాను" అని రుద్రప్ప మేడమీదకు వెళ్ళిపోయాడు.

## 12

రెండు నెలలు గడిచిపోయాయి. కమలతో పద్మరాజు పెళ్ళి ఎంతో వైభవంగా జరిగింది.

హనీమూన్‌కి పద్మరాజు కమలతో సహా మద్రాసు చేరుకున్నాడు. హోటల్ చోలాలో వాళ్ళు గది తీసుకున్నారు.

"ఇవాళ నేను తలంటు పోసుకోవాలి" అంది కమల.

"నేను అలా వెళ్ళి కొందరు మిత్రుల్ని చూసొస్తాను" అన్నాడు పద్మరాజు.

పద్మరాజు టాక్సీలో నాగేష్ ఇంటికి వెళ్ళాడు. అతడి తల్లిని కల్సుకున్నాడు.

"రాజూ, నువ్వా? నాగేష్ ఏడీ?" అందామె.

అతడు విచారవదనంతో నాగేష్ చావు వార్త చెప్పాడు. ఆమె వెక్కి వెక్కి ఏడ్చింది.

"అమ్మా, నువ్వు భయపడకు. నాగేష్ నా అన్న లాంటివాడు. నీకు ప్రతి నెలా నేను వెయ్యి రూపాయిలు పంపుతాను. ఏ బాధా లేకుండా నువ్వు జీవించాలి. నాగేష్ కోరింది అదే!" అన్నాడతను.

బాగ్ లోంచి వెయ్యి రూపాయిలు తీసి ఆమెకిచ్చాడు.

"నాయనా, వృద్ధిలోకొచ్చావు. సంతోషం" అందామె.

అదే టాక్సీలో అతడు మనియన్ స్టోర్స్‌కు వెళ్ళాడు. ప్రొప్రయిటర్ ముందుకు నడిచాడు. మనియన్ అతడి వైపు ఆశ్చర్యంగా చూశాడు.

"ఏం కావాలి సార్?" అడిగాడతను.

"కొంతకాలం క్రితం మీకు 25 వేలు నష్టం వచ్చింది. ఎవరో మీకు రావలసిన డబ్బు తీసుకుని పారిపోయారు" అన్నాడు పద్మరాజు.

"వాడు మీకు తెలుసా?"

"తెలుసు. అలా చేయడం మంచిది కాదని అతడితో చెప్పాను. మీకిమ్మని అతడు 25 వేలు నాకిచ్చాడు."

నోట్లకట్టలను పద్మరాజు ప్రొప్రయిటర్ కి ఇచ్చాడు.

"ఇది తిరిగి వస్తుందని నేను కలలో కూడా వూహించలేదు" అన్నాడు మనియన్ సంతోషంగా.

పద్మరాజు ప్రొప్రయిటర్ కేసి చూశాడు.

"మనం వూహించని విధంగా ఎన్నో సంఘటనలు జరుగుతూ వుంటాయి" అని పద్మరాజు తన టాక్సీవైపు నడిచాడు.

—:అ యి పో యి ం ది:—

సీరియల్

# విషసర్పిణి

## సికిందర్

(గత సంచిక తరువాయి)

వాళ్ళిద్దరిప్పుడు ఉదయం పదిగంటలకి కలుసుకుని మాట్లాడుకుంటున్నారు. కృష్ణన్ అన్నాడు, "జాన్ నాకు ఫోన్ చేశాడు రాత్రి. హత్యాస్థలాల్లో మొన్న తీసిన ఫోటోల్లో ఆ మైక్రోఫోన్స్ ఆగంతుల్ని డ్రింక్ మోర్ బార్ వాళ్ళు గుర్తిస్తారేమో చూస్తానన్నాడు. మళ్ళీ ఫోన్ చేస్తానన్నాడు. కానీ చేయలేదు. అతను వెళ్ళిన కారు మనకు రాత్రే ద్వారకాముందు దొరికింది.... నాకొకటి అనిపిస్తోంది, మిష్టర్ లాల్."

"ఏమిటి?"

"శత్రువులకి రెండు స్థావరాలుండాలని."

"అవును."

"ఒక స్థావరంలోంచి మీరు వస్తూండగానే, మరో దాంట్లో జాన్ బందీ అయిపోయినట్లున్నాడు."

"ఓహ్...."

"అతను మీకోసమే వెళ్ళాడు. మీరిలా బయటికొచ్చారు, అతనలా లోపలికెళ్ళాడు....అంతే జరిగింది. వాళ్ళు మీ కారును తమ వద్ద వుంచుకోదలచలేదు. అందుకే ద్వారకాముందు వదిలేసిపోయారు."

లాల్ తలూపాడు. "అదే జరిగివుండవచ్చు.... ఓ.కే., క్లెవర్ మైండ్. అతనికేమీ కాదు. వాళ్ళు హాని చేయరు. వాళ్ళకా ఆలోచనలేదు. నన్ను తమ అతిథిగా బాగానే చూసుకున్నారు, వాళ్ళ మనిషిని నేనొకడ్ని చంపినప్పటికీ, నో, జాన్‌ని వాళ్ళు అతిథిగానే వుంచుకుని ఆపరేషన్ పూర్తయ్యాక వదిలేస్తారు."

"అలాగే ఆశిద్దాం" అన్నాడు కృష్ణన్ వాచీ చూసుకుంటూ, "పదిన్నరయింది, ఇక వెళ్దామా?"

తలూపాడు లాల్ లేస్తూ.

* * *

"జంటిల్‌మెన్, నగరంలో మరికొన్ని హత్యలు జరిగాయి. మనం నివారణోపాయాలెన్ని ఆలోచించినా ఈ హత్యలు నిరాటంకంగా జరిగిపోయాయంటే, మన వ్యవస్థలో, మన ఆలోచనల్లో యెక్కడో లోపముందని తెలుస్తోంది.... సత్వరం ఈ లోపాన్ని కనుక్కొని మనం సరిదిద్దుకోకపోతే ఈ హత్యల పరంపరకి అంతుండదు. పబ్లిక్‌లో మన ఇమేజ్ దెబ్బ తింటుంది. ఇప్పటికే ప్రజలు మన అసమర్థతని వేలెత్తి చూపుతున్నారు. మినిస్టీరియల్ లెవల్లోంచి కాల్ మీద కాల్స్ వస్తున్నాయి సంజాయిషీ కోసం....

"నిన్న మనం ప్రజలకి అన్ని జాగ్రత్తలు హెచ్చరించినప్పటికీ ఈ మూడు హత్యలు జరిగిపోయాయి. సుహాసినీదేవి యథేచ్ఛగా రాత్రి స్వైర విహారం చేసింది! ఆఫ్‌కోర్స్, ఒక ప్రయత్నం విఫలమైంది. ఈ హంతకులందరూ తమకేం కాదనే గుడ్డినమ్మకంతోనో, లేక అసలీ పరిస్థితుల గురించి తెలియకనో, లేక అంత త్వరలో తమకలాంటిది జరుగుతుందని వూహించకనో వున్నారు.

అందుకే వాళ్ళు మన హెచ్చరికల్ని పాటించలేదు. ఎవరూ మనం కోరిన ప్రకారం పోలీస్ స్టేషన్స్‌లో ఇన్ఫర్మేషన్ అందివ్వలేదు. బహుశ రేపు చూద్దాం అనుకొని వుంటారు. దీనికొక కారణముంది, జంటిల్ మెన్."

"అదేమిటంటే, మనం స్నేక్ సొసైటీ ఉత్తరాల్ని స్వాధీనపర్చుకున్నామని నిన్న ప్రకటించాం. అది వాళ్ళలో భయాందోళనల్ని తొలగించి వుంటుంది. మరొకటి, ఇకముందు వ్రాయబోయే లేఖకులు రాళ్ళకి తమ వివరాలు పోలీసుల చేతుల్లో వుంటాయనే భయంకలిగి ఆ ప్రయత్నానికి సాహసించరనుకుని వుంటారు. ఈ రెండూ సరైనవే. అయితే పొరపాటు ఎక్కడవుందంటే ఆ రోజే—అప్పటికప్పుడే చాలా ఉత్తరాలు సొసైటీకి చేరిపోయాయని తెలియకపోవడంలో."

"జంటిల్ మెన్, ఈ అనర్థం మన ఆలోచనా లోపం వల్లే జరిగిందని ఒప్పుకోవాలి. సొసైటీకా ఉత్తరాలెలా అందాయి? పోస్టాఫీసుల్లోంచి కాదు. స్పెషల్ బ్రాంచి క్లారిఫై చేస్తోంది. మరి క్లియరెన్స్ బాయ్స్‌మీద దాడులు జరిపికూడా కాదు. వాళ్ళంతా సురక్షితంగా బ్యాగుల్ని పోస్టాఫీసులకి చేరవేశారు. అయితే గమనించాల్సింది, వాళ్ళ కలెక్షన్‌లో సొసైటీ ఉత్తరం ఒక్కటీ లేకపోవడం! కేవలం మనకు పోస్టాఫీసులవద్ద లెటర్ బాక్సులలోనే అవి లభించాయి, చాలా తక్కువ సంఖ్యలో, ముప్పైరెండు మాత్రమే. దీన్నిబట్టి ఒక్కటే స్పష్టమవుతోంది...."

"అదేమిటంటే, జంటిల్ మెన్, క్లియరెన్స్ టైము కంటే ముందుగానే నిన్న నగరంలోని అనేక ప్రాంతాలలో లెటర్ బాక్స్‌లు అనధికారంగా తెరువ

బడ్డాయని! వాటిలోంచి స్నేక్ సాప్తైటీకి పోస్టయిన ఉత్తరాలు మాత్రం మాయమయ్యాయి. అలా చేయడం పోస్టాఫీసుల్లో వీలుకాదు కాబట్టి, అక్కడి బాస్సల జోలికి పోలేదు. ఓన్లీ గాడ్ నోస్! వాళ్ళకెన్ని ఉత్తరాలు లభించాయో మనం వూహించలేం!"

ఇంతవరకు చెప్పి, అందరివంకా చూశాడు డి.జి.పి.

కాన్ఫరెన్స్‌లో అందరూ తలలు పంకిస్తూ శ్రద్ధగా వింటున్నారు.

"జంటిల్ మెన్" తిరిగి కొనసాగించాడతను. "నిన్నటి హత్యలు, ఈ మూడు హత్యలూ ఇదివరకు జరిగిన ప్రకారమే జరిగాయి—గుండెల్లో పొడిచి, అదే రకం కత్తులతో. కాకపోతే ఈసారి కత్తులకి లేబుల్స్ లేవు. వాళ్ళ ఉద్దేశ్యం స్పష్టమవుతోంది — ఆ ఉత్తరాలు వ్రాసిన వాళ్ళని ఇంప్లికేట్ చేయదల్చుకోలేదు వాళ్ళు. కాబట్టి ఆ లేఖకురాళ్ళని కనుక్కోవడం మనకు దుస్సాధ్యం—ఒకవేళ హితుల సన్నిహితుల కెవరికైనా వాళ్ళ ప్రైవేట్ జీవితాల గురించి తెలిసివుంటే తప్ప. అప్పుడు వాళ్ళు ముందుకొస్తారనే గ్యారంటీ కూడా లేదు.

"ఈ మూడు హత్యాస్థలాల్లోనూ మనకే ఆధారమూ దొరకలేదు. వేలిముద్రలు లేవు. ఆమె గ్లవ్స్ ధరిస్తోంది. నాలుగో ప్రయత్నం జనార్ధనరావనే అంబర్ పేట నివాసి అయిన లెక్చరర్ మీద జరిగినప్పుడు, అతడామెని అదే కత్తితో గాయపర్చి తప్పించుకోగల్గాడు. ఆమె కారెక్కి పారిపోయింది. ఆ కన్ఫ్యూజన్‌లో జనంలో ఎవరూ కారు నెంబర్ చూడలేకపోయారు. కానీ దాన్ని వైట్ అంబాసిడర్‌గా గుర్తించారు.

"ఆ కత్తిని జనార్ధనరావు పోలీస్ స్టేషన్‌లో అందిం

చాడు. దాన్ని ర క్తం మరకలతో సహా ప్రిజర్వ్ చేయడం జరిగింది. కానీ జనార్థనరావ్ తనమీద ఎవరీ ప్రయత్నం చేయించిందీ వెల్లడించడానికి నిరాకరిస్తున్నాడు. పరువు ప్రతిష్టల భయానికయి వుంటుంది—

"ఇక మనం మేల్కోవాలి. ఇంకా ఇలా ఘోరాలు జరగడానికి వీల్లేదు. థాంక్ గాడ్, రాత్రి ఆ వాళ్లో ప్రయత్నం విఫలం గాకపోతే ఇంకెన్ని హత్యలు జరిగేవో! తన కారు నెంబర్ తెలిసిపోయి పోలీసులు ఎలర్టు అవుతారనే భయానికి అంతటితో ముగించుకొని ఆమె వెళ్ళిపోయింది. లేకపోతే మరికొన్ని హత్యలు నిశ్చయంగా జరిగేవి....

"ఇవ్వాల్టినించి పాట్రోలింగ్ రాత్రిపూట మరింత పటిష్టం చేయాలి. ఆమె మళ్ళీ అదే కారులో వస్తుందనుకోను. కన్పించే ప్రతీ కారుని సుహాసిని కోసం చెక్ చేయాలి. షి ఈజె పర్ వర్టెడ్ కేస్. సైకో మేనియాక్ అండ్ ఎ డేంజరస్ మర్డరెస్. ఆమెను సజీవంగా పట్టుకోవడం సాధ్యం గాకపోతే — వి మస్ట్ నాట్ హెసిటేట్ టు షూట్ హార్ డవున్!

"అలాగని ఆమె కన్పించిందే తడవుగా ఆ పని చేయకండి—ఇట్ షుడ్ బి ది లాస్ట్ రిసార్టు. ట్రిగ్గర్ హేపీ ఆఫీసర్స్ సహనం పాటించాలి."

"మన ఆఫీసర్లు చాలా సహనపరులు, సానుభూతి పరులు కూడా. ఆడ ప్రాణి యెంత క్రూరమైనదైనా సరే కన్పించిందే తడవుగా ఆయుధాలు ప్రయోగించరువాళ్లు" అన్నాడు లాల్ అందర్నీ నవ్వుతూ చూస్తూ.

అక్కడున్న వాళ్ళంతా మొహమాటంగా, ఇబ్బందిగా మొహాలు చూసుకుని తలలు దించుకున్నారు.

డి.జి.పి. కూడా నవ్వాడు. "ఆల్ రైట్, నా యూసీ మిష్టర్ లాల్, యూ ఆర్ ది లీడింగ్ మేన్. మొదటి నించీ మీరిందులో ఇరుక్కుని వున్నారు కాబట్టి, కొంత కాలం వాళ్ళ ఆతిథ్యం పుచ్చుకునే వచ్చారు కాబట్టి, వాళ్ళ ఆకారాలనుంచీ మొత్తం వాళ్ళ మోడస్ ఆపరెండి గురించి మీకున్నంత విస్తృత పరిచయం మాకింకా ఏర్పడలేదు. కాబట్టి వాళ్ళ పూర్తి వ్యవహారాన్ని సత్వరం అంత మొందించడానికి మిమ్మల్ని సారథ్యం వహించమని కోరుతున్నాను...."

లాల్ వెంటనే తలూపాడు. "అయితే నేను కొన్ని సూచనలు చేయాలనుకుంటున్నాను....ప్రాణభయం వున్న వాళ్ళెవరైనా సరే, ఇప్పటికైనా వాళ్ళ బిడియం బెరుకు అన్నీ వదిలేసి, పోలీస్ స్టేషన్స్‌లో ఆ ఇన్ఫర్మేషన్ డిపాజిట్ చేయడం మంచిది.

"గ్యాంగ్ దగ్గర ఇంకా చాలా ఉత్తరాలున్నాయి. ఈ రోజు వాళ్ళెవరెవర్ని ఎన్నుకుంటున్నారో తెలియదు. చీకటిపడితే అందరూ జాగ్రత్తగా వుండాలి. యెవరూ తలుపుకొట్టిన వెంటనే వెళ్ళి తీయకూడదు. ముందు ఆ మనిషెవరో నిరారించుకోవాలి. అనుమానం వేస్తే ఉపాయంగా పట్టుకోడానికి ప్రయత్నించాలి. లేదా భయం వేస్తే కేకలు వేసి ఇరుగుపొరుగువారిని ఎలర్టుచేయాలి.

"ఈ రోజు మళ్ళీ సుహాసిని ఫోటో ఈవెనింగర్స్‌లో వేసి, ఆమెని బాగా గుర్తుంచుకోమని ప్రజలకి విజ్ఞప్తి చేయాలి.

"ఇప్పుడు—కొన్ని గంటల్లో—సిటీలోని అన్ని లెటర్ బాక్సులకి తాళాలు మార్చేయమని ఆదేశించాలి. కొన్ని వందలుగా వున్న లెటర్ బాక్సులన్నిటివద్దా మనం నిఘా

ఏర్పాటు చేయలేం కనుక, ప్రతి గంటకూ వాటిలో క్లియరెన్స్ జరిగేటట్లు చూడమనాలి. వీలైనంతవరకు నిఘా కూడా ఏర్పాటు చేయాలి—

"ఇక సుహాసిని తిరిగి అదే కారులో గాని, అసలు వేరే కారులో గానీ వస్తుందనుకోలేం. ఇంకేదైనా ఒక వాహనాన్ని—లేదా వేర్వేరు వాహనాల్ని ఉపయోగించవచ్చు. ట్రైను, బస్సు, ఆటో, టాక్సీ, రిక్షా....ఇలా ఏ పబ్లిక్ వాహనాల్లోనైనా బయల్దేరితే ఆనవాలు మరుగు పర్చుకోవచ్చు. బురఖా వేసుకొని, లేదా ఏ శాలువా లాంటిదో కప్పుకుని. దీన్ని కూడా హెచ్చరించాలి."

లాల్ చెప్పి వాళ్ళ అభిప్రాయంకోసం చూశాడు.

వాళ్ళు అంగీకారంగా తలలూపారు.

కళ్ళు విప్పిచూశాడు జాన్.

• • •

తనెక్కడున్నాడో అక్కడే వున్నాడు, రాత్రినుంచీ ఇదే గది. ఆ గదిలో పైన వెంటిలేటర్‌లోంచి మాత్రం కొంత వెలుతురు వస్తోంది. లైటు లేదు, ఫ్యాను లేదు. ఇంట్లో శబ్దాలు, మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

రాత్రి అతను దెబ్బతిని పడిపోయాక ఏం జరిగిందో తెలియదు. చాలాసేపటి తర్వాత కళ్ళు తెరచి చూస్తే ఈ గదిలో వున్నాడు, పడుకోబెట్టి. కట్టివేయలేదు. జేబుల్లో తన వస్తువులేవీ లేవు. చేతికి వాచీ కూడా లేదు.

అప్పుడొక ఎత్తుగా, భారీగా, కడిచెంపకు కురుపులో వున్న మనిషి వచ్చి, తనకేం ఫర్వాలేదని అన్నాడు. అన్ని సదుపాయాలూ చక్కగా అమరుతాయి, రెస్టు తీసుకోమన్నాడు.

తిరిగి తెల్లవారాక ఇద్దరు రివాల్వర్ మనుషులు వచ్చి

బాత్‌రూంకి తోడ్కొని పోయారు. అక్కడ పావు గంటసేపు వుండనిచ్చి తిరిగి గదికి తెచ్చారు. మర్యాద చేశారు. ఫలహారాలు పెట్టారు. అవన్నీ సుష్టుగా ఆరగించి గాఢనిద్రపోయాడు జాన్. తిరిగి ఇప్పుడే కళ్ళు తెరిచాడు.

ఇప్పుడు చాలా దగ్గర్లో మాటలు విన్పిస్తున్నాయి. లేచి మంచం దిగి కుడివైపు గోడదగ్గరికి కదిలాడు. చెవులు రిక్కించాడు. ఆ పక్క గదిలోంచే విన్పిస్తున్నాయి....

"మీ ఒక్కొక్కడి తెలివితక్కువతనానికి నాకు కళ్ళు మండిపోతోంది జింబో. మిమ్మల్ని షూట్ చేస్తాను...."

"ఆగు, ఈ ఒక్కసారికి క్షమించు. ఈ రాస్కెల్స్ వల్ల అలా జరిగింది. పోతే బ్రోతల్స్‌కి, లేకపోతే బఫూన్ పన్లు. వీళ్ళని నేను తీర్చిదిద్దుతాను, ఈ ఒక్కసారి క్షమించు...."

"ఇదింకా బాస్‌కి తెలియదు! లేకపోతే యాసిడ్‌లో పడుండేవాడ్ని ఈపాటికి నేను! ఇదెంత సీరియస్ సిట్యుయేషనో తెలుసా మీకు, మూషికల్లారా! ఆ డిటెక్టివ్‌ని తప్పించుకోనియ్యడమంటే మనం సూసైడ్ చేసుకోవడమే!"

"జాన్ ఉలిక్కిపడ్డాడు, ఈ చివరి మాటలకి.

"నో, ఆ డిటెక్టివ్ ఏమీ చేయలేడు. మన వ్యాను తీసుకెళ్ళాడు. కానీ దానివి ఫేక్ నెంబర్లు, ఆ యింటి ఓనర్ని పట్టుకుని మనల్ని ట్రేస్ చేయలేడు. మేం వస్తూ వాడి పీక నొక్కివచ్చాం."

"ఓహ్, శభాస్ జింబో! ఇప్పుడు నీ తెలివిని మెచ్చుకుంటున్నాను.

"మరి ఇవ్వాళ మన ఆపరేషన్ —?"

"జరుగుతుంది. దానికి అడ్డులేదు. ఇదిగో లిస్టు తయారు

చేశాడు బాస్....ఇవ్వాళ్టి సుహాసిని కోటా ఇది...."

"గాడ్, ఇందర్నా!"

"నిన్నటి కోటా పూర్తిచేయలేదామె. అందుకని నిన్న మిగిలిందీ ఇవ్వాళ్టిదీ కలిపి ఇచ్చాడు బాస్. ఇవ్వాళ ఎలాగైనా పూర్తిచేయాలి. వెరీ బ్యాడ్ జింబో. ఇంకా మనకు లెటర్స్ దొరికేటట్టులేవు. వాళ్ళు మోసం గ్రహించే వుంటారు. మనం ఆ ఛాయలకి పోవడం ఇప్పుడు ప్రమాదకరం. నిన్నటి ముఠాని మాన్పించు. వాళ్ళ ఫీజు ఇచ్చేశాంగా? మళ్ళీ పరిస్థితులు అనుకూలిస్తే చూద్దాం. పైగా ఇప్పుడెవరూ! మనకు ఉత్తరాలు వ్రాస్తారనుకోను—"

"పోలీసులు చెడగొట్టారు, హెచ్చరికలు చేసి!"

"బాస్ రెచ్చిపోయాడు, జింబో. కానీ దీనికి మన లేమీ అనలేడు. మనం ఉన్నంతలోనే యొక్కువ ఫలితాన్ని సాధించి తృప్తిపరచుదాం!"

"బాస్‌కి తృప్తిలేదు. కాడిస్టులకి తృప్తి వుంటుందా?"

"కాడిజంతో మనల్ని వేధించడంలేదు, అది నయం! ఇవ్వాళ అంతా సజావుగా సాగితే, రేపటికి పూర్తి కోటాతో ఆపరేషన్ని ముగించెయ్యొచ్చు, జింబో. ఆ తర్వాత బెంగుళూరు అంటున్నాడు, బాస్...."

"బెంగుళూరా? ఐ లవ్ దట్ ప్లేస్? ఐ లవ్ దట్ సిటీ!"

"ఆ తర్వాత బొంబాయి, కలకత్తా, న్యూఢిల్లీ, మద్రాసు, ఈ నాలుగుచోట్ల నెలరోజుల్లో ముగించుకుని డిస్‌బర్స్ అయిపోవాలి. బాస్ మిడిల్ ఈస్ట్ వెళ్ళి పోతాడు. అప్పుడు మనం వీలయితే వేరే ఆర్గనైషన్‌ని స్థాపించుకుందాం."

"ఐ లవ్ ఇట్! ఐ లవ్ ఇట్! మరి సుహాసిని—?"

"ఓహ్....ఆ పూర్ గర్ల్. మన యాక్టివిటీ పూర్తయ్యాక ఆమెని ఫినిష్ చేసెయ్యమన్నాడు బాస్."

"గాడ్! ఈ ఉద్రేకంలో ఆమె మనం తనకేం చేశామో ఆలోచించడంలేదు. యే క్షణంలోనైనా నార్మల్‌గా నే తన ఫాదర్ చావుకి, లవర్ చావుకి, మదర్ చావుకి—బ్రదర్—మనల్ని బ్రతకనిస్తుందా అని!"

"ఆమె నార్మల్‌కి రాకుండా చూడాలి. ఆమె మన మీద తిరగబడకూడదు, యూసీ? లేకపోతే మనం, మన ఆపరేషనూ, టక్కుటమారాలన్నీ ఏకొదమ్మున గోవిందా! యాసిడ్‌లో పడడంకంటే అది ఘోరం కదూ?"

"ఓహ్, అలా అనకు. అసలు ఎక్కడుంది యాసిడ్ గుంట? బాస్ వూరికే అలా సినీ విలన్ స్టయిల్‌లో బెదిరిస్తాడుగాని...."

"తవ్విస్తాడట, అప్పటికప్పుడు."

"పెద్ద శాడిస్టు!"

"పద, అతని దగ్గరకెళ్దాం. సెషన్‌కి కూర్చోవాలి.."

వాళ్ళు వెళ్ళిపోతున్న అడుగులు.

ఆ తర్వాత నిశ్శబ్దం.

జాన్ తేరుకుని కదిలాడు. లాల్ తప్పించుకున్నట్లు తెలిసింది. అతన్ని ఇక్కడ బంధించలేదు. ఆ చోటువేరే, ఈ చోటు ఎక్కడో తనకు బాగా తెలుసు. లాల్ ఎలా తెలుసుకుంటాడు?

అంతలో ఎవరిదో దగ్గు విన్పించింది, ఇటుపక్క గదిలోంచి.

ఆడ గొంతు.

జాన్ కలవర పడ్డాడు.

ఎవరది? సుహాసినియా?

ఆమె ప్రక్క గదిలోనే వుందా?

వేగంగా అటు నడిచి గోడకు చెవి ఆనించాడు. ఏమీ వినిపించలేదు మళ్ళీ. నిట్టూరుస్తూ వచ్చి పడుకున్నాడు. కప్పుకేసి చూస్తూ తీవ్రంగా ఆలోచించసాగాడు....ఎలా బయటపడాలి?

* * *

"నో! స్నేక్ సొసైటీ అలా చెయ్యదు! వాళ్ళు చంపుతున్నారు! నీలా బెదిరించరు! నువ్వు చెప్తున్నది అబద్ధం!"

సాధ్యమైనంత గొంతు పెంచి అరిచాడు విశ్వేశ్వరరావు, ఫోన్‌లో.

అరవై ఏళ్ళవాడు. ఇరవై ఏళ్ళయింది భార్య గతించి.

"సరే, మిస్టర్ రావ్. నా మాటలు నమ్మకపోతే నీ ఖర్మ! నీమీద మూడు ఉత్తరాలందాయి, నీ వీధిలో వాళ్ళే వ్రాశారు. వాళ్ళ పిల్లల్ని నువ్వు—యూ హేవ్ సెక్సువల్లీ ఎ సాల్టెడ్ దెమ్. కానీ చూస్తూ చూస్తూ నీ ముసలి ప్రాణాలు తీయడానికి మనసొప్పడంలేదు. మేం తీయదల్చుకుంటే నువ్వు చేయగల్గేదేమీ లేదు కూడా. నీకు జరిమానాతో క్షమించేయాలనుకుంటున్నాం. ఇంతకు మించి గత్యంతరం నీకు లేదు. చెప్పు నీకేది ఇష్టం?"

"ఎంత కావాలి నీకు?"

"కనీసం మూడు లక్షలు."

రావ్ ఆలోచించాడు, "సరే, ఎప్పుడొస్తావు?"

"నువ్వే రావాలి."

"ఎక్కడికి?"

"వరంగల్ రూట్లో తాటితోపుకి..."

"వివరంగా చెప్పు."

కాస్సేపు అవతలనించి వేగంగా మాటలువిన్పించాయి.

"ఆర మొందా? రాత్రి పన్నెండున్నరకి."

"అలాగే వస్తాను."

"నిన్ను గుర్తించడానికి ఈ కోడ్ చెప్పాలి...."

"ఏమిటది?"

"శ్వాస ప్రాణం-కాసుల బేరం" కట్ అయిందిలైను.

అతను నిట్టూరుస్తూ పెట్టేశాడు.

అవతల శంభూనాథ్ కూడా పెట్టేసి బిగ్గరగా నవ్వాడు. వెంటనే ప్రక్కనున్న యువతి ఎత్తి తను ఇంకో నెంబర్ తిప్పసాగింది....

"ఎలా వుంది, జింబో?"

జింబో సకిలిస్తూ గంతు లేయసాగాడు, "హై—హయ్యా! హై—హయ్యా! ధనమేరా అన్నిటికీ మూలం... ఆ ధనము విలువ తెలుసుకొనుట మానవ ధర్మం...."

శంభూనాథ్ విరగబడి నవ్వసాగాడు.

* * *

ఆ కారు చల్లని మెర్క్యురీ దీపాలకాంతిలో మెత్తగా జారిపోతోంది....

సమ వేగంతో, ఏ తొందరపాటూ లేకుండా, తీరిగ్గా సాగిపోతూన్న ఆ వైట్ అంబాసిడర్ని చూస్తే ఎవరికీ అనుమానం కలగదు—ఆ పరిస్థితుల్లో. , అది ఆపిన ప్రతి చోటా ఆగి, అనుమానాలు తీర్చిపోతోంది అధికారులకి.

ఆ కారులో వున్న ఒకే ఒక్క మనిషి—ఠీవిగా డ్రైవ్ చేస్తున్న ఆమెలో ఎలాంటి అదురూ బెదురూ లేవు. ప్రతి అడ్డంకివద్దా తను జయిస్తున్న గర్వపాటుగానీ, ప్రతి అధికారినీ చిత్తుచేస్తున్న మిడిసిపాటు గానీ, ఏ కోశానా ఆమెలో లేవు. ఆమె ముఖంలో ఎలాంటి భావాలూ లేవు.

అదెప్పటి స్థితిలోనే వుంది—శిలగా.

ఆమె కారు బాలానగర్ వైపు సాగిపోతోంది....

నైట్ పాట్రోలింగ్ చేస్తున్న పోలీసు వ్యానులు సాధ్యమైనంతవరకు ప్రతి వీధినీ కవరు చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. అంతకుముందే సాయంకాలం వీధివీధికీ తిరిగి హెచ్చరికలు చేశారు. ప్రతి వీధిలోని యువకులు జట్లు జట్లుగా ఏర్పడి, వంతులవారీగా రాత్రి కాపలా వుండాలని కోరారు.

కానీ దానికెవరూ అంగీకరించలేదు. వాళ్ళంతా సుహాసిని చేస్తున్నదాన్నే బలపర్చారు. ఇదెవరో దుండగులు ధనంకోసం చేస్తున్న హత్యల గొడవకాదు. ఈ హత్యలు ఒక ఉన్నతాశయంతో జరుగుతున్నాయి. సమాజంలోని చీడపురుగుల్ని ఏరివేస్తోంది సుహాసిని. దీనికెప్పుడూ తమ సమ్మతి వుంటుందని సుహాసినీదేవి జిందాబాద్, స్నేక్ సొసైటీ వర్ధిల్లాలి!!—అంటూ సహాయనిరాకరణకే పూనుకున్నాయి, అన్ని విద్యార్థి సంస్థలూ.

పోలీసులకి సమస్య వచ్చిపడింది. దీన్నిక పూర్తిగా తామే ఎదుర్కోవాలని నడుం కట్టారు. అయితే పైకి విశ్వాసంతోనే వున్నా, సరిపోని బలగంతో ఇది తమకు సాధ్యమేనా అన్న శంక పీకుతూనే వుంది.

ఒంటరి స్త్రీలతో తమకు తారసపడుతున్న ప్రతికారు వర్ణనని, అది వెళ్తున్న మార్గాన్ని, టైమునీ ఎప్పటికప్పుడు ట్రాన్స్‌మిట్ చేయసాగారు.

ప్రస్తుతం వైర్‌లెస్ కారులో కృష్ణన్‌తో ప్రయాణిస్తూ ఆ వివరాలన్నీ రికార్డుచేస్తున్న లాల్, తదేకధ్యానంతో వాటిని ఎనలైజ్ చేయసాగాడు.

ఇప్పుడు సమయం ఒంటిగంటన్నరవుతోంది.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ము ఖ చి త్రా ల కు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

ఇంతవరకూ అనుమానాస్పదంగా ఏ కారూ తటస్థ పడలేదు, పాట్రోలింగ్ స్క్వాడ్స్‌కి.

ఈ మూడు గంటలనుంచీ లాల్ రికార్డుచేసిన కార్ల సంఖ్య 211.

ఇందులో కేవలం ఒక్కసారే తారసపడ్డ కార్ల సంఖ్య 57.

రెండు మూడుసార్లు కన్పించిన సంఖ్య 122.

మూడునుంచి అయిదుసార్లు కన్పించినవి 31.

ఈ మూడు వర్గాలకి చెందినవీ — అవి తారసపడ్డ స్థానాల్ని గమనిస్తే—వాటి గమన మార్గాల్లో ఎలాటి సంశయమూ కలగడంలేదు లాల్‌కి. అవన్నీ నేరుగా తమ గమ్యాలకే సాగిపోతున్నట్టు తెలుస్తోంది—వివిధ పాయింట్లవద్ద అవి తీసుకున్న ప్రయాణ కాలాన్ని బట్టి చూస్తే.

కానీ నాల్గో వర్గంగా ఇంకో కారుని—ఒకే ఒక్క కారుని కూడా విభజించాల్సి వచ్చింది.

ఇదే మిగిలిన వాటన్నింటికంటే భిన్నంగా వుంది.

ఇది పధ్నాలుగుసార్లు తారసపడింది.

అన్నిసార్లూ వివిధ ప్రాంతాల్లో.

ప్రతిసారి తారసపడ్డప్పుడు తీసుకున్న టైము కూడా ఎక్కువే.

ప్రయాణ మార్గం అస్తవ్యస్తంగా వుంది.

అది 10:20కి యూనివర్సిటీ రోడ్‌లో కన్పిస్తే, పది నిమిషాల తర్వాత విద్యానగర్‌లో రెండుసార్లు కన్పించింది. 10:50కి అంబర్‌పేటలో రెండుసార్లు కన్పిస్తే, 11:15కి కాచీగూడలో మూడుచోట్ల కన్పించింది. 11:45కి దిల్‌సుఖ్‌నగర్‌లో ఒకచోట కన్పిస్తే, 12:10కి

ఈదీ బజార్ లో రెండుచోట్ల కన్పించింది. మళ్ళీ 12:23కి కారవాన్ లో కన్పిస్తే, 12:48కి మెహిదీ పట్నంలో కన్పించింది. తిరిగి 1:00కు లకడీకాపూల్ వద్ద కన్పిస్తే, 1:21కి బాలానగర్ లో కన్పించింది. అక్కడ్నించి ప్రస్తుతం లేటెస్టుగా అందిన దాన్నిబట్టి 1:42కి సనత్ నగర్ లో వుంది....

ఈ పరిశీలన లాల్ ని ఆందోళన పర్చింది.

అప్పటికే సమయం చాలా మించిపోయిందని అన్పిం చింది....

ఆ కారు వలయాకారంలో నగరాన్ని చుడుతోంది. అది వైట్ అంబాసిడర్, నంబర్ APQ 7070. అందులో ఒక్క స్త్రీ మాత్రమే ప్రయాణిస్తోంది. ఆమె వయసు పాతికలోపే వుంటుంది.

కానీ ఎందుకో ఆమె ఎక్కడా సుహాసినిగా గుర్తింప బడలేదు!

"వెల్, వెల్, యూ సీ కృష్ణన్, డిసీజ్ అవర్ డెస్టినేషన్!"

"ఏది?"

"ఈ APQ 7070 వైట్ అంబాసిడర్! ఇప్పు సనత్ నగర్ చేరింది!"

"ఆర్యూ ష్యూర్?"

"డామ్ ష్యూర్! కమాన్, లెటజ్ దేర్! ఎలర్ట్ ఫోర్స్, క్విక్!"

కృష్ణన్ సంభాషణ రిసీవరందుకుని అందులో అరవ సాగాడు. వాళ్ళ కారప్పుడు పబ్లిక్ గార్డెన్స్ దగ్గర వుంది.

(ఇంకా వుంది)

